# భారతదేశం, రష్యావిప్లవం

రచయిత:

ఎస్. జి. సర్దేశాయి

అనువాదం:

కంభంపాటి సత్యనారాయణ

విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్

ఏలూరు రోడ్డు : : విజయవాడ - 2.

# విషయానుక్రమణిక


పుట

ప్రవేశిక 9

ఉపోద్ఘాతం 30

మొదటి అధ్యాయం :

రష్యావిప్లవమంటే అర్థం 39

రెండవ అధ్యాయం :

భారత జాతీయవాదులకు కొత్త వెలుగు 50

మూడవ అధ్యాయం :

కార్మికులు, కర్షకులు : రంగస్థలిపై కమ్యూనిజం ప్రవేశం 70

నాల్గవ అధ్యాయం :

లెనిన్, భారతదేశ స్వాతంత్ర్యం 90

ఐదవ అధ్యాయం :

1930 – 40 నాటి సిద్ధాంత సాంస్కృతిక వెల్లువ 103

ఆరవ అధ్యాయం :

జాతీయైక్య సంఘటన నిర్మాణం 127

ఏడవ అధ్యాయం :

ఫాసిస్టువ్యతిరేక యుద్ధం, స్వాతంత్ర్యం 155

# రచయిత

శ్రీనివాస్ జి. సర్దేశాయ్ భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యదర్శివర్గ సభ్యుడు. 1927 లో బొంబాయి విశ్వ విద్యాలయంలో బి. కాం. మొదటి తరగతిలో ప్యాసయారు. వెంటనే రాజకీయ కార్య కలాపాలో ప్రవేశించారు.

అహమ్మద్‌నగర్ జిల్లాలో అటవీ సత్యాగ్రహం నడిపిన వారిలో శ్రీ సర్దేశాయ్ ఒకరు. ఇందుకు 1930 లో ఆయనకు జైలుశిక్ష విధింపబడింది.

1931 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు, కరాచీ కాంగ్రెస్‌లో పార్టీ ప్రతినిధిగా ఉపన్యసించారు. 37 సంవత్సరాల రాజకీయ జీవితంలో శ్రీ సర్దేశాయ్ పార్టీ ఆర్గనైజరుగా, ట్రేడ్ యూనియనిస్టుగా, కిసాన్ సభ కార్యకర్తగా, జర్నలిస్టుగా, రచయితగా ప్రఖ్యాతి గాంచారు.

1937 లో మహారాష్ట్రనుంచి అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యుడుగా ఎన్నుకోబడి 1946 వరకు ఆ స్థానంలో ఉన్నారు. 1943లో మొట్టమొదట సారిగా భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ సభ్యుడుగా ఎన్నుకోబడ్డారు.

శ్రీ సర్దేశాయ్ దాదాపు ఏడు సంవత్సరాలు జైల్లో గడిపారు. అంతేగాక నాలుగు సంవత్సరాలు అజ్ఞాత రాజకీయ జీవితం గడిపారు. సంయుక్త మహారాష్ట్ర ఉద్యమంలో వీరు చేసిన కృషి చాలా మందికి తెలుసు. జాతీయ అంతర్జాతీయ సమస్యలకై వ్యాసాలు పుస్తకాలు వ్రాశారు.

1964 డిసెంబరులో బొంబాయిలో జరిగిన భారత కమ్యూనిస్టుపార్టీ ఏడవ మహాసభకు శ్రీ సర్దేశాయ్ జాతీయ సమితి తరఫున అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై నివేదిక సమర్పించారు. పార్టీకార్యక్రమాన్ని రూపొందించిన డ్రాఫ్టింగు కమిటీలో వీరు సభ్యులు.

విదేశాల్లో జరిపిన కమ్యూనిస్టు సమావేశాల్లో శ్రీ సర్దేశాయ్ భారత కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధిగా వ్యవహరించారు.

ఉదా : 1965 లో మాస్కోలో జరిగిన 19 కమ్యూనిస్టుపార్టీల సంప్రతింపుల సభ; ప్రాగ్‌లో జరిగిన కమ్యూనిస్టుపార్టీల అంతర్జాతీయ గోష్ఠి.

సోవియట్ వారు మోయిను చీల్చిస్తారు...యిది మహా ప్రయత్నం. యేసు క్రీస్తు బోధలు దీనికి అనుగుణ్యంగానే వుంటవి. పూర్వం ముని పల్లెలలో యీ పద్ధతే జరిగేదనుకుంటాను."

"ధర్మ కన్న" మంటే ఏమిటో వివరిస్తూ వెంకటదాసు చెప్పిన యీ క్రింది మాటల్లో సూటి వర్గ దృక్పథం తొణికిసలాడుతూ ఉంటుంది.

"వెంకట : ఏ పేరుతోనైనా పిలవండి. అంతా దొంగలే. కాని వాళ్ళెవరు ? పెద్ద సెట్లు పెద్ద దొంగలు. 'వణిగ్వరః పట్టణమధ్య చోరః.' కొందరు దొంగలు దార్లు కొడతారు. మరి కొందరు బయటనుంచివచ్చి కన్నంవేస్తారు, మరికొందరు ఊళ్ళో మేడల్లోవుండి దాళాలో, తూనికెలో పిక్కి, కల్తీచేసి, తప్పు ధరలు చెప్పి పెద్ద సెట్లవుతారు. వీటి సారమంతా కలిసి యింతలావు బొజ్జతో లక్షాధికారనే బొమ్మ అవుతుంది."

ఈ మార్గం "అధర్మం," "లోక కంటకం" అన్న తన చెల్లెలి ఆక్షేపణకు జవాబు చెబుతూ వెంకటదాసు యిలా అంటాడు :

వెంకట: ధర్మానికి వ్యవస్థలేదు. దేశకాల పాత్రలనుబట్టి ఉంటుంది. ధర్మం చాలాకాలం క్రిందటనే పెడదారి పట్టింది. నేను చేసేయుద్ధం పౌరుషమనీ, ప్రతాపమనీ, దేశాభిమానమనీ, ధర్మరక్షణమనీ పేర్లు పెట్టారు. స్వలాభ ప్రేరితులై, భాగ్యవంతులు లక్షలకొలది బీదజనులను రణరంగాల్లో బలి దీస్తారు. లోభుని ప్రతినిధులైన, ధర్మ వినాశకులైన భాగ్యవంతులమీదనే నేను ధర్మయుద్ధం ప్రకటిస్తాను. రాజులు యుద్ధాలు చేసి దేశాలను నాశనంచేస్తే, నేను స్వల్ప సంఖ్యాకులైన భాగ్యవంతులను నాశనం చేస్తాను, వాళ్ళు సంఘాలను దోస్తే నేను కుటుంబాలను దోస్తాను. వాండ్లు అధర్మ చట్టాలను ఫిరంగుల బలంతో చెలాయించుకుంటే, నా బాహుబలంతో నా ఉత్తర్వులను అమల్లోపెడతాను. భాగ్యవంతుల ధన ప్రాణ రక్షణం అతడుచేస్తే, బీదలకు జీవనోపాధి నేను కల్పిస్తాను. దొంగలమయితే, ఉభయులమూ దొంగలమే. రాజు పెద్ద దొంగ, నేను చిన్న దొంగ."

దేవుడు సైతం ధనికుల తరఫునే ఉన్నాడని వాదిస్తూ, వెంకటదాసు తన తండ్రితో అన్న మాటలు :

"మీ దేవుడు ఆలనా పాలనాలేని పరరాజువలె వున్నాడుగాని, జనుల కష్ట నిష్ఠురాలు యోచించే స్వదేశీ ప్రభువుగా లేడు. యెక్కడో స్వర్గంలో ఉన్నాడంటారు. చేతగానివాడు అక్కడవుండి యీ ప్రపంచ పాలన యెందుకు నెత్తిన పెట్టుకోవాలి ? దేశంలో దుర్మార్గమింత యెందుకు ప్రబలాలి ?... దేవుడొకడుంటే, యిప్పుడాయన దగ్గరకు వెళ్ళుతా గదా ! (గాయాలవల్ల వెంకటదాసు దేహం కృశించి ఆరోగ్యం నాశనమవుతోంది-అను.) ఈమార్గం ఆయనకు పనికివస్తుందేమో కనుక్కుంటా. స్వర్గరాజ్యం దేవుడువచ్చి భూమిమీద స్థాపిస్తాడని కొందరు చెప్పుతున్నారుగదా ! ఆ వొచ్చేదేవుడికి యీ పద్ధతంతా వ్రాసి యిస్తాను. అయినా, వొక్క సందేహం. దేవుడువచ్చి ఆమాటచెప్పినా ధనికులాయనను అంగీకరిస్తారని తోచదు. ఆయన దేవుడుకాడని వాళ్ళే అంటారు, శిలువన కొడతారు. బందిపోటుదొంగ అంటారు. ఖయిదులో వేస్తారు."

నేటి సామాజిక వ్యవస్థయొక్క పుట్టుపూర్వోత్తరాలనూ, రానున్న సోషలిస్టు వ్యవస్థనూ వర్ణిస్తూ, కార్మికవర్గం ఐక్యంగా పోరాడాలని ఉద్బోధించే బుర్రకథ ఈ ఉద్యమానికి గొప్ప ప్రచారసాధనంగా ఉపయోగపడింది. ఆదిమ కమ్యూనిజంలో ప్రజలు అన్నదమ్ముల్లా జీవిస్తూ, సకల సంపదల్నీ సమానంగా అనుభవించే స్థితిపోయి, వర్గసమాజం ప్రవేశించడాన్ని రచయిత యిలా వర్ణించారు:

"ఎక్కడ జూచిన పోటీలండి యెక్కడ కలవరమె
సన్మార్గంబున జీవయాత్రలు సలుపుట దుర్ఘటము
లోకమందున చక్రవర్తియై లోభు డేలుచుండు
లోకములోని ద్రవ్యమంతయు లోభుల పరమయ్యె
అంతా నాదే అంతా నాదే అందురు జనులండి
అంతా మనదే యనెడు రోజులు అంతరించెనండి.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

భాగ్యవంతులకు బీదలెల్లరు దానిసలయినారు
పొద్దుగూకులు చాకిరి చేస్తురు పొక్కెడుకూటికిగా
యెంతచేసినా తృప్తిలేదయా యజమానులకెల్ల
రోగం రానీ నొప్పి రానీ నాగా దప్పదయా."

ఇట్టి పరిస్థితుల్లో కూలీలు నిర్వర్తించవలసిన కర్తవ్యం యీక్రింది మాటల్లో వ్యక్తం చేయబడింది :

"కూలికి విలువగలదని మీరు గుట్టు తెలుసుకోండి
కూలికి తగిన విలువ పుచ్చుకునే కూలికి మరిపోండి
నీళ్ళకూలికి వొప్పుకుంటిరా నెనరుచెరుపుకొంద్రు
పనివాండ్లందరు యేకమైతిరా ప్రపంచమే మీది
ఐకమత్యమే అన్ని పనులకు ఆధారము సుండి
శ్రేణులు గట్టి సమ్మెగట్టితే చెల్లును మీ మాట
కొట్టావద్దు తిట్టావద్దు కోర్కెలు నెరవేరున్
అసహాయ యోగము తరుణముచూచి అవలంబించండి
దానికి మిగిలిన మంత్రతంత్రములు ధరలోలేవండి."

చివరి రెండుపాదల్లో రచయిత విదేశీ పాలకులపై ప్రయోగించవలసిన సహాయ నిరాకరణకూ, స్వదేశీ దోపిడీగాండ్రపై కార్మికులు ప్రయోగించవలసిన సమ్మెకూ సామ్యం చూపించారు.

మొత్తంమీద, "మాలపల్లి" నవల జాతీయోద్యమమనే మహా వెల్లువలో సామ్యవాద బీజాలను నాటి, ముందుతరాల యువకులకు మార్గం చూపింది.

1930–34 మధ్య విజృంభించిన రెండవ జాతీయోద్యమ వెల్లువకు ప్రాతినిధ్యం వహించిన ప్రఖ్యాత తెలుగు పత్రికలపై కూడా రష్యావిప్లవం సోవియట్ యూనియను గొప్పప్రభావం కలిగించాయి. 1931, డిసెంబరు 12 తేదీ "కృష్ణాపత్రిక" "రష్యనుప్లాను" అనే శీర్షికతో ప్రచురించిన సంపాదకీయంలో యిలా తెలియజేసింది :

"రష్యను రిపబ్లికువారు ఐదు సంవత్సరముల ప్లాను నొకదానిని తయారుచేసిరి. అయిదు సంవత్సరములలోపల రష్యా తనకు కావలసిన వస్తు సామగ్రినంతను తానే యుత్పత్తి చేసికొని, సర్వవిధముల స్వతంత్రము నుండ నిశ్చయించినది ... అక్కడ సర్వము గవర్నమెంటుది— అనగా ప్రజలది. ఇప్పుడు రష్యను గవర్నమెంటు నదులకు ఆనకట్టలను కట్టి, లక్షలకొలది యకరములను సేద్యముక్రిందకు తీసికుని వచ్చుచున్నారు. ఈ పంట పాటకపు జనముదేగాని, కొలది భూస్వాములది కాదు ... ఈ వస్తు సమృద్ధియంతయు ప్రజల భాగ్యముగాని, షావుకారుల ధనభాండారముల నింపునది కాదు. ధనికుల ధనము ప్రజల దనుచున్నది. విద్యాధికుల విద్య ప్రజాసేవ కుపయోగపడుచున్నది. ప్రకృతి సంపద సహజముగ ప్రజలసొత్తే యగుచున్నది. రెండేండ్లలోపుననే యీ ప్లాను పూర్తి యగును. అప్పటకి రష్యా సర్వవిధముల స్వతంత్ర మగుటయేకాక, గోధుమలు, యంత్రములు, కిరసనాయిలు. మోటార్లు మొదలగు సరకులను విదేశములకు గూడ రవాణా చేయగల్గును. ఈ విధముగనే ఐదేండ్ల ప్రణాళికను యిండియాలోగూడ నిర్ణయించుట యవసరమని విశ్వేశ్వరయ్యగారు హెచ్చరించుచు సూచించిన వ్యాసము స్థలాంతరమున గాంచనగును."

1932 ఆగస్టు 13 తేదీ కృష్ణా పత్రిక "రష్యా సహకారోద్యమము" అనే శీర్షికతోను, 1933 మార్చి 18 తేదీని "రష్యా కార్మిక జన సంఘములు" అనే శీర్షికతోను, 1934 మే, జూన్, జూలై మాసాల్లో "రష్యను జైళ్ళు," "రష్యాలో సైన్యవ్యవస్థ," "రష్యాలోని విద్యావిధానము" అనే శీర్షికలతోను, 1935 డిసెంబరులో "రష్యాలో స్త్రీల సంస్కరణలు" అనే శీర్షికతోను వెలువడిన వ్యాసాలు సోవియట్ జీవితవిధానాన్ని ఎంతో చక్కగా వివరించాయి. వ్యాసకర్త పేరు లేకుండా 1933 డిసెంబరు 9 తేదీని "రష్యను సోవియటు పద్ధతి" అను శీర్షికతో వెలువడ్డ వ్యాసం సోవియటు రాజ్యాంగ విధానాన్ని, అందులోని ప్రజాస్వామ్య పద్ధతుల్ని వర్ణించింది. ఈ క్రింది వాక్యాలతో అది ముగుస్తుంది : "రష్యాదేశపు రాజ్యాంగముయొక్క ఆయువుపట్టు ఆ దేశములోని కమ్యూనిస్టుపార్టీ అని

వేరుగ చెప్పనక్కరలేదు. ఈ పార్టీయే రష్యాలో మహోన్నతమైన పార్టీ. దేశ కళ్యాణమునకును, దేశములోని సాంఘిక జీవితమునకునుకూడా యీ పార్టీయొక్క అపారశక్తియే కారణము."

1934 సెప్టెంబరు 22 తేదీద "రష్యాకు వెలితీరినది" అను శీర్షికతో కృష్ణాపత్రిక ప్రచురించిన సంపాదకీయం అంతర్జాతీయంగా సోవియట్ యూనియన్‌యొక్క స్థానాన్ని, దాని శక్తిని గుర్తిస్తూ, ఉత్తేజంతో వ్రాయబడింది. అందులోని కొన్ని భాగాలు :

"ఒక రాజ్యము ఎన్ని విధముల పరిభవింప బడుటకు వీలుకలదో అన్ని విధముల రష్యా పరిభవింప బడినది...ఏ దేశమును గురించియు నిన్ని అసత్య ప్రకటనలు ప్రచురింప బడలేదు, అన్ని రాజ్యములవారు రష్యాను దిగ్బంధనము గావించిరి. రష్యాతో వర్తక వ్యాపారమును వదులు కొనిరి. రష్యనులు అంటరానివారుగ నెంచబడిరి. రష్యను వార్తా పత్రికలు, రష్యను గ్రంథములు అంటుడు వ్యాధి బీజములుగ నిషేధింబడినవి. దీని కంతకును కారణములు రెండు. సామ్య సిద్ధాంతానుగుణ్యముగ సంఘమును తారుమారుచేసి పాటక జనముయొక్క ప్రభుత్వము నేర్పాటుచేయుటయే ప్రధానకారణము.

... ... ...

"చరిత్రకు, సంప్రదాయమునకు, సాంఘిక నీతికి – సర్వమునకు విరుద్ధముగ సామ్య సిద్ధాంతము నమలులో బెట్టుట – కేవలము విప్లవకర మైన అరాచకముగ భావింపబడుటలో నాశ్చర్యములేదు. ...ప్రపంచము లోని ప్రభుత్వము లన్నియు బెదరినవి. ధనాఢ్యులెల్లరు భీతిల్లిరి. ఇది ముఖ్యమైన కారణము రష్యా నాంక్షవెట్టుటకు. దానిని సహించి యూరకొనిన ఆ గాలి యేదో విధమున అన్ని దేశములలోకి ప్రాకి ప్రపంచో పద్రవమును గల్పించునని భయపడిరి. ఆ గాలి సోకకుండుటకు రష్యాతోడి రాకపోకలను, ఆదాన ప్రదానములను, వర్తక వ్యాపారములను గట్టిపెచిరి. రష్యా నాంక్ష పెట్టుటకు మరియొక కారణము గూడ కలదు. జారు ప్రభుత్వమువారు ఇంగ్లాండు, ఫ్రాన్సులనుండి తీసిన ఋణములను

సోవియటు ప్రభుత్వమువారు నిరాకరించిరి...కాని రష్యా బెదరలేదు. ఈ ఆంక్షయే రష్యా కుపకరించెను, ఇతర దేశాలపై నాధారపడకుండ సర్వవిధముల స్వతంత్ర మగుటకు అహోరాత్రములు పనిచేసెను. స్కీములను వేసెను. ప్లానులను గల్పించెను. ప్రభుత్వమును దృఢపరచు కొనెను. శాంతి భద్రతలను నెలకొల్పెను. అయిదు సంవత్సరములు జరుగుసరికి రష్యా నూతన జవసత్వములలో విలసిల్లెను. పది సంవత్సరములగుసరికి ప్రభుత్వము చెక్కుచెదరకపోవుటయేగాక, ఆర్థిక నిర్మాణమునందు సమస్త దేశములకు మార్గదర్శకమయ్యెను ... రష్యా నానారాజ్యసభలో జేరనంతకాలము రష్యాయొక్క సైనిక విన్యాసమునుగూర్చి విమర్శించుటకు ఇంగ్లాండునకుగాని, ఫ్రాన్సుకుగాని స్వాతంత్ర్యము లేదు. కాని, రష్యాను నానారాజ్యసభలో జేర్చుకొనుటెట్లు? సోవియట్ ప్రభుత్వమును ఒక ప్రభుత్వముగ నంగీకరించినగాని దానిని యీ కూటమిలో జేర్చుకొనుటకు వీలులేదు. కూలీల ప్రభుత్వము నొక ప్రభుత్వముగ నంగీకరించుటయా యని కడచిన అయిదు సంవత్సరములనుండియు ఆలోచించుచుండిరి. ఆలోచన ఎంతకాలము తెగలేదు. దాని నంగీకరించిన ఏ యుపద్రవము సంభవించునో యని భయము. అది నానారాజ్యసభలో జేరకపోయిన 'డిజార్మమెంటు' సమస్మ పరిష్కార మగుటెట్లు? తుదకు అనివార్యమైనది. నేటికి రష్యా వెలితీరినది. సోవియట్ ప్రభుత్వము నానారాజ్యసభలో నిండోలగమున గౌరవించబడినది. స్థాయి సంఘములో శాశ్వత సభ్యత్వము గూడ సిద్ధించినది ... రష్యాకు దిగ్విజయము గలిగినది."

గాంధీజీ నాయకత్వం క్రింద కొనసాగిన శాసనోల్లంఘనోద్యమం నిర్వీర్యమై, చివరకు ఉపసంహరింపబడ్డంతో, యువ కాంగ్రెసువాదులు రష్యా విప్లవాన్ని గురించీ, సోషలిస్టు సిద్ధాంతాన్ని గురించీ అధ్యయనం చేయసాగారు. 1934 లో అఖిలభారత కాంగ్రెసు సోషలిస్టుపార్టీ స్థాపింపబడి, అన్ని రాష్ట్రాలలో శాఖ లేర్పడ్డాయి. ఆంధ్రరాష్ట్రంలో కూలీ రక్షణ సమితి అనే సంస్థ ముఖ్యమైన పట్టణాల్లో కార్మిక సంఘాలను

నిర్మించి. వారి హక్కులకై పోరాటాలు నడపసాగింది. ఈ పరిణామా లన్నిటికీ రష్యా సాహిత్యం, సోషలిస్టు — కమ్యూనిస్టు సిద్ధాంతాలు దోహదం చేశాయి. ముఖ్యంగా, 1934 లో శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారు వ్రాసిన "నేటి రష్యా" అనాటి యువకులెంతో ఉత్తేజపరచింది. రష్యాను గురించి తెలుగులో వెలువడిన మొట్టమొదటి గ్రంథం యిదే. దీన్ని గురించి కృష్ణాపత్రిక 1934, ఆగస్టు 18 తేదీ సంపాదకీయంలో యిలా వ్రాసింది :

"మానసిక ప్రవృత్తులనేగాక సామాజిక నీతిని తీవ్రరూపమున మార్చి ఆర్థికముగ, సాంఘికముగ, రాజకీయముగ క్రొత్త వ్యవస్థలను గల్పించు రష్యను విప్లవము ప్రదర్శించిన సాహసము, కార్య దక్షత, నిర్మాణ కౌశలము ప్రపంచంలో నిదివరకు జరిగిన విప్లవములేవియు ప్రదర్శించలేదు. నేటి రష్యా అపూర్వ దృశ్యము - రాజ్యతంత్రజ్ఞులనే గాక, అర్థశాస్త్ర విశారదులను, సంఘ నిర్మాతలను గలవరపరచుచున్న దృశ్యము. సోవియట్ రిపబ్లిక్కు తాత్కాలికముగ రష్యనుప్రజ పొందిన క్రోధోద్వేగమే అయినయెడల ఇరువది సంవత్సరములు ప్రపంచమున ప్రబలార్థకముగ నిలువబడగలుట యసంభవము. ఈ పరివర్తనమునందు మానవోన్నతికి సాధనభూతములైన స్థిరాంశము లెంతవరకు గలవో భావి కాలమే చెప్పగలదు. కాని, మానవ చరిత్ర మర్మములను దెలిసికొనగోరువారు నేటి రష్యను ఉదంతమును బరిశీలించక తప్పదు. ఆంగ్లమున నీవిషయమై పూర్వపక్ష సిద్ధాంతములతో ననేక గ్రంథములు వెలువడినవి. కాని, తెనుగున నింతవరకు సరియైన గ్రంథము ప్రచురింపబడి యుండ లేదు. నార్ల వెంకటేశ్వరరావుగారీ లోపమును దీర్చుటకు 'నేటి రష్యా' యను ఒక పొత్తమును రచించినందు కెంతయు వంద్యులు. ఇది నూరు పుటల చిన్న పొత్త మగుటచే రష్యాలో నేడు జరుగుచున్న మార్పు లన్నియు దార్కాణముగ నిందుదాహరించుట అసంభవము. అయినను యిందలి విషయములు స్థాలీపులాక న్యాయముగ రష్యను సామ్యవాద స్వరూపములను రుచి చూపించగలవనుట నిస్సంశయము. ఈ గ్రంథమును బఠించిన పిమ్మట రష్యానుగూర్చి యెక్కువ గ్రంథములను జదువుట కాసక్తి

కలుగుటయేకాక, ఆ దేశమునొకసారి కన్నులారా వీక్షించి వచ్చుటకు మనస్సు ఉవ్విళ్ళూరును."

తూర్పు గోదావరిజిల్లా కాంగ్రెసు నాయకుల్లో ఒకరైన శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు రష్యా విప్లవంవల్ల ఉత్తేజంపొంది, మాక్సింగోర్కీ రచించిన "అమ్మ" అనే ప్రఖ్యాత నవలను జైల్లో 1932 లో ఇంగ్లీషునుంచి తెలుగులోకి అనువదించారు. ఇది 1935 లో ప్రచురింపబడింది. అది కొంతకాలం బ్రిటిష్ ప్రభుత్వంచే నిషేధింపబడింది, ఇప్పటికి 8 ముద్రణలు చూచింది. దీని అనువాదకుడు "అమ్మవలె మానవ స్వాతంత్ర్యం కోసం అఖండమైన కష్టనష్టాల కోర్చినట్టియు, తమ భర్తలను, పుత్రులను దేశసేవ కర్పించినట్టియు వీరమాతలకు" అంకిత మొనర్చారు. ఈ నవల యువతరంలో విప్లవ బీజాలను నాటి, విప్లవోద్యమ పురోగతి కెంతగానో తోడ్పడింది. ఇటీవల "సోవియట్ భూమి" సెహ్రూ బహుమతులసంఘం యీ నవలను ఉత్తమ సాహిత్య రచనగా గుర్తించి, అనువాదకునికి బహుమతి ప్రదానం చేసింది.

"అమ్మ," "నేటి రష్యా", వెలువడిన తర్వాత విశ్వసాహిత్య మాలవారి "నా రష్యాయాత్ర" "రష్యా విప్లవం", "లెనిన్ ఉపదేశాలు" మొదలైన అనువాద గ్రంథాలు ఆంధ్రయువకుల్లో రాజకీయ చైతన్యం. నిర్మాణ దక్షత కలిగించాయి.

బ్రిటిష్ సామ్రాజ్యవాద దోపిడీని బహిర్గతంచేస్తూ తెలుగులో అనేక గ్రంథాలను రచించిన శ్రీ దిగవల్లి వెంకట శివరావుగారు సోవియట్ రష్యాను గురించి 1934 - 36 మధ్య ఆంధ్రపత్రికలో అనేక వ్యాసాలు వ్రాశారు. వాటిలో కొన్ని "నవీన ఆర్థిక నీతి" అనే శీర్షికతో ఆంధ్రరాష్ట్ర రైతుసంఘంచే పుస్తకరూపంలో ప్రచురింపబడ్డాయి. ఆ వ్యాసాల్లో కొన్ని భాగాలను దిగువ ఉదహరిస్తాను :

దాసవృత్తియందుపడి, ధనికుల లాభముకొరకు కష్టించు రోజులు పోయి, సోవియట్ రష్యా దేశపు రైతులు సార్వజనీన ప్రభుత్వాధికారులై

నారు. ప్రభుత్వోద్యోగుల నెన్నుకొనుటలో రైతులకు పలుకుబడియుండు టయేగాక వోటు కూడ గలదు. గ్రామములందు, పట్టణములందు నున్న పారిశ్రామికుల క్షేమలాభములకొరకే అన్ని పనులు నిర్వహింపబడు చున్నవి. పొరబాటు లప్పుడప్పుడు జరుగుచున్నను మొత్తముమీద జన సామాన్యముయొక్క సమష్టిక్షేమ లాభములకొరకే సర్వకార్యములు నిర్వ హింపబడుచున్నవి." (1934 : "క్రొత్త రష్యా – ప్రాత రష్యా")

"రష్యావారికి నీతి యొక పరమధర్మముగా నున్నది. ఒక మనుష్యు డింకొకనికి అన్యాయము చేయకపోవుటలోనే ఈ నీతి యిమిడి యున్నది. అందువలన ఒక వ్యాపారములో లాభముదీయుట అనునది అవినీతి యనియే వారి యూహ. అట్లే, లాభము నార్జించుట కుపయోగించు సొంత ఆస్తిని కలిగియుండుటయు అవినీతికరమే." ("సోవియట్ రష్యాను గురించిన కొన్ని అపోహలు" – 1936).

"రష్యాలో కలిగిన విప్లవమువలన భూస్వాములయొక్కయు పెట్టు బడిదారులగు భాగ్యవంతులయొక్కయు అధికార ప్రాబల్యముపోయి, దేశంలోని పాటకపు జనుల ప్రతినిధులే రాజ్యమునందు బలవంతులై సర్వాధిపత్యము వహించినందున నీ సంఘ స్వామిత్వము సుస్థిరముగా నుండుట కవకాశము కలుగుచున్నది. అర్థోత్పత్తి సాధనములు, పరికర ములు స్వంతదారుల వశములై యుండి ఒక మనిషి యింకొకనిని స్వప్ర యోజనముకొరకు కుపయోగించుకొను పద్ధతిగల ధనికాధీనమగు క్యాపిట లిస్టు ఆర్థికవ్యవస్థ రూపుమాపబడి అర్థోత్పత్తి సాధనములు, పరికరములు సంఘ స్వామ్య వశములు చేయబడి, సంఘ స్వామిత్వముగల ఆర్థిక వ్యవస్థ నిర్మాణము గావింపబడినది." ("నూతనరష్యారాజ్యాంగము," 1936)

సోవియట్ యూనియన్‌లో అనివార్యం అయిన కొన్ని పద్ధతుల్ని సైతం ఆంధ్ర జాతీయ నాయకులు హర్షించగలిగారు, కృష్ణాపత్రిక 1936 నవంబరు 21 తేదీని "రష్యను ఆర్థిక వ్యవస్థ" అనే శీర్షికతో ప్రచురించిన సంపాదక వ్యాసంలో యిలా తెలియజేసింది :

"వ్యక్తికిగల స్వాతంత్ర్యమును గూర్చి యింకను గొంత చెప్ప వలసియున్నది. కాపిటలిస్టు విధానమునుండి సోషలిస్టు విధానమునకు మార్పుచెందునాటి విప్లవపు ఒడుదుడుకులలో మొట్టమొదట వ్యక్తిస్వాతంత్ర్యమును పూర్తిగ నిరోధింపవలసివచ్చును. కేపటలిజమునకు అలవాటు పడిన ప్రాణములు సోషలిజమునకు అలవాటుపడుటకు గొంతకాలము కావలసివచ్చెను. హక్కుల విషయమైన నూతన సిద్ధాంతము వంటపట్టు వరకు కొంత నిరంకుశాధికారము తప్పినదికాదు. ఇప్పుడిప్పుడట్టి నిరంకుశత్వమున కవకాశమే లేకపోవుచున్నది. రష్యాలో బాలెటు పద్ధతి ప్రకారము రహస్యముగా ఓటువేయు హక్కు నంగీకరించుట గమనించినచో. వ్యక్తి స్వాతంత్ర్యము యదార్థముగ నంగీకరింపబడుచున్న విషయము బోధపడగలదు."

1934 లో శాసనోల్లంఘనోద్యమం విరమింపబడిన తర్వాత అంధ్రదేశ రాజకీయాల్లో ఒకవైపు నిస్పృహ, నిరాశ వ్యాపించాయి. కాని మరోవైపు సోషలిస్టు భావాలచే ఉత్తేజితులైన యువ కాంగ్రెసువాదులు కమ్యూనిస్టుపార్టీని స్థాపించి, రష్యా విప్లవంయొక్క సందేశాన్ని వ్యాపింపచేయసాగారు. ఆ తర్వాత కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోచేరి, "నవశక్తి" అనే వారపత్రికద్వారా సోషలిస్టు భావాలను ప్రచారంచేశారు. 1937 లో వెలువడిన "నవశక్తి" రష్యా సంచిక వివిధరంగాల్లో సోవియట్ యూనియన్ సాధించిన ప్రగతిని సవిస్తరంగా పాఠకుల కందజేసింది, రెండవ ప్రపంచయుద్ధంలో నాజీ దురాక్రమణకు వ్యతిరేకంగా సోవియట్ యూనియన్ సాగించిన ప్రతిఘటననుగురించీ, భారత స్వాతంత్రోద్యమానికి దాని ప్రాధాన్యతను గురించీ ఆంధ్ర కమ్యూనిస్టులు "ప్రజాశక్తి" వారపత్రిక ద్వారాను, అనేక కరపత్రాల ద్వారాను ప్రచారం చేశారు. ఈ దశలోనే ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం, ఆంధ్ర ప్రజానాట్యమండలి. అనేక వైజ్ఞానిక దళాలు సోషలిస్టు భావాలను, రష్యన్ల వీరగాథలను కొనియాడుతూ, విప్లవ చైతన్యం కలిగించడానికి కృషిచేశాయి. ముఖ్యంగా, శ్రీ శ్రీ "మహాప్రస్థానం" అనే శీర్షికక్రింద వ్రాసిన అనేక గేయాల్లో రష్యా విప్లవంయొక్క ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది.

ఉదాహరణకు :

“కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం
జాలరి పగ్గం
సాలెల మగ్గం
శరీర కష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి
సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలు —
నా వినుతించే
నా విరుతించే,
నా వినిపించే నవీనగీతికి
నా విరచించే నవీనరీతికి
భావం !
భాగ్యం !
ప్రాణం !
ప్రణవం !”

... ... ... ... ...

“నైలునదీ నాగరికతలో
సామాన్యుని జీవన మెట్టిది ?
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీ లెవ్వరు ?

... ... ... ... ...

“గర్జించు రష్యా
గాండ్రించు రష్యా
పర్జన్య శంఖం పలికించు రష్యా !
దౌర్జన్య రాజ్యం ధ్వంసించు రష్యా !
లే లే రష్యా !

రా రా రష్యా!
రష్యా! రష్యా! రష్యా! ఓ రష్యా!"

... ... ... ... ...

"స్వాతంత్ర్యం
సమభావం
సౌభ్రాత్రం
సౌహార్దం
పునాదులై యిళ్ళు లేచి
జనావళికి శుభం పూచి
శాంతి, శాంతి, కాంతి, శాంతి
జగమంతా జయిస్తుంది
ఈ స్వప్నం నిజమవుతుంది
ఈ స్వర్గం రుజువవుతుంది."

శ్రీ శ్రీవలెనే, అనేకమంది అభ్యుదయ రచయితలు, కళాకారులు సాహితీపరులు రచించిన గేయాలు, నాటకాలు, కథలు, నవలలు, బుర్ర కథలు ఆంధ్ర ప్రజల్లో నవజాగృతిని కలిగించాయి. వీరిపై రష్యావిప్లవం సోషలిస్టు భావాలు గొప్ప ప్రభావం కలిగించా యనడంలో సందేహం లేదు.

రెండవ ప్రపంచయుద్ధంలో సోవియట్ సేనలు నాజీ రక్కసుల నెదుర్కొని విజయాలమీద విజయాలు సాధిస్తూంటే, ఆ దేశంలో పాదు కొన్న సోషలిస్టు వ్యవస్థను గురించి మన మేధావుల్లో గొప్ప ఉత్సాహం వ్యక్తమైంది. డాక్టరు ఉప్పల లక్ష్మణరావు రచించిన "సోవియట్ యూని యన్ : భూతలస్వర్గం," కంభంపాటి సత్యనారాయణ రచించిన "నేటి సోవియట్ యూనియన్" మొదలైన గ్రంథాలు ఆ రోజుల్లో బహుళంగా వ్యాప్తిచెందాయి. డాక్టరు లక్ష్మణరావు దాదాపు 10 సంవత్సరాలనుంచి సోవియట్ యూనియన్‌లో ఉంటూ, రష్యన్ భాషనుంచి అనేక పుస్త కాలు తెలుగులోకి అనువదించారు, అవి విదేశభాషా ప్రచురణ సంస్థ తర

పున మాస్కోలో ప్రచురింపబడ్డాయి. ఇలాగే, కృష్ణాజిల్లా ఉయ్యూరు వాస్తవ్యులైన శ్రీ కొలచల సీతారామయ్యగారు 1922 - 25 మధ్య అమెరికానుంచి సోవియట్ యూనియన్ వెళ్ళి, ఆయిల్ టెక్నాలజీలో గొప్ప పరిశోధనలుచేసి, సోవియట్ ప్రజల మన్ననలు పొందారు. సోవియట్ యూనియన్‌లో సోషలిజం నిర్మాణానికి వారు చేసినసేవ ఘనమైనది.

యుద్ధకాలంలో సోవియట్ విజయాలపట్ల ఉత్తేజం పొందిన విద్యావంతులు, సోషలిస్టు—కమ్యూనిస్టు భావాలుగలవారు ఆంధ్రరాష్ట్ర సోవియట్ మిత్రమండలిని స్థాపించి, ముఖ్యపట్టణా లన్నిటిలోను దాని శాఖలను స్థాపించి, సోవియట్‌దేశంలోని సామాజిక పరిస్థితుల్ని గురించీ, జీవిత విధానాన్ని గురించీ తెలియజేసేందుకు అనేక సభలు — సమావేశాలు జరిపారు. స్వాతంత్ర్యం తర్వాత, 1952 నుంచీ పనిచేస్తున్న భారత — సోవియట్ సాంస్కృతికసంఘంయొక్క ఆంధ్రశాఖ వివిధ పట్టణాలలో తన కార్యకలాపాలను కొనసాగిస్తోంది.

స్వాతంత్ర్యానంతరం సోవియట్ - భారతదేశాలమధ్య ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో స్నేహసహకారా లెలా వర్ధిల్లుతు న్నాయో మనం చూస్తున్నాం. కాని, స్వాతంత్ర్యానికి ముందు, రష్యా సాహిత్యం నిషేధంలో ఉన్నరోజుల్లో, రష్యాను గురించి సామ్రాజ్యవాదులు విష ప్రచారం చేస్తున్నప్పుడు, రష్యా విప్లవం మన స్వాతంత్రోద్యమంపైన, ప్రజా ఉద్యమాలపైన, మన కళలు — సాహిత్యంపైన ఎంత గొప్ప ప్రభావం కలిగించిందో తలచుకుంటే, ఆశ్చర్యం కలుగుతుంది.

అక్టోబరు మహావిప్లవంయొక్క 50 వ వార్షికోత్సవ సందర్భంలో తెలుగుజాతికూడా గర్వించదగ్గ చారిత్రక ఘట్టాలెన్నో ఉన్నాయి. వాటిని జ్ఞాపకం చేసుకొని, ప్రపంచ చరిత్రను ఉజ్వలపథంలో నడిపేందుకు మార్గంచూపిన ఆ మహా విప్లవానికి జోహార్లు అర్పిద్దాం

అనువాదకుడు

# ఉపోద్ఘాతం

అక్టోబరు మహా విప్లవమనే పేరుతో ప్రపంచ ప్రఖ్యాతిపొందిన రష్యా విప్లవానికి నమ్రతతో జేజేలర్పించడానికి యీ చిన్న పుస్తకం వ్రాశాను. ఆ విప్లవంయొక్క 50 వ వార్షికోత్సవ సందర్భంలో యిది ప్రచురింపబడుతోంది.

లెనిన్‌చే ఉత్తేజితమై నడుపబడిన యీ రష్యా విప్లవం మానవ చరిత్రలో అత్యంత ప్రధానమైన సామాజిక విప్లవమని యీనాడు ఎంతో మంది గుర్తిస్తున్నారు. అంతేకాదు. రష్యా విప్లవమూ, దాని పర్యవసానంగా అవతరించిన సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కూ ప్రపంచ రాజకీయాల్లో ఏ శక్తీ కలిగించనంత ప్రభావం ప్రపంచ చరిత్రపై కలిగించాయని నేడు అంతా అంగీకరిస్తున్నారు.

ఇది కాకతాళీయంగా సంభవించిన పరిణామంకాదు. ఇందులో ఇంద్రజాల మేమీలేదు; మాహాత్మ్య మేమీలేదు.

ప్రపంచ చరిత్రలో మొట్టమొదటిసారి ఒకదేశ శ్రామిక ప్రజలు రాజకీయ అధికారాన్ని హస్తగతం చేసుకొని సుస్థిరమొనర్చుకున్నారు. అదే రష్యా విప్లవం. పెట్టుబడిదారీ దోపిడీని రూపుమాపి సోషలిస్టు సమాజాన్ని నిర్మించుకొన్న మొట్టమొదటిదేశం సోవియట్ యూనియన్. సోషలిజం మాత్రమే శ్రామిక ప్రజలకు, ప్రపంచంలోని "సామాన్య" ప్రజలకు స్వేచ్ఛను, సౌభాగ్యాన్ని ప్రసాదించగలదు.

అక్టోబరు విప్లవమూ, సోవియట్ యూనియనూ దూర దేశాల్లో నివసించే విభిన్న మానవ వంశాలకు, మతాలకు, జాతులకు చెందిన ప్రజల్ని ఉత్తేజపరిచేది పై యదార్థం తప్ప మరొకటి కాదు. సామ్రాజ్యవాదులు, ప్రపంచంలోని అభివృద్ధి నిరోధకులు ఎంత విష ప్రచారం చేసినా, యీ నగ్నసత్యం దాగదు.

అందుచేతనే, సకల దేశాల్లోని సామాన్య ప్రజలూ రష్యా విప్లవం యొక్క 50 వ వార్షికోత్సవాన్ని మహదానందంతో, శ్రద్ధాసక్తులతో, గర్వంతో జరుపుకుంటారు.

సోషలిజం విజయం సాధించినదేశాల్లో ప్రజలు 50 వ వార్షికోత్సవాన్ని ఒక పర్వదినంగా జరుపుకుంటారు. తమ దేశ చరిత్రలో ఒక నూతన అధ్యాయంగా, అత్యద్భుత విజయాలకు దారితీసిన మహోజ్వల ఘట్టంగా దాన్ని కీర్తిస్తారు.

విప్లవం కొనసాగుతూన్నప్పుడు, నెలరోజుల్లో సోవియట్ ప్రభుత్వం పతనమై తీరుతుందని జోస్యం చెప్పిన తమ శత్రువుల మాటల్ని సోవియట్ ప్రజ లెన్నటికీ మరచిపోరు. విదేశాల్లోని సోవియట్ మిత్రులు సైతం, లెనిన్ "మతిలేని మూఢ" ప్రయోగానికి పూనుకొన్నాడనీ, ఆ ప్రయోగ మెంతోకాలం నిలువదనీ భావించారు. కాని, సోవియట్ యూనియన్ తన శత్రువుల శాపనార్థాల్నీ, మిత్రుల ప్రేమపూర్వక ఆందోళననూ కూడ అధిగమించి అర్థశతాబ్దకాలం నిలదొక్కుకోవడమేకాక, దిన దినం బలపడుతోంది; అంతకంతకు దృఢంగా అది స్థిరపడుతోంది.

చివరకు, సోవియట్ యూనియన్‌ని అమితంగా ద్వేషించే శత్రువులు సైతం అది అవిచ్ఛిన్నమనీ, అజేయమనీ గుర్తించవలసి వస్తోంది;

కమ్యూనిస్టులు, ప్రజాతంత్రవాదులు, దేశభక్తులు, మానవతావాదులు బహిరంగంగా, చట్టసమ్మతంగా పనిచేయగల పెట్టుబడిదారీ దేశాల్లో 50 వ వార్షికోత్సవాన్ని బహిరంగంగా, తమ భవిష్యత్తును చూపే — సోషలిజాన్నీ, సౌభాగ్యాన్నీ, సౌభ్రాతృత్వాన్నీ చూపెట్టే — ధృవతారగా పరిగణించి జేజే లర్పిస్తారు.

కొన్ని దేశాల్లో కమ్యూనిస్టులూ, మానవ స్వేచ్ఛను సమానత్వాన్ని కాంక్షించేవారూ అజ్ఞాత జీవితం గడుపుతూ, ప్రాణాల్ని అరచేత పట్టుకొని నిత్యం దుర్భర బాధలకు గురిఅవుతూ, చిత్రహింసలకు లోనవుతూ యింకా పోరాటం జరుపుతున్నారు. అట్టి దేశాల్లో కూడ 50 వ వార్షికో

త్సవం యిరుకైన జైలు కొట్లలోను, లక్షలాది కార్మికుల గృహాల్లోను జరిగితీరుతుంది.

దీన్నిబట్టి గత 50 సంవత్సరాల్లో రష్యావిప్లవంగాని, సోవియట్ జీవితంగాని భూతలస్వర్గంగా ఉందనుకోవడం పొరబాటు. విప్లవం కొనసాగుతూన్నప్పుడు, సోషలిజం నిర్మింపబడుతూన్నప్పుడు పొరబాటు జరక్కపోలేదు. సామాజిక జీవితానికి సంబంధించిన ప్రతిఒక్క రంగం అంత సర్వ సమగ్రంగా మార్పుచెందడం, ఉత్పత్తిసాధనాలపై వ్యక్తుల యాజమాన్యం సమూలంగా రద్దుకావడం, వాటి సమిష్టి యాజమాన్యంపై ఆధారపడ్డ ఒక సామాజిక వ్యవస్థ నిర్మింపబడ్డం, ఏ పొరబాట్లూ జరక్కుండా సాధ్యపడతాయని కులాసా జీవితం గడిపే రాజకీయవేత్తలు మాత్రమే భావించగలరు; విప్లవాలు నడపని, సోషలిజాన్ని నిర్మించని రాజకీయ వేత్తలు మాత్రమే అలా భావిస్తారు. అందులోనూ అంత అద్భుతమైన లక్ష్యాన్ని సాధించడంలో, అదివరకు యిలాంటి ఉదాహరణల్ని చరిత్రలో కని విని యుండని ప్రజలు పొరబాట్లు చేయకుండా యీ కార్యం సాధించారనుకోవడం అర్థంలేని విషయం.

అందుచేతనే, నిజాయితీపరులందరూ, సజ్జనులంతా సోవియట్ యూనియన్‌లో జరిగిన కొన్ని ఘటనల్ని ఎంతగా వ్యతిరేకించినా, వాస్తవ ప్రపంచంలో ఊహాత్మక జగత్తును సృష్టించగలమనే వెర్రి ఆలోచనకు దిగజారకుండా చూసుకోవడం ఎంతో అవసరం. సోవియట్ యూనియన్ ఎంత క్లిష్టమైన సమస్యల్ని ఎదుర్కోవలసివచ్చిందో, ఏ నిర్దిష్ట పరిస్థితుల్లో వాటిని పరిష్కరించుకొందో అర్థంచేసుకోవడం అవసరం. అంతేగాని, చారిత్రక దృష్టినీ, వివేచననూ విసర్జించకూడదు.

ఎలాంటి పొరబాట్లు జరిగినా, ఎన్ని పొరబాట్లు జరిగినా, ఒకటి మాత్రం వాస్తవం: విజ్ఞాన శాస్త్రం, పరిశ్రమలు, సాంఘిక సంక్షేమం, సంస్కృతి యీ రంగాల్లో సోవియట్ యూనియనూ, సోవియట్ ప్రజలూ యింతవరకు ఏ దేశమూ సాధించనన్ని విజయాలు సాధించారు. హిమాలయ శిఖరాలవంటి ఆ విజయాలతో పోలిస్తే, పొరబాట్లు చిన్న గుట్టల వంటివి.

అంతేకాదు. తరచు వెగటు కలిగించే విషయాలుగా పరిగణింపబడేవి, ముఖ్యంగా విప్లవాన్నీ, సోషలిస్టు నిర్మాణాన్నీ కొనసాగించడంలో ప్రదర్శింపబడిన కర్కశత్వం పొరబాటేమీకాదు. దీన్నిగురించి మన దేశంలో సహృదయులు సైతం తరచు మాట్లాడుతూ ఉంటారు. కాని, యిది సోవియట్ నాయకుల చేతిలోని విషయంకాదు; సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చేతిలోని విషయంకాదు.

ఈ విషయాన్నెవరైనా లోతుగా పరిశీలించదలచుకుంటే, ఒకటి స్పష్టంగా గోచరిస్తుంది. సోవియట్ యూనియన్‌లో విప్లవాన్నీ, సోషలిస్టు నిర్మాణాన్నీ కొనసాగించడంలో ప్రదర్శితమైన కర్కశత్వం దేశంలోని విప్లవ విద్రోహుల దుష్టకృత్యాలవల్ల, దేశం వెలుపలి సామ్రాజ్యవాదుల దురాక్రమణవల్ల అనివార్యమయింది. ఈ దురాక్రమణ సైనిక, సైనికేతర స్వభావంగలది. విదేశీ సామ్రాజ్యవాదులు దేశీయ అభివృద్ధినిరోధకులతో సంబంధాలేర్పరచుకొని సాగించిన దురాక్రమణ అది. అన్ని పరిస్థితుల్లోనూ హింసాకాండ సాధ్యమైనంత తక్కువగా జరిగేటట్లు జాగ్రత్త పడవలసినమాట నిజమే. కాని, ఆ సాకుతో ఏసామాజిక వ్యవస్థకూడా బ్రతికి బయటపడేందుకు తనకుగల హక్కును వదులుకోలేదుగదా.

టాగోరు అంతటి మానవతావాది దీన్ని అంగీకరించారు. ఆ విషయం తర్వాత ప్రస్తావిస్తాను.

సమర్థించ వీలులేని కొన్ని అకృత్యాలను ఎవరైనా ఖండించవచ్చు; ఖండించాలికూడా. నిజం చెప్పాలంటే, నిజాయితీపరుడైన ఏ విమర్శకుడూ ఖండించనంత నిర్మొగమాటంగాను, నిర్దాక్షిణ్యంగాను సోవియట్ కమ్యూనిస్టుపార్టీయే ఖండించింది. కాని, మనం చెట్టును చూచి అరణ్యమనుకోకూడదు. అకృత్యాలు వేరు, విప్లవ విద్రోహుల్ని ప్రతిఘటించి నిర్మూలించడం వేరూను. అకృత్యాలు జరక్కుండా జాగ్రత్త పడవలసిందే; కాని విప్లవ విద్రోహుల్ని ప్రతిఘటించకుండా, నిర్మూలించకుండా ఏ దేశమూ ఏ జాతీ సోషలిజాన్ని నిర్మించుకోజాలదు.

ఈ భేదాన్ని గ్రహించకుండా, సోవియట్ ప్రభుత్వం ప్రదర్శించిన కర్కశత్వాన్ని భిన్నాభిప్రాయాల అణచివేతగా పరిగణించి ఖండించడమంటే, పై సామాన్య సత్యాన్ని విస్మరించడమే అవుతుంది.

ఏ ప్రజాప్రభుత్వమైనా భూముమీద, పెట్టుబడులమీద గుత్తాధికారం గలవారిపై కఠినమైన చర్యలు తీసుకోనారంభిస్తే అభివృద్ధినిరోధకులెలా ఎదురుదెబ్బ తీస్తారో మన దేశంలోనే మొట్టమొదటిసారి సూచనప్రాయంగా చూచాం. పది సంవత్సరాల క్రిందట, కేరళలో కమ్యూనిస్టు మంత్రివర్గాన్ని పడగొట్టడానికి "విముక్తి పోరాటం" అనే పేరుతో హింసాకాండ ప్రారంభింపబడింది.

మొన్న జరిగిన సాధారణ ఎన్నికల తర్వాత అలాంటి అనుభవమే మరొకసారి ఎదురయేటట్లుంది. కేరళ, బెంగాల్, బీహారు రాష్ట్రాల్లో ఏర్పడ్డ ప్రజామంత్రివర్గాల్ని కూలద్రోసేందుకు మరింత తీవ్రరూపంలో ప్రయత్నాలు జరగవచ్చు. బహుశా మద్రాసు మంత్రివర్గం కూడ యిలాంటి అనుభవాన్నే రుచిచూడవలసివస్తుంది.

అదృష్టవశాత్తు యీసారి పరిస్థితులు పది సంవత్సరాలకంటే ప్రజాశక్తులకు అనుకూలంగా ఉన్నాయి. ఆనాడు మిత్రులుగా ఉండగలిగిన, ఉండవలసిన చాలమంది దురదృష్టవశాత్తు వ్యతిరేక పక్షాల్లో చేరారు. కాని, యీ రోజున వారు ఐక్యసంఘటనలో ఉన్నారు; ఈ ఐక్యసంఘటన అప్పటికన్న విశాలంగా ఉంది; ప్రజల అండకూడ ఎక్కువ విస్తృతంగా, అనుభవయుతంగా ఉంది; అభివృద్ధినిరోధకులు యిదివరకుకంటే ఎక్కువగా ప్రజలకు దూరమయారు. అయినప్పటికీ, మన మొక విషయం మరచిపోకూడదు: అభివృద్ధినిరోధకశక్తులు నిర్మూలింపబడనిదే తమ నిర్మూలనను గురించి వారు చెప్పుకోవడం జరగదు.

సోవియట్ దేశ చరిత్రను అధ్యయనం చేసే నిజాయితీపరులు మన దేశంలో మనం గడించిన యీ అనుభవాన్ని ఒక్క క్షణమైనా విస్మరించరాదు.

రష్యా విప్లవాన్ని గురించీ, సోవియట్ యూనియన్‌ని గురించీ, ఎందరో మిత్రులు, శత్రువులు ఎన్నో గ్రంథాలు వ్రాశారు (మిత్రుల్లో నిష్కపటులైన విమర్శకులు కూడా ఉన్నారు), ప్రపంచంలో జరిగిన ఏ సంఘటనను గురించీ, ఏ పరిణామాన్ని గురించీ యిన్ని గ్రంథాలు వెలువడి యుండలేదు. సోవియట్ యూనియన్‌ని గురించీ, సోవియట్ జీవితాన్ని గురించీ ప్రామాణికంగా వ్రాయబడిన గ్రంథా లన్నిటినీ ఒక చోట చేర్చితే (అవసర మనుకుంటే కల్పిత గాథలతో నిండినవాటినికూడా చేర్చవచ్చు), ఒక పెద్ద గ్రంథాలయ మవుతుంది. ఈ దృష్టితో చూచి నప్పుడు, యిదివరకే మన కందుబాటులో వున్న సమాచారానికి మనం కొత్తగా చేర్చవలసింది నిజంగా ఏమీ లేదు.

మన దేశంపై రష్యా విప్లవంయొక్క ప్రభావాన్ని గురించి కూడా ఎంతో సమాచారం యిదివరకే ప్రచురింపబడింది. అయితే, యిది చెల్లా చెదరుగా, యిక్కడ కొంత — అక్కడ కొంత ఉంది. చాలామంది కది తెలియదు. ఈ అంశంపై సమర్థులైన కొందరు పరిశోధకులు కృషి చేసి నట్లయితే, అమూల్యమైన ఒక గ్రంథాన్ని ప్రచురించవచ్చు. అయితే, వారికి భారతీయ భాషల్లో కనీసం ప్రధానమైనవయినా తెలిసియుండాలి: అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థయొక్క గ్రంథ-పత్ర భాండారంకూడా వారికి అందుబాటులో ఉండాలి.

అలాంటి ప్రయత్నం, ఈ చిన్న పుస్తకంలో నేను చేసిన స్వల్ప ప్రయత్నపు పరిధికి అతీతమైనట్టిది, ఇందుకు కారణాలు స్పష్టమే.

అయినప్పటికీ, నే నీ ప్రయత్నాన్ని ఒక దృక్కోణంనుంచి చేశాను. దాన్ని నిర్మొగమాటంగా తెలియజేస్తాను.

ఈ చిన్న పుస్తకంలో మొదటినుంచి చివరవరకూ కనిపించేది, రష్యా విప్లవం భారత స్వాతంత్ర్యోద్యమంపై (స్వాతంత్ర్యానికి ముందు మన రాజకీయాల సారాంశం యిదే) ప్రభావం కలుగజేయడానికి మూల కారణం, బ్రిటిష్ పాలనక్రింద మనం ఏ కీలక సమస్యల పరిష్కారం

కొరకు పోరాడుతూ వచ్చామో, ఆ కీలక సమస్యలన్నీ రష్యా విప్లవమూ సోవియట్ యూనియనూ జయప్రదంగా పరిష్కరించుకున్నాయి.

క్లుప్తంగా చెప్పాలంటే, ఆ సమస్య లివి: జాతుల స్వయం నిర్ణయాధికారం, అనగా పీడితజాతులు విదేశాల పెత్తనంనుంచి స్వాతంత్ర్యం పొందే హక్కు; సామ్రాజ్యవాద యుద్ధాల్లోకి యీడ్వబడకుండా ఉండే హక్కు; పేదరికంలో మగ్గుతూ బడుగు స్థితిలోవున్న దేశం పారిశ్రామికంగాను, వ్యావసాయకంగాను అభివృద్ధి చెందడానికి హక్కు; ఫ్యూడల్ భూసంబంధాలు రద్దుచేయబడి దున్నేవారికి భూమి లభించేటట్లు చేయడం; ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచడం; ప్రజ లందరికీ విద్య, సంస్కృతి ప్రసాదించడం. చివరి విషయం, అన్నిటిలాంటి ప్రధాన విషయం, ఆనాడు మనందరిముందు ఉన్న విషయం ఏమంటే, స్వాతంత్ర్యానంతరం బహు భాషలు — బహు మతాలతో నిండిన మన దేశాన్ని ప్రజలందరి ఆమోదంతో ఐక్యపరచడ మెలాగు అనేది.

పైన పేర్కొన్న ప్రతి సమస్యను, ఒక్క మినహాయింపుకూడ లేకుండా, పరిష్కరించుకోడంలో రష్యా విప్లవం, సోవియట్ యూనియన్ సాధించిన విజయాలు, గడించిన అనుభవం మన స్వాతంత్రోద్యమానికి అమూల్యంగా ఉపయోగపడ్డాయి. ఇదే, మనకు సంబంధించినంతవరకు రష్యా విప్లవంయొక్క అర్థం; సోవియట్ యూనియన్ యొక్క అర్థం. ఈ కారణంవల్లనే, వాటి ప్రభావం మనమీద, మన ఉద్యమంమీద, మన నాయకులమీద పడింది.

"అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ, సోవియట్ పాలకులు భారత దేశాన్ని తమ ఉపగ్రహంగా చేసుకొనేందుకు రహస్యంగా, దుష్టబుద్ధితో కుట్రలు, పన్నాగాలు మొదలైనవి జరపడంవల్ల" మనపై రష్యా విప్లవం, సోవియట్ యూనియన్ ప్రభావం కలుగజేశాయని కొందరంటూ ఉంటారు. ఇది అతి నీచమైన విష ప్రచారం. మన దేశాన్ని సామ్రాజ్యవాదుల, దేశీయ అభివృద్ధి నిరోధకుల, మూఢ ఛాందసుల యినుప పిడికిలిలో బిగించియుంచడానికి ఉద్దేశపూర్వకంగా వ్యాప్తి చేయబడుతున్న అభిప్రాయా లివి.

కమ్యూనిస్టు వ్యతిరేకత, సోవియట్ వ్యతిరేకత స్వదేశీ, విదేశీ అభివృద్ధి నిరోధకులచేతిలో అత్యంత విషపూరితమైన ఆయుధాలుగా ఉపయోగింపబడుతున్నాయి. వారి ఉద్దేశం, మన ప్రజలకూ సోవియట్ ప్రజలకూ మధ్య అనుమానం, ద్వేషం అనే చైనా గోడను నిర్మించడం; పెట్టుబడిదారీ ఫ్యూడల్, దోపిడీనుండి విముక్తి పొంది సాంఘిక సమానత్వం స్వాతంత్ర్యం, అభ్యుదయం అనే లక్ష్యాల కొరకు మనం సాగించే పోరాటాన్ని దెబ్బతీసి ఓడించడం,

ఈ దృష్టినుంచి నే నీ కరపత్రం వ్రాశాను. పైన నేను పేర్కొన్న పరిమితులతోపాటు, అనివార్యమైన యితర కార్యా లుండడంవల్ల పైన పేర్కొన్న ప్రధాన సమస్యలనైనా నేను సమగ్రంగా వివరించలేక పోయాను. కాని, నే నొక విషయం ధైర్యంగా చెప్పగలను: ఎవరైనా యిందుకు సంబంధించిన అంశా లన్నిటినీ, సమాచారాన్నంతనూ ఆమూలాగ్రంగా పరిశోధించినట్లయితే, యిందులో నేను ప్రతిపాదించిన సూత్రీకరణ నిష్పాక్షికమైన చారిత్రిక విద్యార్థు లందరికీ సంతృప్తి కలిగించే విధంగా ధృవపడగలదు; నిరూపింపబడగలదు.

భారతదేశం స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్న తర్వాత భారత–సోవియట్ సంబంధాలు రెండు రాజ్యాల మధ్య స్నేహ సంబంధాలుగా పరిఢవిల్లాయి. భారతదేశంయొక్క కృషి ఫలితంగా, ముఖ్యంగా జవహర్లాల్ నెహ్రూ కృషి ఫలితంగా, ఆ సంబంధాలు మరింత విస్తృతరూపం ధరించాయి; మరింత ప్రాధాన్యం వహించాయి.

ఈ దశలో జరిగిన పరిణామాలు అందరికీ తెలుసు. అవి నేటి చరిత్రకు సంబంధించినవి. మన ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాన్ని పటిష్ట మొనర్చుకోవడంలో ఉక్కు – విద్యుచ్ఛక్తి – ఖనిజతైలం — భారీ ఇంజనీరింగ్ – రక్షణ పరిశ్రమలు మొదలైన వాటిని నిర్మించుకోడంలో సోవియట్ యూనియన్ మనకు అపారమైన సహాయంచేస్తోంది. గోవా విముక్తి విషయంలోను, కాశ్మీరు సమస్యపైన అది భారతదేశాన్ని అరమరలు లేకుండా బలపరచింది. భారతదేశం అనుసరిస్తున్న శాంతి — అలీన విధానాన్ని పటిష్టమొనర్చడానికి గట్టిగా కృషిచేస్తుంది. ఇవన్నీ అందరికీ

తెలుసు. వీటిని మన ప్రజలు మెచ్చుకొంటున్నారు. నేనీ పుస్తకంలో స్వాతంత్ర్యానికి ముందున్న పరిస్థితిని మాత్రమే వివరించదలచుకున్నాను.

నేడు విజ్ఞానశాస్త్రం, సాంకేతిక విజ్ఞానం, పరిశ్రమలు అపారంగా అభివృద్ధిచెందాయి. వీటిసహాయంతో మొత్తం మానవజాతి స్వేచ్ఛావాయువులు పీలుస్తూ సుఖ సంపదలదో తులతూగ గల అవకాశం ఉంది. కాని, మనం చూస్తున్న దేమిటి? పెట్టుబడిదారీ విధానం కోట్లాది ప్రజల్ని దుఃఖ సముద్రంలో ముంచి యమయాతనలకు గురిచేయడమేకాక, అణుబాంబులతో సర్వ నాశనం తీసుకొస్తానని బెదిరిస్తోంది. పెట్టుబడిదారీ విధానంపై యింతకంటె పెద్ద ఖండన మరేమి కావాలి?

వినాశకర ప్రపంచయుద్ధం అనే యీ పైశాచిక బెదిరింపు నెదుర్కొడంలో అతి శక్తివంతమైన దుర్గంగా నేడు నిలిచియున్న దేశం సోవియట్ యూనియన్. అంతేకాదు. జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడే అన్ని దేశాలకు సహాయంచేసే అతి బలీయమైన మిత్రదేశంకూడా సోవియట్ యూనియనే. స్వేచ్ఛాయుతమైన, సకలైశ్వర్యాలతో తులతూగగల ఒక నూతన ప్రపంచాన్ని నిర్మించేందుకు, ఆకలి—దారిద్ర్యం— దోపిడీ—యుద్ధాలు లేని ప్రపంచాన్ని నిర్మించేందుకు, అన్ని దేశాల ప్రజలు జాతిభేదాలవల్లగాని, రంగు భేదాలవల్లగాని, మత భేదాలవల్లగాని ఒకరినొకరు ద్వేషించుకోకుండా, ఘర్షణ పడకుండా, సోదరులవలె, మిత్రులవలె జీవించగల మరో ప్రపంచాన్ని నిర్మించేందుకు కృషిచేసే సజ్జనులందరికీ తోడ్పడేబలమైన మిత్రదేశం కూడా సోవియట్ యూనియనే.

అట్టి సోవియట్ యూనియన్ చిరస్థాయిగా వర్ధిల్లుగాక! మానవజాతి విముక్తిచెంది, స్వర్గంలో కాక భూమిమీద మానవులు శాంతినీ, సుఖ సంపదల్నీ అనుభవించడానికి మార్గం చూపిన అక్టోబరు మహా విప్లవానికీ, దాన్ని నడిపిన లెనిన్‌కీ జేజేలు!

న్యూఢిల్లీ,
1967 మేడే

ఎస్. జి. సర్దేశాయ్

# మొదటి అధ్యాయం

# రష్యా విప్లవమంటే అర్థం

1917 నవంబరు 7 నుంచి 1967 నవంబరు 7 వరకు గడచిన కాలం పెద్దది. అర్ధశతాబ్దకాలం యిది.

1930 నాటికి పార్టీ సభ్యులుగా చేరిన మొదటి, రెండవ తరాల భారతీయ కమ్యూనిస్టులు, "నిన్న మొన్నటివరకు" మనం రష్యావిప్లవాన్ని ఒక సమకాలీన ఘటనగా, మనల్ని స్వయంగా కమ్యూనిజంలోకి తెచ్చిన ప్రత్యక్ష ఘటనగా ప్రస్తుతించే వారమని చెబితే, నమ్మడమెంతో కష్టం. అప్పటికింకా రష్యా విప్లవం ఒక చారిత్రక ఘటనకాలేదు. ప్రపంచ పరిణామాల కది అతి సన్నిహితంగా ఉండేది.

అయినప్పటికీ, ప్రపంచ చరిత్రలో, కాలం గడిచేకొద్దీ వయసు ముదరని విప్లవం నవంబరు విప్లవ మొక్కటే. ఎల్లప్పుడూ తరుణ వయస్సులో అర్థవంతంగా ఉండే విప్లవం యిదొక్కటే.

నిజం చెప్పాలంటే, కార్మికవర్గ పార్టీలు, ప్రపంచ విప్లవోద్యమం స్వీయానుభవం ద్వారా పరిపక్వత చెందేకొద్దీ నవంబరు విప్లవం అంతకంతకు కార్యాచరణకు మార్గదర్శిగా అర్థవంత మవుతోంది. ఈ దృష్టితో చూచినప్పుడు, రష్యా విప్లవమూ, దాని మహానేత లెనిన్ ఉపదేశాలూ వర్తమానకాలంతో ఎల్లప్పుడూ విడదీయరానివిధంగా పెనవేసుకుపోయి ఉంటాయని చెప్పవచ్చు.

ఈ యథార్థానికి కీలక మేమంటే, అనేక శతాబ్దాలుగా శ్రామిక మానవాళిని పీల్చి పిప్పిచేస్తున్న సకలవిధాలైన దోపిడీని అంతమొనర్చే నూతన శకానికి రష్యా విప్లవం నాందీప్రస్తావనచేసింది. ఈనాటి ప్రధాన సమస్య లన్నిటి —— జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజం, విశ్వశాంతి ——పరిష్కారానికి దారితీసేటట్లు అది ఒక ఉజ్వల

మార్గాన్ని — సిద్ధాంత సంబంధమైనదేకాక ఆచరణకుకూడా సంబంధించిన మార్గాన్ని — చూపెట్టింది.

అంతటి కల్లోల పరిస్థితుల్లో, అంతటి విపరీత పరిస్థితుల్లో — సాంఘిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థ ఛిన్నాభిన్నమై కూలిపోయే పరిస్థితుల్లో — ఏ విప్లవమూ యింతవరకు విజృంభించియుండలేదు. ఏ విప్లవ ప్రభుత్వమూ అంత ఉగ్రరూపంలో కరువు, అంటు రోగాలు, ఆర్థికవిచ్ఛిత్తి, విప్లవ విద్రోహ తిరుగుబాట్లు, విదేశీ సైనిక దురాక్రమణ, విష ప్రచారం వంటి పైపరీత్యాలను ఎదుర్కొని యుండలేదు. సోవియట్ ప్రభుత్వం 1921 వరకు యిలాంటి విపత్కర పరిస్థితుల్ని ఎదుర్కొవలసివచ్చింది.

అయినప్పటికీ, "సామాన్య ప్రజల, "నిరక్షరకుక్షుల" అసాధారణ శక్తుల్లో లెనిన్‌కి విశ్వాసం ఉండడంవల్లా, ఎల్లప్పుడూ ఆయన సరియైన పాలసీలను రూపొందిస్తూండడంవల్లా, అదివరకే ఆయన్ని జగద్రక్షకుడుగా భావించిన ప్రపంచ ప్రజానీకంనుంచి మృత్యుదేవత ఆయన్ని లాక్కుపోకముందే, "ముల్లోకాలనూ ఆయన ముట్టడించాడు." అంతేకాక, సోవియట్ ప్రభుత్వం విజయాలమీద విజయాలు సాధించగలిగేటట్లు చేశాడు.

అధికారాన్ని హస్తగతం చేసుకున్న తర్వాత సోవియట్ ప్రభుత్వం నిర్వర్తించవలసిన విధుల్ని గురించి చెబుతూ, లెనిన్ ఒకనారి బైబిల్‌నుంచి యీ క్రింది వాక్యాన్ని ఉటంకించాడు:

"ఎవరికైతే ఎక్కువ ఈయబడుతుందో వారు ఎక్కువ బాధ్యతల్ని నిర్వర్తించాలి." రష్యన్ కమ్యూనిస్టులు సోషలిజాన్ని నిర్మించడంలోనే కాక,యావత్ప్రపంచంలో సోషలిజంకొరకు, జాతీయస్వాతంత్ర్యంకొరకు జరిగే పోరాటానికి సహాయం చేయడంలో కూడ ఆదర్శప్రాయులుగా ఉండాలని ఆయన ఆదేశించాడు.

లెనిన్ చనిపోయిన తర్వాత యీ 48 సంవత్సరాల్లో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ యూనియన్ ఆయన ఆదేశాన్ని విధేయ

తతో, విజయవంతంగా, అక్షరశః అమలు జరిపారు. ఇది వారికి శాశ్వత కీర్తిని సంపాదించిపెట్టింది.

ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించడంలో పొరబాట్లు జరిగినమాట నిజమే. ముఖ్యంగా, స్టాలిన్ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ మీద, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంమీద పెత్తనం చెలాయిస్తున్నరోజుల్లో జరిగిన పొరబాట్లు నేరాల క్రిందికి వస్తాయి.

అయితే, నిజమైన విప్లవపార్టీకి గీటురాయి పొరబాట్లు చేయక పోవడం కాదు. ఆ పొరబాట్లతో పోలిస్తే విజయాలు అద్భుతమయినవై యుండాలి. అంతేకాక, తన పొరబాట్లను సమగ్రంగాను, సాధ్యమైనంత శీఘ్రంగాను అంగీకరించి సరిదిద్దుకోడంలో అప్రమత్తత చూపాలి.

*సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ యూనియన్ మొట్ట మొదటిసారిగా బహుజాతుల ప్రజలు నివసించే ఒక విశాలదేశంలో సోష లిజాన్ని నిర్మించాయి. ఆ దేశంలో పారిశ్రామిక కేంద్రాలు కొన్ని ఉన్న ప్పటికీ, బోల్షివిక్కులు అధికారంలోకి వచ్చేనాటికి వ్యవసాయం ఎంతో వెనుకబడి యుండేది. నిరక్షరాస్యత, మూఢ విశ్వాసాలు మొదలైనవి ముమ్మరంగా తాండవించేవి.

*మొట్టమొదటిసారిగా అవి పారిశ్రామికంగాను, సైనికంగాను శక్తి వంతమైన సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించాయి. సోషలిజాన్ని నిర్మించేకృషి లోనే కార్మికవర్గాన్ని, రైతాంగాన్ని తరిఫీదు చేయవలసివచ్చింది (సాంస్కృతికంగాను, సాంకేతికంగాను, రాజకీయంగాను).

*మొట్టమొదటిసారిగా వ్యవసాయాన్ని కూడ సమష్టి సోషలిస్టు ప్రాతిపదికపై ఆర్గనైజ్ చేయవచ్చునని అవి నిరూపించాయి.

*ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థను మొట్టమొదటిసారిగా నిర్మిం చిందికూడా అవే. ఈ వ్యవస్థలో ఆర్థికాభివృద్ధి, ప్రజల జీవన ప్రమా

జాల పెంపుదల ఒకదానొకటి వ్యతిరేకించుకోకుండా, సమన్వయ పూర్వకంగా కొనసాగాయి.

*రెండవ ప్రపంచయుద్ధంలో ఫాసిస్టు రక్కసుల్ని ఓడించడంలో అగ్రగామి శక్తిగా ఉన్నవి కూడా అవే. ఫాసిస్టు ముష్కరులు సోవియట్ సేనల చేతిలో ఓడిపోకముందు దాదాపు యూరపు ఖండాన్నంతానూ స్వాధీనం చేసుకోవడమే కాక, ఉత్తర ఆఫ్రికాలో గణనీయమైన భాగాన్నీ పూర్తిగా ఆగ్నేయాసియా దేశాల్నీ చేజిక్కించుకొన్నారు.

*గత అర్ధశతాబ్దకాలంలో సోవియట్ యూనియన్ నుంచి సహాయ మర్థించిన ఏ జాతీయ స్వాతంత్ర్యోద్యమానికీ సోవియట్ యూనియన్ పూర్తి సహాయ మందజేయని సందర్భం ఒక్కటికూడా లేదు. వాటికి అవసరమైనంత మేరకు, అభిలషించినమేరకు ఆయుధాల సహాయం కూడా చేసింది.

*సామ్రాజ్యవాదుల ఒత్తిడికి, దురాక్రమణకు వ్యతిరేకంగా పోరాడే ప్రతి స్వతంత్రదేశానికి సోవియట్ యూనియన్, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సహాయం చేశాయి.

*కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలన్నీ తమ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పటిష్ఠమొనర్చుకొనేందుకు సోవియట్ యూనియన్ నుంచి ఆర్థిక, సాంకేతిక, పారిశ్రామిక సహాయం పొందాయి.

*రెండవ ప్రపంచయుద్ధం తర్వాత కొత్తగా సోషలిజాన్ని స్థాపించుకొన్న దేశాలకు సోవియట్ యూనియన్ సాధ్యమైనంత మేరకు పారిశ్రామికంగాను, సైనికంగాను సహాయం చేసింది.

*సామ్రాజ్య వాదాన్ని కళ్ళెంతో బిగించినట్లు బిగిస్తూ, ఎక్కడైతే అది దురాక్రమణకు పూనుకొంటుందో అక్కడల్లా దాన్నెదుర్కొంటూ, ప్రపంచ శాంతిని పరిరక్షించడంలో సోవియట్ యూనియన్ అత్యంత నిర్ణాయకమైన శక్తిగా ఉంటోంది.

*ఐక్యరాజ్యసమితిలో బలహీనమైన బడుగుదేశా లన్నిటికీ, జాతీయ

స్వాతంత్ర్యంకొరకు పోరాడే జాతు లన్నిటికీ అత్యంత శక్తివంతమైన, విశ్వసనీయమైన మిత్రదేశంగా అది ఉంటోంది.

*విభిన్న జాతుల మధ్య, వర్గాల మధ్య, మానవ వంశాల మధ్య రగిలే అనుమానాలు, ద్వేషాలు నిర్మూలింపబడి, సుఖప్రదమైన ఒక నూతన ప్రపంచాన్ని అన్యోన్య సహకారంతో నిర్మించుకొంటున్న నాగరిక దేశా లన్నిటికీ సోవియట్ యూనియన్ తలమానికంగా ఉంది. మత వివక్ష, మత ద్వేషం, మత క్రౌర్యం పీటి చిహ్నా లన్నిటినీ ఎంతో కాలం క్రిందట పూర్తిగా రూపుమాపిన దేశం అది.

1917 నవంబరు 7 న జరిగిన ఆ చరిత్రాత్మక ఘటన తర్వాత చరిత్ర మానవాళి ముందుంచిన కర్తవ్యాల్లో ఏ ఒక్క దాన్ని సోవియట్ యూనియన్ నిర్వర్తించకుండా ఉండలేదు.

రష్యా విప్లవం మానవ చరిత్రలో ఒక నూతన శకానికి నాందీప్రస్తావన చేసిందనే అభిప్రాయ ప్రకటన కేవలం శబ్దాలంకారం కాదు. 1917 లో అదొక జోస్యం; నేడు అదొక వాస్తవ విషయం.

రష్యా విప్లవమంటే శ్రామికవర్గ విప్లవం. లెనిన్ రూపొందించిన ఆదర్శ కార్మికవర్గ పార్టీ (కమ్యూనిస్టుపార్టీ) దాన్ని నడిపింది. పైన పేర్కొన్న చారిత్రక విజయా లన్నిటికీ మూలం యీ అంశమే.

కాని, యితర కారణాలు కూడా ఉన్నాయి. జారిస్టు రష్యా, యింకా సరిగా చెప్పాలంటే జారిస్టు రష్యన్ సామ్రాజ్యం, 1917 లో మొత్తం ప్రపంచానికి ఒక సంక్షిప్త రూపంగా ఉండేది. మానవ సంబంధాల దృష్ట్యా చూచినా, భౌగోళికంగా చూచినా, వాతావరణ దృష్ట్యా చూచినా, యీ విషయం తేటతెల్ల మవుతుంది. మనం సహజంగా తెలుసుకోవలసింది మానవ సంబంధాల్ని గురించి.

జారిస్టు ప్రభుత్వం ఆనాడు అత్యంత నిరంకుశమైన, అత్యంత క్రూరమైన, అత్యంత పాశవికమైన ప్రభుత్వం. అదొక ఫ్యూడల్ నిరం

కుశ రాజ్యం. అసంఖ్యాకంగా వున్న రైతాంగం యింకా అర్ధ బానిస స్థితి నుంచి విముక్తి చెందలేదు. అధికారమంతా ఫ్యూడల్ భూస్వాముల, వారు సృష్టించిన సైనికాధికారులచేతిలో ఉండేది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి సైతం జారిస్టు ప్రభుత్వంలో స్థానం లేదు.

అదే సమయంలో, జారిస్టు ప్రభుత్వం సామ్రాజ్యవాద ప్రభుత్వంగా కూడ ఉండేది. అనగా, గుత్త పెట్టుబడిదార్ల పెత్తనం క్రింద ఆధునిక పరిశ్రమలు, పెద్ద పెద్ద బ్యాంకులు సముద్రంలో దీవుల్లాగ కేంద్రీకృతమై తీవ్రమైన పోరాటాలు జరిగేవి.

జారిస్టు రష్యా భిన్నజాతుల బందిఖానాగా ఉండేది. ఆ విధంగా అదొక పెద్ద సామ్రాజ్యవాద దేశం.

రష్యన్ సామ్రాజ్యం భిన్న భాషల, భిన్న జాతుల భూభాగం మాత్రమే కాదు. రెండుఖండాల్లో అది విస్తరించింది; భిన్న మానవ వంశా లందులో నివసించేవారు; సనాతన క్రైస్తవులు, యూదులు, మహమ్మదీయులు, యింకా ప్రాచీనమైన ఆదిమ మతాలతో సహా, అనేక మత విశ్వాసకులకు చెందినవారు ఆ దేశంలో ఉన్నారు.

ఒకవైపు జారిస్టు రష్యాలో ప్రపంచ ప్రఖ్యాత సైంటిస్టులు, రచయితలు, కవులు జన్మించారు. లెనిన్ జన్మించిన దేశంకూడా అదే. కాని, రెండోవైపు ప్రజాసామాన్యం జారిస్టు పాలనక్రింద పరమ దారిద్ర్యంలో. అజ్ఞానంలో, మూఢ విశ్వాసాల్లో జీవించేవారు.

20 వ శతాబ్దం ప్రారంభంలో ప్రపంచాన్ని కలవరపెట్టిన సామాజిక, రాజకీయ వైరుధ్యాలన్నీ జారిస్టు రష్యాలో ప్రతిబింబించాయి, అద్దంలో ప్రతిబింబంలాగ. అందులోనూ, అత్యంత తీవ్రరూపంలో ప్రతిబింబించాయి.

అటువంటి వైరుధ్యాలతో నిండిన జారిస్టు సామ్రాజ్యం మూడు సంవత్సరాల యుద్ధ బీభత్సంలో కూలిపోయింది. రష్యా విప్లవానికి చోటు యిచ్చింది. అందువల్ల, సహజంగా రష్యా విప్లవం పై వైరుధ్యా లన్నిటినీ

పరిష్కరించడంతోపాటు, సామ్రాజ్యవాదయుద్ధంయొక్క అమానుషత్వం పైశాచికత్వం అంతమయాక ఎలాంటి శాంతి ఏర్పడాలనే సమస్యనుకూడా పరిష్కరించవలసి వచ్చింది.

సోవియట్ యూనియన్ అధికారంలో ఉన్న ఈ 50 సంవత్సరాల్లోనూ ఉత్పన్నమైన ప్రతి సమస్యను పరిష్కరించవలసి వచ్చిందంటే ఆశ్చర్య మేముంది?

ప్రపంచంలో మొట్టమొదటిసారి విజయం సాధించిన సోషలిస్టు విప్లవంగా, కార్మికవర్గమూ యితర కార్మిక ప్రజలూ సుస్థిరమైన రాజకీయాధికారాన్ని స్థాపించుకోగలిగేటట్లుచేసిన మొదటి విప్లవంగా రష్యా విప్లవం ప్రపంచ ప్రఖ్యాతి పొందింది.

అయినప్పటికీ, సోవియట్లు కాంగ్రెసు అధికారాన్ని హస్తగతం చేసుకొన్నాక లెనిన్ స్వయంగా తయారుచేసి ప్రకటించిన చరిత్రాత్మక డిక్రీలు రెండూ శాంతిని గురించీ, భూమిని గురించీను. ఈ రెండు డిక్రీలు నవంబరు 25, 26 తేదీల్లో — అంటే అధికారంలోకివచ్చిన 24 గంటల్లో— ప్రకటింపబడ్డాయి.

శాంతిని గురించిన డిక్రీలో రెండు ప్రధానాంశా లున్నాయి. యుద్ధంలో భాగస్వాములైన ప్రభుత్వాల్నీ ప్రజల్నీ వెన్వెంటనే యుద్ధానికి స్వస్తి చెప్పవలసిందని ఆ డిక్రీ హెచ్చరించింది. అంతేకాక, ఆక్రమణలకు ఆస్కారంలేని శాంతి అనే నినాదాన్ని వివరిస్తూ, దిగ్భ్రాంతి గొల్పేవిధంగా, సాహసోపేతంగా అతి నిశితంగా, జాతులకు స్వయం నిర్ణయాధికారం ఉంటుందని అది ప్రకటించింది. వెంటనే, రష్యన్ సామ్రాజ్యంలో పరాధీన జాతులుగా ఉంటూవచ్చిన ఫిన్నిష్, పోలిష్, ఎస్టోనియన్ జాతులకు, మధ్య ఆసియాలోని ముస్లిం జాతులకు స్వయం నిర్ణయాధికారం ఈయబడింది. వారు సోవియట్ రిపబ్లిక్‌లో ఉండదలచుకోకపోతే విడిపోవడానికికూడా అధికార మీయబడింది. డిక్రీలో యిలా ఉంది:

"స్థూలంగా, ప్రజాస్వామ్యం నిర్దేశించే న్యాయమార్గాన్ని, ముఖ్యంగా కార్మికవర్గాల ప్రయోజనాల్ని దృష్టిలోఉంచుకొని, ప్రభుత్వం (అనగా సోవియట్ ప్రభుత్వం—రచ.), అన్య భూభాగాల్ని ఆక్ర మించుకోవడం లేదా స్వాధీనపరచుకోవడం అంటే అర్థం, ఒక చిన్న లేదా బలహీన జాతిని ఆ జాతియొక్క ఖచ్చితమైన, స్పష్టమైన, స్వచ్ఛందమైన ఆమోదం పొందకుండా, ఒకపెద్ద బలవత్తరమైన రాజ్యంలో కలిపివేసుకోవడమని అభిప్రాయపడుతోంది. ఆ జాతి ఎప్పుడు బలాత్కా రంగా కలిపివేసుకోబడింది? అలా కలిపివేసుకోబడిన, లేదా నిర్బంధంగా ఆ పెద్ద రాజ్యంలో భాగంగా అట్టేపెట్టుకోబడిన ఆ జాతి ఏ మేరకు అభి వృద్ధి చెందింది, లేదా వెనుకబడియుంది? అది యూరపులో ఉందా, లేక, సముద్రాంతర దూరదేశంగా ఉందా? అనే విషయాలతో దీని కెట్టిప్రసక్తి ఉండకూడదు."

అన్య భూభాగాన్ని, జాతుల్ని ఆక్రమించుకోవడమంటే ఏమిటో తెలియజేసే పై నిర్వచనం ఎంత విప్లవాత్మకంగా, ఎంత విశదంగా,ఎంత న్యాయశాస్త్ర బద్ధంగా ఉంది! సందేహాలకు తావీయని విధంగా, ముక్కుకు సూటిగా, ఒప్పించే విధంగా అది నిర్వచింపబడింది. హిండెంబర్గులు, లాయడ్ జార్జిలు, క్లెమెన్సోలు, లేదా సోషల్ డెమాక్రటిక్ మిత్రులు మాక్డోనాల్డులు వాండర్విల్డులు అన్య భూభాగాల్ని కాజేసేందుకు ఒక్క సందుకూడా వదలకుండా అది బిగించివేసింది. "ఆక్రమణ" అనే విధా నానికి పైన చెప్పబడిన నిర్వచనం అంగీకరింపబడితే, "శ్వేత జాతుల బాధ్యత," "నాగరికతను వ్యాప్తిచేయడంలో పాశ్చాత్యుల పవిత్ర కర్త వ్యం" మొదలైన బూటకపు సాకులకు యిక అవకాశంఉండదు.

అతి క్లుప్తంగాను, సులభగ్రాహ్యంగాను ఉన్న యీ నిర్వచనం ద్వారా. ప్రకటన ద్వారా లెనిన్ ఎవరిని ప్రధానంగా ఉద్దేశించి మాట్లా డాడు, ప్రధానంగా ఆసియా ఆఫ్రికా ఖండాలలో నివసించే కోట్లాది ప్రజల్ని, చైనా ఇండియా దేశాల ప్రజల్ని ఉద్దేశించి చెప్పిన మాట లివి.

బలహీన జాతులు 20వ శతాబ్దంలో ఆక్రమించుకోబడినా, "వెనుక బడినవైనా" విద్యాగంధం లేనివైనా, సమీప ప్రాంతాల్లో" ఉన్నా "సముద్రాంతర ప్రాంతాల్లో ఉన్నా వెన్వెంటనే యీ జాతులకు సంపూర్ణ స్వాతంత్ర్య మీయాలి. ఇదీ ఆ ప్రకటనయొక్క సారాంశం.

అదే రోజున ప్రకటింపబడిన భూమిని గురించిన డిక్రీ యిలా తెలియజేసింది :

"భూమిపై భూస్వాముల యాజమాన్యం యింతటితో నష్టపరిహారం లేకుండా రద్దుచేయబడింది.

"భూస్వాముల ఎస్టేట్లు, రాజ భోగ్యాలు, చర్చిభూములు, వాటికి సంబంధించిన పశుగణం, పనిముట్లు, బిల్డింగులతోసహా సకల వస్తువులు గ్రామీణ ప్రాంతాల ల్యాండ్ కమిటీలకు, రైతు ప్రతినిధుల జిల్లా సోవియట్లకు, స్వాధీనం చేయబడతాయి."

నిరంతరం పీడింపబడే, శిస్తుల భారంతో కృంగి కృశించే ఏ గ్రామీణ శ్రామికుడైనా — అతడెంత నిరక్షరకుక్షి అయినా, ప్రపంచంలో ఏ మూల నివసిస్తున్నా—పై డిక్రీయొక్క అర్థాన్ని గ్రహించకుండా ఉండగలడా ?

"1917లో వలస దేశాలన్నీ, ప్రపంచ జనాభాలో అత్యధిక సంఖ్యాకులుగా ఉండే పరాధీన ప్రజలంతా పాశ్చాత్య సామ్రాజ్యవాదుల పదఘట్టాల క్రింద నలిగిపోతూ, మూడు ప్రధానమైన భారాల్ని తొలగించుకొనేందుకు పోరాట సన్నాహాలు జరుపుతున్నారు. అవి :

1. సామ్రాజ్యవాదులు బలవంతంగా రుద్దిన బందిపోటు యుద్ధం కొరకు తమ రక్తాన్నీ ధనాన్నీ కొల్లలుగా ధారపోయవలసిన పరిస్థితి.

2. విదేశీ పరిపాలన.

3. అంతరంగికంగా ఫ్యూడల్ దోపిడీ. ఈ ఫ్యూడల్ దోపిడీని సామ్రాజ్యవాదులే పెంచి పోషించారు. ఎందుచేతంటే, తమ దుష్పరిపా

నకు సాంఘిక అండగా ఉండే భూస్వాములు. వడ్డీవ్యాపారస్తులు వారికి అవసరమయారు.

ఇట్టి పరిస్థితుల్లో, లెనిన్ నాయకత్వం క్రింద పై రెండు డిక్రీలు వెన్వెంటనే, సాహసోపేతంగా, దృఢ నిశ్చయంతో అమలుజరపబడ్డంతో, మధ్యఆసియాలోని సువిశాల జారిస్టుభూభాగా లన్నీ అగ్నిజ్వాలల్లా విజృం భించడంలో ఆశ్చర్య మేముంది? అదెంత సహజమైన, అనివార్యమైన పరిణామం! తర్వాత ఆ జ్వాలలు ఆసియాలోని యితర ప్రాంతాలకు కూడా వ్యాపించాయి.

అట్టి పరిణామం జరిగడంలో అబ్బుర మేమిలేదు; జరక్కపోతేనే అబ్బురం.

అట్టి పరిణామాన్ని నివారించేందుకు ఎవరెన్ని ప్రయత్నాలు చేసినా లాభం లేకపోయింది.

సామ్రాజ్యవాదుల సాయుధ ముట్టడులు జరిపారు; యితర దేశా లకు వార్తలు యివ్వకుండా కట్టుదిట్టాలు చేశారు. బోల్షివిక్కులు "చిత్ర హింసలు" జరుపుతున్నారంటూ బ్రిటిష్, ఫ్రెంచి, జర్మన్, అమెరికన్ ప్రచారకులు, వారికి క్రొత్తగా శుశ్రూష ప్రారంభిజచిన జర్మన్‌బంట్లు కాకమ్మ కథ లెన్నిటినో ప్రచారంచేశారు. అయినా, అట్టి పరిణామా న్నెవరూ ఆపలేకపోయారు.

వలసదేశాల ప్రజ లెన్నడూ తమ శ్వేత జాతి పాలకుల్ని సత్య సంధులుగా, దయార్ద్రహృదయులుగా పరిగణించలేదు. 1905 లో జరిగిన రష్యా-జపాన్ యుద్ధంయొక్క పర్యవసానం చూచిన తర్వాత. మొదటి ప్రపంచయుద్ధంలో జరిగిన ఘటనల్ని గురించి తెలుసుకొన్న తర్వాత, వారు తమ పాలకుల సాయుధ శక్తిని చూచి భయకంపితులు కాలేదు. రష్యా విప్లవం ఖండ ఖండాలకు వ్యాపింపజేసిన అతి సులభ గ్రాహ్యమైన సందేశాన్ని—ఆర్థిక, సాంఘిక, రాజకీయ స్వాతంత్ర్యమనే సందేశం— అర్థం చేసుకోలేనంత మూఢులుకారు, వారు.

భారతదేశంలో బ్రిటిష్ పాలనను కూలద్రోసేటందుకు లెనిన్‌కి గాని, సోవియట్ ప్రభుత్వానికి గాని రహస్య కుట్రలు జరపవలసిన అవసర మేమీలేదు. అయితే, ఒక పెద్ద కుట్ర జరిగిన మాట వాస్తవమే. అది చరిత్ర జరిపిన కుట్ర. 20 కోట్ల రష్యన్ తదితర సోవియట్ ప్రజలు 40 కోట్ల భారత ప్రజలు ఒక పెద్ద కుట్ర జరిపారు. దీన్ని గురించి లెనిన్ యిలా వ్రాశాడు:

"రష్యా, ఇండియా, చైనా మొదలైన దేశాల ప్రజలు ప్రపంచ జనాభాలో అత్యధికులు. ఇదే, అంత్య పరిశీలనలో, పోరాటంయొక్క ఫలితాన్ని నిర్ణయిస్తుంది. గత కొద్ది సంవత్సరాల్లో వీరే శరవేగంతో స్వాతంత్ర్య పోరాటంలో సమీకృతు లవుతున్నారు. అందుచేత, ప్రపంచ ప్రజ పోరాటం ఎలాంటి అంతిమ ఫలితా న్నిస్తుందనే విషయంలో ఎట్టి సందేహం పెట్టుకోనక్కర్లెదు. ఈ దృష్టితో చూచినప్పుడు, సోషలిజం ఖచ్చితంగా, నిస్సందేహంగా జయించి తీరుతుంది."

బ్రిటన్‌కీ, యితర సామ్రాజ్యవాద ప్రభుత్వాలకూ అది చెడురోజే మరి! కాని, ఎవరేమి చేయగలరు?

# రెండవ అధ్యాయం

# భారత జాతీయవాదులకు కొత్త వెలుగు

భారతదేశంపై రష్యా విప్లవంయొక్క ప్రభావమల్లా కమ్యూనిస్టు పార్టీ స్థాపనేనని సోవియట్ వ్యతిరేకులు చెబుతూ ఉంటారు. మహా అయితే కార్మికోద్యమంమీద కూడా దాని ప్రభావం పడిందని అయిష్టంగా అంగీకరిస్తారు. కాని మన స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించినంతవరకు రష్యా విప్లవం మనకు విజాతీయ మైనదనీ, వ్యతిరేకమైనదనీ, గర్హ్యణీయ మైనదనీ వారి వాదన.

భారతదేశంలోని కమ్యూనిస్టులు, కార్మికోద్యమ కార్యకర్తలు రష్యా విప్లవానికి తామెంత రుణపడియున్నారో చెప్పుకోడానికి సిగ్గుపడరు. (అలా సిగ్గుపడవలసిన అవసరం వారికి లేదు). ఇది సహజం కూడా. ఎందుచేతంటే, రష్యా విప్లవం బ్రిటిష్ పాలనను, బ్రిటిష్ దోపిడీని మాత్రమే కాక, కార్మికవర్గంపై పెట్టుబడిదార్ల దోపిడీని కూడా కూల ద్రోసేందుకు మార్గం చూపింది. కమ్యూనిస్టులీ విషయాన్ని రష్యా విప్లవం నుంచి తెలుసుకున్నారు. ఆనాడు మార్క్సిజాన్ని స్వీకరించిన భారత విప్లవకారుల దృష్టిలో జాతీయ సామాజిక విముక్తిని సాధించేందుకు రష్యా విప్లవ మొక్కటే సంతృప్తికరమైన సిద్ధాంతాన్నీ, ఆచరణనూ ప్రసాదించింది,

అయినప్పటికీ, ఆ నాడు మన స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించినవారు రష్యా విప్లవాన్ని విజాతీయమైనదిగా, స్వాతంత్ర్యోద్యమంపై ఎట్టి ప్రభావమూ కలుగజేయని ఘటనగా భావించారనడం ఏమాత్రం వాస్తవంకాదు. అది ఉద్దేశపూర్వకమైన ప్రచారం మాత్రమే. భారత స్వాతంత్ర్యోద్యమంపై రష్యా విప్లవంయొక్క ప్రభావం ఎంతో ఉంది,

మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభం కాకముందూ, ప్రారంభమై కొనసాగుతూన్నప్పుడూ కొందరు భారతీయ విప్లవకారులు యూరపు, అమెరికాలకు వలస వెళ్ళారు. వారిచే భారత కమ్యూనిస్టుపార్టీని స్థాపింప జేసేందుకు అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ 1920 లో మొట్టమొదటి సారిగా ప్రయత్నించింది. ఆ పార్టీ భారతదేశాని కిచ్చిన మొట్టమొదటి సందేశం, 1921 లో అహమ్మదాబాదులో జరిగిన జాతీయకాంగ్రెసు మహా సభకు.

అందుచేత. అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ భారతదేశ రంగస్థలిపై ప్రవేశించకముందు మన స్వాతంత్ర్యోద్యమంలో అందరికంటె ప్రగతిశీలురైనవారు రష్యా విప్లవంపట్ల ఎలాంటి దృక్పథ మవలంబించారో తెలుసుకోవడం అవసరం.

ఆ రోజుల్లో యీ కోవకుచెందిన వారిని తీవ్రవాదులనీ, జాతీయ వాదులనీ పిలిచేవారు. వీరికి నాయకులు లోకమాన్య తిలకు, బెంగాల్ పంజాబ్‌లలో ఆయనకు సహచరులుగా పనిచేసేవారూను.

తిలక్ 1908–14 మధ్య మాండలే జైల్లో నిర్బంధింబడి యున్నప్పుడు ఆయన శిష్యుడు కె. పి. ఖడీల్కార్ తిలక్‌చే స్థాపింపబడిన "కేసరి" పత్రికకు సంపాదకుడుగా పనిచేశారు. ఈయన ప్రఖ్యాత జర్నలిస్టు. ఆ రోజుల్లో "చిత్రమయ జగత్తు" అనే పేరుతో వెలువడే ప్రఖ్యాత మహారాష్ట్రి మాస పత్రికకు ఖడీల్కార్ మొదటి ప్రపంచయుద్ధాన్ని గురించి ప్రతి నెలా సమీక్షలు వ్రాసేవారు. మొదట్లో అవి యుద్ధ తంత్రం సమీక్షలుగా ఉండేవి. 1917 నుంచి వాటికి రాజకీయ స్వభావం వచ్చింది.

1917 అక్టోబరులో, అనగా రష్యా విప్లవానికి నెలరోజులుముందు, వెలువడిన సంచికలో ఖడీల్కార్ యిలా వ్రాశారు :

"నేడు రష్యాలో రెండు ప్రధానమైన శక్తుల మధ్య సంఘర్షణ జరుగుతోంది. మార్చి విప్లవంలో పెట్టుబడిదార్లు, ఉన్నత సైనికోద్యోగులు డ్యూమాలో అధికారాన్ని చేజిక్కించుకున్నారు. పెట్టుబడిదార్లు సైని

కోద్యోలకు అయిష్టంగా ఉండదలచుకోలేదు. అందుచేత, వారు ఉభయులూ ఒక కూటమిగా ఏర్పడ్డారు, ఈ కూటమికి కార్మికులు వ్యతిరేకం.

"ఈ విధంగా, మార్చినుండీ రష్యాలో ఒక నూతన పోరాటం జరుగుతోంది. జారిస్టు ప్రభుత్వాన్ని కూలద్రోసిన కార్మికులు, సైనికులు సోషలిజం కొరకు పోరాడుతున్నారు. సోషలిస్టులు భూస్వాముల్ని, కోటీశ్వరుల్ని వ్యతిరేకించడం మాత్రమేకాక, వారిని కూలద్రోయడానికి నిశ్చయించుకున్నారు. వీరు మధ్య తరగతి ప్రజలకు వ్యతిరేకం కాదు: పెట్టుబడిదార్లకు మాత్రం వ్యతిరేకం ...

"ఈ నూతన పోరాటం ఏడాదిలోనో, రెండేండ్లలోనో పూర్తి అయేదికాదు. మొత్తం యూరపుఖండాన్ని రెండుతరాలవరకు అది ముంచెత్తబోతూంది...

"పెట్టుబడిదార్లు జర్మనీతో యుద్ధం కొనసాగించాలని కుతూహల పడుతున్నారు; కాని సోషలిస్టులు జర్మనీపై విజయం సాధించాలని కోరడంలేదు. పెట్టుబడిదారుల్ని అధికారంనుంచి కూలద్రోయాలని వారు అభిలషిస్తున్నారు. ఈ సంఘర్షణ వచ్చే కొద్ది మాసాల్లో తీవ్రతరం కాబోతూంది."

నవంబరు విప్లవానికి నెల రోజులుముందే ఒక ప్రముఖ తీవ్ర జాతీయవాది ఎంత నిశితంగా, ఎంత సానుభూతితో పరిస్థితిని అర్థం చేసుకున్నారు !

పై వ్యాఖ్యలో శ్రీ ఖడీల్కర్ "సోషలిస్టులు" అనే మాటను "కమ్యూనిస్టులు," "బోల్షివిక్కులు" అనే అర్థంలో వాడినట్లు స్పష్టంగానే తెలుసుకోవచ్చు. అదే వ్యాసంలో ఆయన "కార్మికులు, సైనికులు ఎన్నుకున్న కమిటీలకూ, కెరెన్‌స్కీ — కోర్నిలోవ్ కూటమికీ మధ్య సంఘర్షణ జరుగుతూన్నట్లు కూడా తెలియజేశారు. "బోల్షివిక్," "సోవియట్" అనే మాటలు అప్పటికింకా భారతదేశ తీరానికి చేరలేదు.

నవంబరు విప్లవం తర్వాత, 1917 డిసెంబరులో "చిత్రమయ జగత్తు"లో మొట్టమొదటి వ్యాసం వ్రాస్తూ, శ్రీఖడీల్కార్ యిలా వ్యాఖ్యానించారు :

"నవంబరులో, లెనిన్ నాయకత్వంక్రింద ఉంటూ, జర్మనీతో ప్రత్యేక సంధి చేసుకోవాలనుకొన్న సోషలిస్టులు పెట్రోగ్రాడ్‌లో అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. కెరెన్‌స్కీ, అతని మంత్రివర్గం అధికారంనుంచి కూలద్రోయబడ్డారు. లెనిన్‌ని బలపరచే నావికులు తిరుగుబాటుకు పిలుపు యిచ్చారు. కెరెన్‌స్కీ పారిపోయాడు. లెనిన్ పెట్రోగ్రాడ్, మాస్కో నగరాల్లోను, వాటి పరిసర ప్రాంతాల్లోను అధికారం స్వీకరించాడు. సైనికులు కూడా ఆయన్ని బలపరుస్తున్నారు...

"లెనిన్ జారీచేసిన ఒక డిక్రీలో సకల జాతులకు స్వయం నిర్ణయాధికారం ప్రకటింపబడింది. ఆ అధికారాన్ని అమలుజరుపుకునే స్వేచ్ఛ బాల్టిక్ రాజ్యాలకు, పోలిష్ ప్రజలకు ఈయబడింది."

ఈ వ్యాఖ్య ఎంత స్పష్టంగా, సందేహాలకు తావులేని విధంగా ఉంది ! జారిస్టు పరిపాలనక్రింద మ్రగ్గుతూండే జాతులకు స్వాతంత్ర్యమిస్తూ ప్రకటింపబడిన ఆ డిక్రీనిగురించి భారత దేశస్థులు 50 సంవత్సరాలక్రిందట వినియుంటే వారి హృదయా లెంత ఉప్పొంగి యుండేవి ! బ్రిటిష్ పాలకులనుంచి అలాంటి స్వాతంత్ర్యాన్నే కాదా, భారత దేశస్థులు కూడా కోరుతూ వచ్చింది ?

ఆ తర్వాత, లెనిన్ విదేశీ ఋణాల్ని ఎలా రద్దుచేశాడో రచయిత తెలియజేశారు. అట్టి చర్య ద్వారా బ్రిటిష్. ఫ్రెంచి ప్రభుత్వాల క్రోధానికి ఆయన గురి అవుతాడని ముందుగానే తెలుసుకున్నారు. ఆయ నిలా వ్రాశారు:

"అయితే, ప్రస్తుతం వారు రష్యాకు ఎక్కువ హాని చేయగల స్థితిలో లేరు. కాని, జపాన్‌వారు మాత్రం తూర్పు సైబీరియాలో కొన్ని భాగాలను ఆక్రమించుకోడానికి ప్రయత్నించవచ్చు."

1918 సంవత్సరమంతా యిలాంటి సమీక్షలే వెలువడ్డాయి. ఆ తర్వాత వెలువడిన సమీక్షలు చదివితే, లెనిన్ ధైర్య సాహసాలు రచయితను దిగ్భ్రాంతి గొల్పాయని బోధపడుతుంది. విప్లవంవల్ల కలిగిన విపత్తులన్నిటినీ సోవియట్ యూనియన్ అధిగమించగలదా — అని పదే పదే ఆయన ఆశ్చర్యం వెల్లడించారు. బోల్షివిక్కులు "క్రమాదిరిగా తిన్నని వారు" అని వర్ణించారు. ఆయన అభిప్రాయం, రాజీలంటే వారికి గిట్టవని.

ఈ సందర్భంలో మరొకటికూడా చెప్పవలసియుంది. విప్లవకారుల క్రౌర్యాన్నికూడా రచయిత ఖండించారు. ఇందుకు కారణం లేకపోలేదు, ఆ రోజుల్లో, "బోల్షివిక్ చిత్ర హింసలను" గురించి బ్రిటిష్ ప్రభుత్వం చేస్తూవచ్చిన ప్రచారం మన దేశానికి వెల్లువ మాదిరిగా ముంచుకొచ్చేది. విప్లవ విద్రోహుల హింసాకాండ ఏ మోతాదులో, ఎంత క్రూరంగా ఎంత అమానుషంగా ఉండేదో తెలియజేసే సమాచార మేదీ మన దేశానికి చేరేదికాదు.

లెనిన్ అధికారాన్ని నిలబెట్టుకోడానికి ఎంతవరకైనా వెళ్తాడనీ, ఏ పద్ధతులైనా అవలంబిస్తాడనీ, అయితే తన ఆశయానికి అభిప్రాయాలకూ ఖచ్చితంగా కట్టుబడి యుంటాడనీ రచయిత తన వ్యాసాల్లో తెలియజేశారు.

యుద్ధం సమాప్తమయినప్పటినుంచి వెర్సేల్స్ సంధివరకు ఖడీల్కర్ వ్రాసిన సమీక్షలు చదివితే, ఆనాటి యూరపుదేశ పరిస్థితుల్ని అవగాహన చేసుకోడంలో ఆయన ఎంత నిశితమైన బుద్ధిని ప్రదర్శించారో బోధపడుతుంది.

జర్మన్, ఆస్ట్రో-హంగేరియన్ రాచరిక ప్రభుత్వాలు, మధ్య యూరప్‌లోని ఆర్థిక - సాంఘిక వ్యవస్థ ఎలా కూలిపోయాయో వర్ణిస్తూ యూరపులో అసలు సంఘర్షణ నిరంకుశ చక్రవర్తులకూ, బ్రిటిష్-ఫ్రెంచి తరహా ప్రజాస్వామ్యానికీ మధ్య కాదని రచయిత పదేపదే స్పష్టం చేశారు. ఆయనిలా వ్రాశారు : "నూరు సంవత్సరాల క్రిందట ఆ సంఘ

రణ పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యానికీ, సోషలిస్టు ప్రజాస్వామ్యానికీ మధ్య. రష్యాలో రాజకీయ విప్లవం జరిగిన తర్వాత, ఐశ్వర్యవంతులకు వ్యతిరేకంగా జరిగే విప్లవంమీదనే యూరపియన్ ప్రజల దృష్టి అంతా కేంద్రీకరింపబడి యుంది."

నిజానికి పార్లమెంటరీ ప్రజాస్వామ్యమంటే కోటీశ్వరుల అధికారం తప్ప మరొకటి కాదని రచయిత విశదంగా నిరూపించారు. ఈ కోటీశ్వరులు "తమ దేశాల ప్రజల్నేకాక, యితర దేశాల ప్రజల్నికూడా కొల్లగొట్టుకుంటూ, ప్రపంచ యుద్ధాన్ని తెచ్చిపెట్టారు," అని వ్రాశారు.

బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు జర్మన్లపై రుద్దిన యుద్ధవిరమణ షరతులను గురించి రచయిత యిలా వ్రాశారు: "అవి, జర్మన్లు రష్యన్లపై రుద్దిన బ్రెస్ట్‌లిటోవ్‌స్క్ సంధి షరతులకంటే అధ్వాన్నమైనవి."

జర్మనీ, ఆస్ట్రియా, హంగరీలలో జరిగిన తిరుగుబాట్లను రచయిత వివరంగా చిత్రించారు. మిత్రరాజ్యాలు "తమ షరతులను అమలుజరపడానికి, యుద్ధ ఖర్చులను రాబట్టుకోడానికి జర్మనీపైకి తమ సేనల్ని నడిపినట్లయితే, మధ్య యూరపులో రష్యా విప్లవాన్నిపోలిన అంతర్యుద్ధం అనివార్య మవుతుంది. అందులో అమెరికా జోక్యం కలిగించుకొంటే, అది ఫ్రాన్స్, ఇంగ్లండులలోనేకాక, అమెరికాలోకూడ అంతర్యుద్ధాన్ని రగిలించవచ్చు," నని హెచ్చరించారు.

వెర్సేల్స్ సంధిని గురించి వ్యాఖ్యానిస్తూ, ఆక్రమణలూ యుద్ధ నష్టపరిహారాలూ లేని శాంతి అవసరమని ఉద్ఘాటించిన ఘనత ప్రెసిడెంటు విల్సన్‌ది కాదనీ, "రెండు సంవత్సరాల క్రిందటే లెనిన్ ఆ పని చేశా" డనీ వ్యంగంగా వ్రాశారు.

"మహా ఘనత వహించిన బ్రిటిష్ సార్వభౌముని ప్రభుత్వాన్ని కూలద్రోసేందుకు కుట్ర జరిపే" ఉద్దేశ్యంతో, అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థనుంచి ఒక్క ప్రతినిధికూడా భారతదేశంలో అడుగుపెట్టకముందే, రష్యా విప్లవం ఒక భారతీయ యువక దేశభక్తుని హృదయాన్నెలా ఉద్రూతలూగించిందో పై వాక్యాలనుబట్టి తెలుసుకోవచ్చు.

లోకమాన్య తిలక్ మాండలే జైల్లో ఆరు సంవత్సరాల జైలు శిక్ష అనుభవించి 1914 లో అనగా యుద్ధం ప్రారంభ మయేనాటికి విడుదల యారు. వెన్వెంటనే "కేసరి" పత్రిక సంపాదకత్వాన్ని తిరిగి స్వీకరించారు. యుద్ధాన్ని గురించిన ఆయన దృక్పథం యిది: "ప్రభుత్వం ప్రమాదంలో యిరుక్కోవడం మనకు ఒక అవకాశం." ఈ వాక్యాన్ని ఆయన తరచు నొక్కి చెప్పేవారు. ఆ రోజుల్లో యిలా చెప్పడం నిస్సందేహంగా సాహసమే; ఒక ముందడుగే. బ్రిటిష్ ప్రభుత్వం ఆ రోజుల్లో యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని క్షమింపరాని నేరంగా పరిగణించేది. తిలక్ రాజద్రోహ నేరం క్రింద మూడవసారి 1916 లో ప్రాసిక్యూట్ చేయబడిన విషయం చాలమందికి తెలియదు. అయితే, ప్రభుత్వం యీసారి ఆయనపై శిక్ష విధించలేకపోయింది.

రష్యా విప్లవం జరిగిన రెండు నెలలలోపల, 1918 జనవరి 29 తేదీని "కేసరి" పత్రిక "రష్యా నాయకుడు లెనిన్" అనే శీర్షికతో ఒక సంపాదకీయ వ్యాసం ప్రకటించింది. అందులోని వాక్యాలు

"మేము లెనిన్ జీవితానికి సంబంధించిన ప్రధాన విషయాలను యిక్కడ ప్రచురిస్తున్నాం. ఎందుచేతంటే, రష్యన్ ప్రజానాయకుడు లెనిన్ ఒక జర్మన్ యూదుకుటుంబంలో పుట్టాడనీ, జర్మన్ ప్రభుత్వం ఆయనకు లంచమిచ్చిందనీ దుష్ప్రచారం జరుగుతోంది. మిత్రరాజ్యాలకు విధేయులని చెప్పబడే రష్యన్ ప్రజల్ని లెనిన్ తిరుగుబాటుకు పురిగొల్పుతున్నాడనీ ఆరోపింప బడుతోంది."

వ్యాసంయొక్క ఉద్దేశాన్ని తెలియజేసేందుకు వ్రాసిన పై వాక్యాలు తిలక్ సహజ ధోరణిని తెలియజేస్తున్నాయి. పోలీసు లాయనను అరెస్టు చేసే ప్రమాదం ఎల్లప్పుడూ ఉండేది. అందుచేత ఆయన తన ఉపన్యాసాల్లోను, వ్యాసాల్లోను అతి నైపుణ్యంతో కూడిన ఒక ప్రత్యేక శైలిని అలవరచుకున్నారు. "మహోఘనత వహించిన సార్వభౌముని శాంతి భద్రతలను" కాపాడ్డంలో అత్యంత జాగరూకులైన అధికార్లు ఒకవేళ ఆయనను అరెస్టుచేసి కోర్టులో విచారణ జరిపితే, చట్టరీత్యా తాను నిరపరాధినని

రుజువు చేసుకొనేందుకూ, రెండోవైపు తన భావాన్ని శ్రోతలూ, పాఠకులూ సులభంగా గ్రహించగలగడానికీ అనువైన శైలి అది.

ఉదాహరణకు, పై వాక్యాల్నిబట్టి, లెనిన్‌కి వ్యతిరేకంగా "దుష్ప్రచారం" జరుపుతూన్నది బ్రిటిష్ ప్రభుత్వమని స్పష్టంగా మనకు బోధపడుతుంది. కాని, ఆ అర్థంవచ్చే మాటలు అందులో లేవు. ఇలాగే, "రష్యన్ ప్రజల్ని తిరుగుబాటుకు పురిగొల్పుతున్నాడని ఆరోపింపబడుతోంది," అనే వాక్యంలోని మాటలు ఎంతో అర్థవంతమైనవి. ఎందుచేతంటే, తిలక్‌కి వ్యతిరేకంగా తేబడిన అభియోగా లన్నిటిలోను "భారత ప్రజల్ని తిరుగుబాటుకు పురిగొల్పి" నట్లు చెప్పబడింది. బ్రిటిష్ పాలకుల్ని గట్టిగా సమర్థిస్తూ వచ్చిన సర్ వాలెంటైన్ షిరోల్ అనే ప్రముఖ వ్యాఖ్యాత "భారతదేశంలో అశాంతికి మూలకారకుడు తిలక్" అనీ, యిదే అతని మహానేరమనీ వ్రాశాడు. "మిత్రరాజ్యాలకు విధేయులని చెప్పబడే రష్యన్ ప్రజలు" అనే మాటలకు అర్థం సులభంగానే తెలుసుకోవచ్చు. నిజంగా రష్యన్ ప్రజలు మిత్రరాజ్యాలకు విధేయులుకారని చెప్పడం రచయిత ఉద్దేశం.

లెనిన్ జీవితాన్ని ఆ వ్యాసం ఎంతో చక్కగా చిత్రించింది. "పిన్న వయస్సులోనే ఆయన కారల్ మార్క్స్ సోషలిస్టు సిద్ధాంతాన్ని స్వీకరించా"డనీ, "బాల్యంనుంచీ రైతులకు ఎడతెగకుండా సహాయంచేస్తూ వారిచే ఆకర్షింపబడ్డా" డనీ, "రష్యాలో వ్యవసాయ సమస్యను గురించిన ఆయన రచనలు ప్రతిభావంతమైన"వనీ తెలియజేశారు.

ఆ వ్యాసంలో ఇంకా యిలా ఉంది :

"లెనిన్ శాంతిని కోరాడు...కెరన్‌స్కీ ఉన్నత వర్గాలతో రాజీ చేసుకొనే ప్రాతిపదికపై రష్యా ప్రభుత్వాన్ని నడపదలచుకోడంవల్లనే, లెనిన్ అతనితో భేదించాడు. వారితో అలాంటి సంబంధా లుంచుకోడానికి లెనిన్ వ్యతిరేకం. యుద్ధంలో పాల్గొంటున్న జాతుల్లోని యీ ఉన్నత

వర్గాలు పూర్తిగా స్వార్థపరులు, దుర్మార్గులు అనీ, అన్ని దేశాల్లోని పేద ప్రజల శ్రేయస్సుకు వీరు శత్రువులనీ, యుద్ధాన్ని ప్రారంభించిందికూడ వీరేననీ, కార్మికులు నిజాయితీపరులు, శాంతి కాముకులు అనీ ఆయన అభిప్రాయం.

"ఈ భేదం వల్లనే కెరన్‌స్కీ లెనిన్ అరెస్టుకు ఉత్తర్వులు జారీ చేశాడు. ఆ తర్వాత లెనిన్ నాయకత్వం క్రిందనున్న కార్మికపార్టీ కెరన్‌స్కీ ప్రభుత్వాన్ని కూలద్రోయడంద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకొంది.

"లెనిన్ భూస్వాముల భూమిని రైతులకు పంచిపెట్టడంతో. సైనికుల్లోను, సామాన్య ప్రజల్లోను ఆయన పలుకుబడి పెరిగింది.

"లెనిన్ గురించిన ప్రధానాంశాలు, యివి."

బ్రిటిష్ ప్రభుత్వం ఎంత దుష్ప్రచారంచేసినా, రష్యా విప్లవమంటే ఏమిటో, లెనిన్ ఎలాంటివాడో తిలక్ సంపాదకత్వంక్రింద నడిచే "కేసరి" పత్రికకు ఎట్టి సందేహంలేదని మనకు బోధపడుతుంది.

1918 నవంబరు 12 తేదీ సంచికలో "కూలిపోయిన మూడు సింహాసనాలు" అనే శీర్షికతో "కేసరి" ఒక సంపాదకీయం ప్రచురించింది. అందులో, హోహెన్ జోలెర్న్ (జర్మన్), హాప్స్‌బర్గ (ఆస్ట్రియన్) సామ్రాజ్యాలు కూలిపోయిన తర్వాత (జారిస్టు సామ్రాజ్యం అదివరకే సంవత్సరం క్రిందట కూలిపోయింది) మధ్య యూరపులోని పరిస్థితి పర్ణింపబడింది. యుద్ధానంతరం యూరపులో విజృంభించిన కార్మికవెల్లువ, ప్రజా వెల్లువ. "నిరంకుశ రాచరికాలకు వ్యతిరేకం. సమస్త యుద్ధాలను తుదముట్టించే నిజమైన ప్రజాపాలనకు అనుకూలం: కనీస వేతనం, 8 గంటలపని అమలుజరపబడాలి. ఫ్యాక్టరీలలో కార్మికుల్ని దోచుకోడం. యుద్ధరంగాల్లో వారి మారణహోమం అంతంచేయబడాలి; ధనికుల రాజ్యం పోయి పేదల రాజ్యం స్థాపింపబడాలి."

తిలక్ 1918 లో ఇంగ్లండుకు వెళ్ళారు. ఆయన ప్రధానోద్దేశం, భారతదేశం కోరుతూ వచ్చిన హోం రూలును గురించి (స్వపరిపాలన అనే మాటకు ఆనాటి పర్యాయపదం) ఇంగ్లండులో ప్రచారం చేయడం, దానికి సహాయ సానుభూతులు పొందడమూను. అయితే, పైకి మాత్రం చెప్పిన కారణం, వాలెంటైన్ షిరోల్‌పై ప్రీవీకౌన్సిల్‌లో పరువు నష్టపు దావా వేయడం. ఇంగ్లండుకు బయల్దేరి వెళ్ళేముందు అనేక కార్మిక సంఘాలు ఆయన్ను లండన్‌లో జరుగనున్న అంతర్జాతీయ కార్మిక మహా సభకు ప్రతినిధిగా ఎన్నుకున్నాయి. కాని. భారత ప్రభుత్వం విధించిన నిషేధాజ్ఞవల్ల ఆ మహాసభకు ఆయన హాజరు కాలేకపోయారు. అయినా. బ్రిటిష్ కార్మికోద్యమంతో, ముఖ్యంగా అతివాద పక్షానికి చెందిన లేబర్ పార్టీ నాయకులతో ఆయన సంబంధా లేర్పరచుకున్నారు,

1919 లో తిలక్ భారతదేశానికి తిరిగివచ్చాక బొంబాయి, మద్రాసు మొదలైనచోట్ల జరిగిన బ్రహ్మాండమైన కార్మిక సభల్లో ఆయనకు స్వాగత పత్రాలు సమర్పింపబడ్డాయి.

1919 డిసెంబరు 2 తేదీని బొంబాయిలో జరిగిన కార్మిక సభలో సమర్పింపబడిన స్వాగత పత్రానికి జవాబు చెబుతూ, తిలక్ యిలా ఉపన్య సించారు:

"మీ బాట కష్టాలతో కూడుకొన్నట్టిది; బాధలతో కూడుకొన్నట్టిది. మీరు జైలు శిక్షల్నీ, అంతకన్న క్రూరమైన వాటినీ ఎదుర్కోవలసి వస్తుంది. మీ ప్రధాన శత్రువు బ్రిటిష్ ప్రభుత్వం, అయితే, మీ ఐక్య శక్తి సాటిలేనిది; కార్మికు లందరూ — హిందువులుగాని, మహమ్మ దీయులుగాని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని — ఒకటేననీ, ఎల్లప్పుడూ మీరు సంఘీభావంతో మెలగాలనీ జ్ఞాపక ముంచుకొండి. పాశ్చాత్యదేశాల్లో కార్మికులు సంఘటితులయారు; రాజకీయాధికారంకొరకు ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం సంపాదించేందుకు వారు పోరాడు తున్నారు,"

1919 డిసెంబరు 23 తేదీని పెరంబూరులో (మద్రాసు) జరిగిన మరో కార్మిక సభలో తిలక్ యిలా చెప్పారు :

"కాలం గడిచేకొద్దీ కార్మిక సంఘాల పలుకుబడి పెరుగుతుంది. ముందు ముందు కార్మికులే పరిపాలకు లవుతారు."

మొదటి ప్రపంచయుద్ధం తర్వాత, 1919-1922 సంవత్సరాల మధ్య, మొట్టమొదటిసారిగా మన దేశంలో బ్రహ్మాండమైన జాతీయోద్యమ వెల్లువ, కార్మికోద్య వెల్లువ ఆసేతు హిమాచలం కట్టలుతెగి ప్రవహించిన విషయం మనందరికీ తెలుసు. 1920 జనవరి 6 తేదీని "కేసరి" పత్రిక సంపాదకీయంలో తిలక్; రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకోడానికి బలమైన ప్రజా ఉద్యమం అవసరమని తెలియజేస్తూ, భారతదేశంలో విజృభించే హర్తాళ్లను యూరపులో వ్యాపించే సర్వవ్యాపిత సమ్మెలతో పోల్చారు.

తిలక్ కార్మిక పోరాటాల్ని కేవలం అభిమానించడమేకాక, 20 వ శతాబ్దం ప్రారంభంనుంచే వాటిని గట్టిగా బలపరచారు. అన్నిటికంటే ఆశ్చర్యకరమైన విషయమేమంటే, మారుతున్న పరిస్థితుల్నిబట్టి ఆయన కూడా మారుతూ వచ్చారు. అప్పటికే 60 సంవత్సరాలుదాటి, శారీరకంగా బలహీనస్థితిలో ఉంటూ, మరణం ఆసన్నమవుతూన్నప్పుడు కూడా (1920 ఆగస్టులో ఆయన మరణించారు), కార్మికోద్యమంయొక్క రాజకీయ ప్రాధాన్యతనుగూర్చి ఆయన నొక్కిచెప్పారు.

ఈ పరిస్థితుల్లో, 1918 డిసెంబరులోను, 1919 జనవరిలోను బొంబాయి బట్టలమిల్లు కార్మికుల సమ్మెతో ప్రారంభమైన బ్రహ్మాండమైన యుద్ధానంతర కార్మిక వెల్లువను "కేసరి" పత్రిక ప్రశంసించడంలో ఆశ్చర్యం లేదు.

1919 జనవరి 21 తేదేని "బొంబాయి మహాసమ్మె" అనే శీర్షికతో "కేసరి" ప్రధాన సంపాదకీయం వ్రాసింది. అందులో, సమ్మెను గురించి అత్యంత నిశితమైన అవగాహన కలుగజేసింది; దాని చారిత్రాత్మక ప్రాధాన్యతను తెలియజేసింది.

బొంబాయి సమ్మెదార్లు ప్రదర్శించిన ఐక్యత, దృఢనిశ్చయం, సమ్మెయొక్క విస్తృతి "భారతదేశ చరిత్రలో అనన్యసామాన్యమైన" వనే మాటలతో ఆ సంపాదకీయం ప్రారంభమయింది. తర్వాత, "యీ సమ్మెను పురిగొల్పింది ఒక ప్రమాదకరమైన శక్తి" అనే చౌకబారు ఆరోపణను అది ఖండించింది. బొంబాయి ప్రభుత్వమూ, మిల్లు యజమానులూ బోల్షివిజాన్ని చూపి బెదురుపుట్టించేందుకే ఆ విషమైన జిత్తులమారి ఆరోపణ చేశారనేది స్పష్టం.

ఆ తర్వాత, యుద్ధానంతరం విపరీతంగా పెరిగిన ధరలవల్ల, జీవితావసర వస్తువుల కొరతవల్ల కార్మికుల బాధలెలా పెరిగాయో పై సంపాదకీయం వివరంగా, హృదయాల్ని కరిగించేటట్లు వర్ణించింది. అంతేకాదు. ఈ సమ్మెకు కారణాలు ఆర్థికమైనవేకావని తెలియజేసింది. ఈ క్రింది వాక్యాలెంత అర్థవంతమైనవో సులభంగా మనకు బోధపడుతుంది :

"ఈ సమ్మెకు కారణం నూతనశకం సృష్టించిన చైతన్యం కార్మికులకు, పెట్టుబడిదార్లకు మధ్య జరిగే సంఘర్షణను గురించిన వాదోపవాదాలను కార్మికులు చాల సంవత్సరాలుగా తెలుసుకొంటున్నారు. యుద్ధంవల్ల, రష్యా జర్మనీలలో జరిగిన విప్లవాలవల్ల వారిలో ఒక నూతన చైతన్యం వృద్ధిచెందడంలో ఆశ్చర్యంలేదు. జాతీయయోద్యమం కూడా కార్మికుల ముందు అదే సమస్యను ఉంచింది.

"కార్మికులు తమ నూతన శక్తిని గురించి చైతన్యం పొందారు; ఆ శక్తిని యితరులకు చూపదలచుకొన్నారు.

"సహజసిద్ధమైన, ప్రయత్న రహితమైన వర్గ అభిమానం, వర్గ ఐక్యతవల్లనే సమ్మె విస్తృత మయింది.

"ఈ ప్రయత్నరహితమైన వర్గ అభిమానం, అన్యోన్య సహాయం అపూర్వమైనట్టివి: అద్భుతమైనట్టివి.

"కార్మికులు తమ బాధల్ని, దుఃఖాల్ని నివారించుకొనే దివ్యౌషధం అన్యోన్య సమయం, సమ్మె తప్ప మరొకటి కావని యూరపియన్ కార్మి

కులు సందేశమిచ్చారు. ఆ సందేశం బొంబాయి కార్మికులకు కూడా అందింది."

యుద్ధానంతరం సమ్మె వెల్లువను గురించి ఎంత ప్రతిభావంతమైన అవగాహన, యిది ! తిలక్ రష్యా విప్లవంయొక్క ప్రభావాన్నీ, యూరపియన్ కార్మికుల సందేశాన్నీ "విజాతీయమైనవి," "ప్రమాదకరమైనవి" కావని అభిప్రాయపడ్డారు. ఈ విషయాన్ని మన సంకుచిత జాతీయవాదులు గమనించడం అవసరం: ఉత్తేజకరమైన, ఆరోగ్యకరమైన విషయాలుగా ఆయన వాటిని ఆహ్వానించారు.

కాని, మనదేశంలో తిలక్‌ను మించిన దేశభక్తులుగా, "జాతీయవాదులు"గా పోజువేసేవారు కొందరున్నారు, వారి ప్రయత్నాలు వ్యర్థం కాకమానవు,

ఆ సంపాదకీయంలో చివరిభాగం, పెట్టుబడిదార్లకు కార్మికులు చక్కని పాఠం నేర్పినందుకు, వారి తలపొగరును తగ్గించినందుకు కార్మికుల్ని అభినందించింది. తర్వాత యిలా చివరి హెచ్చరిక చేసింది.

"ప్రభుత్వం మిల్లు యజమానుల్నీ, పెట్టుబడిదార్లనూ బలపరుస్తోందన్న విషయం మరచిపోకండి. బొంబాయి గవర్నరును మధ్యవర్తిగా ఎంచుకోవాలన్న సూచనను మీరు తిరస్కరించాలి."

1919 జనవరి నాటికి భారతదేశంలో ఒక్క కమ్యూనిస్టుకూడా లేడు — విదేశస్తుడుగాని, స్వదేశస్తుడుగాని. అయినా, "కేసరి" పత్రిక సంపాదకీయంలో ఉన్నదానికంటే ఎక్కువ ఏ వర్గ చైతన్యంగల ట్రేడ్ యూనియన్ నాయకుడైనా చెప్పగలిగేవాడా ?

నిజమైన ఏ ప్రభుత్వమైనా మూడు పరీక్షలకు నిలబడగలగాలనీ, బోల్షివిక్కులు అలా నిలబడ్డారనీ "కేసరి" 1920 జూలై 20 తేదీ సంపాదకీయంలో రుజువుచేసింది. బోల్షివిక్కులు దేశంలో క్రమబద్ధమైన ఆర్థిక వ్యవస్థను నెలకొల్పారు; పరిపాలనా విధానాన్ని పునర్వ్యవస్థీకరించారు; ఒక బలమైన సైన్యాన్ని నిర్మించుకున్నారు;

సోవియట్ ప్రభుత్వం యొక్క విదేశాంగ విధాన మెట్టదో కూడా పై సంపాదకీయం తెలియజేసింది. ఈ క్రింది సూత్రాలపై ఆధారపడి అది రూపొందింపబడింది :

—బలప్రయోగంద్వారా ఏ ప్రభుత్వమూ విదేశ భూభాగాల్ని ఆక్రమించుకోవడంగాని, విదేశాలపై తన ఆర్థిక సూత్రాలను రుద్దడంగాని చేయకూడదు.

—ఒక్కొక్క దేశంయొక్క చారిత్రక సాంప్రదాయాలనుబట్టి, ఆర్థిక పరిస్థితుల్నిబట్టి సామాజిక, రాజకీయ వ్యవస్థలు ఉత్పన్నమవుతాయి.

ఆ తర్వాత, బోల్షివిక్కులు మాత్రమే స్వయంనిర్ణయ సూత్రానికిబద్ధులై యున్నారని రచయిత వ్యాఖ్యానించారు.

ఆనాడు భారత జాతీయోద్యమంయొక్క ప్రముఖ రాజకీయ పత్రిక యిచ్చిన తీర్పు యిది. గాంధీజీకి ముందు భారత స్వాతంత్రోద్యమానికి ప్రాతినిధ్యం వహించిన, నాయకత్వం వహించిన వ్యక్తిచే నడుపబడిన పత్రిక అది. ఆ పత్రిక యిచ్చిన తీర్పుకూ, "భారతదేశంలో బోల్షివిక్కుల కుట్రలు" అనే సిద్ధాంతాన్ని వ్యాప్తిచేసినవారి కుహనా వాదనలకూ పొత్తు ఎక్కడ :

పై సంపాదకీయం వ్రాసిన 12 రోజుల తర్వాత తిలక్ దివంగతులయారు.

ఆనాడు పశ్చిమ భారతదేశంలోని ప్రముఖ ఆంగ్ల దినపత్రిక "బొంబాయి క్రానికల్." దానికి సంపాదకుడు బి. జి. హార్నిమన్, ఆయన నిర్భయంగా భారత స్వాతంత్ర్యాన్ని గురించి ప్రచారం చేశారు, స్వయంగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు; ఆ సందర్భంలో ఎన్నో త్యాగాలు చేశారు.

1917 డిసెంబరు 24 తేదీ సంపాదకీయంలో "బొంబాయి క్రానికల్"లో యిలా వ్రాశారు :

"బోల్షివిక్కుల్ని గురించిన మా అభిప్రాయాలు చాల అస్పష్టమైనవి ... వారి కార్యక్రమంలో రైతుల్ని ఆకర్షించేదీ, వారి విశ్వాసాన్ని చూరగొనేదీ అంశమేదో లేకపోతే, బోల్షివిక్కులు యీ విజయం సాధించగలిగేవారు కారు ... రైతుల అవసరాలను దృష్టిలో ఉంచుకొని, ఒక నిర్దిష్టమైన పథకాన్ని బోల్షివిక్కులు రూపొందించారు. ప్రజలకొరకు వెంటనే భూముల్ని పంచిపెడతామని వాగ్దానం చేశారు."

"మహా మనీషి లెనిన్, ఆయనలక్ష్యాలు "అనే శీర్షికతో 1918 జనవరి 11 తేదీ సంచికలో "బొంబాయి క్రానికల్" యిలా వ్రాసింది :

"లెనిన్ జయిస్తే, నవంబరు విప్లవంముందు మార్చి విప్లవం ఎట్టి ప్రాధాన్యం వహించదు. ఎందుచేతనంటే, నవంబరు విప్లవం మధ్యతరగతిలో ఉన్నత శ్రేణికి చెందినవారి అధికారాన్ని కూలద్రోసి, ప్రజా సామాన్యానికి విజయం చేకూర్చింది."

ఇలాగే, పశ్చిమ భారతదేశంనుంచి జాతీయోద్యమానికి బలమైన కేంద్రంగా ఉంటూ వచ్చిన బెంగాల్‌వైపు మనదృష్టిని మరలిస్తే, ఇలాంటి అభిప్రాయాల్నే మన దేశభక్తులు వ్యక్తంచేశారని తేటతెల్లమవుతుంది.

ప్రఖ్యాత బెంగాలీ దేశభక్తుడు, మానవతావాది అయిన రామానంద ఛటర్జీ సంపాదకత్వంక్రింద వెలువడే "మోడర్న్‌రివ్యూ" భారతదేశంలో అగ్రశ్రేణికి చెందిన ఆంగ్ల జాతీయ మాసపత్రికగా ప్రఖ్యాతి పొందింది. నిజంచెప్పాలంటే, భారతీయ పత్రికా ప్రపంచంలో "మోడర్న్ రివ్యూ" కున్నంత దేశవ్యాపిత ప్రచారం, ప్రతిష్ఠ, అభిమానం మరోపత్రికకు లేదని (దాని ఉచ్ఛదశలో) చెప్పవచ్చు.

ఆ రోజుల్లో అతి నీచంగా, దుష్టబుద్ధితో సాగింపబడే సోవియట్ వ్యతిరేక ప్రచారాన్ని రామానందచటర్జీ ఏవగించుకున్నారు. రష్యా విప్లవాన్ని గురించి, సోవియట్‌లో జరిగే పరిణామాల్నిగురించి నిష్పాక్షికమైన, ఆధారాలతో కూడిన వ్యాసాలను భారతీయులనుంచీ, విదేశస్తులనుంచీ తెప్పించుకోడానికి గట్టిప్రయత్నాలు చేశారు. వాటిని యించుమించు

ధారావాహికంగా 1918 నుంచీ ప్రచురించారు. సోవియట్ యూనియన్, దాని పాలసీలను గురించి జాన్ రీడ్ వ్రాసే వ్యాసాలలోని భాగాలను "లిబరేటర్" అనే పత్రికనుంచి తీసుకొని ప్రచురించేవారు. బహుశా ఆ పత్రిక జాన్ రీడ్ సంపాదకత్వం క్రింద వెలువడేది.

1919 ఫిబ్రవరి "మోడర్న్ రివ్యూ""లో రామానందఛటర్జీ ఇలా వ్యాఖ్యానించారు :

"పెట్టుబడిదారీ పత్రికలు రష్యన్ సోవియట్లకు వ్యతిరేకంగా ప్రచురించే అసత్య వార్తలనుంచీ, అసభ్య దూషణలనుంచీ ఒకసారి మన దృష్టిని మరల్చి, సోవియట్ రాజ్యాంగ యంత్రాన్ని గురించిన యీ తేజోవంతమైన సమాచారాన్ని చదువుతూంటే ఎంతో ఉల్లాసం కలుగుతుంది ... విప్లవ రష్యా తన్ను తాను సంఘటిత మొనర్చుకొని, కమ్యూనిస్టు ఆశయాల్ని అమలు జరపడానికి ఎంత గొప్ప ప్రయత్నం చేస్తోందో ఎట్టకేలకు మనం తెలుసుకోగల్గుతున్నాం. నిజం చెప్పాలంటే, బోల్షివిక్కులు రష్యాదేశాన్ని కనీవిని ఎరుగనివిధంగా మెరుగుపరచేందుకు, ఔన్నత్యాన్ని సాధించేందుకు ప్రయత్నిస్తున్నారు."

ప్రతి నెలా "మోడర్న్ రివ్యూ" సంపాదకుడు యిలాంటి వ్యాఖ్యలను ప్రచురిస్తూ ఉండేవారు.

రష్యన్ ప్రజలు చిరకాలంగా క్రూరమైన అన్యాయాలను అనుభవిస్తూ రావడంవల్లా, పరదేశరాజ్యాల దురాక్రమణకు వారు గురికావడంవల్లా బోల్షివిజం సహజంగా తలెత్తిందని ఒక విదేశీ పత్రిక వ్యక్తం చేసిన అభిప్రాయంపై "మోడర్న్ రివ్యూ" 1920 ఆగస్టు సంచికలో యిలా వ్యాఖ్యానించింది :

"ఈ అభిప్రాయ ప్రకటనను భారతదేశంలోని మత దురహంకారులు, నిరంకుశోద్యోగులు, రాజకీయ పెత్తందార్లు, పెట్టుబడిదార్లుదృష్టిలో ఉంచుకొనడం మంచిది." ఎంత పదునైన వ్యాఖ్య యిది !

ఒక సంచికలో, రష్యన్ ఉపాధ్యాయులు. విద్యార్థులు ఎంత ఉత్సాహంతో నిరక్షరాస్యతను రూపుమాపుతున్నారో వర్ణిస్తూ, యిలా ప్రశ్నించింది: "మన ఉపాధ్యాయులు, విద్యార్థులు యీ పవిత్ర యుద్ధా నెప్పుడు ప్రారంభిస్తారు ?"

ఆనాటి "మోడర్న్ రివ్యూ" సంచికలను తిరగవేస్తే, యిలాంటి అభిప్రాయా లెన్నిటినో రామానంద ఛటర్జీ వ్యక్తం చేశారని బోధపడు తుంది.

రష్యా విప్లవంపట్ల, సోవియట్ పాలనపట్ల గాంధీ మహాత్ముని అభిప్రాయా లేమిటనే ప్రశ్న సహజంగా ఉదయిస్తుంది. విప్లవంయొక్క ప్రారంభదినాల్లో జరిగిన హింసాకాండను ఆయన ఏవగించుకొన్నమాట నిజమే. ఆయన దృక్పథం, తాత్వికచింతన అలాంటివి. కాని, క్లిష్ట సమ యంలో మాత్రం గాంధీజీ వెలిబుచ్చిన అభిప్రాయం అత్యంత ప్రాధాన్యం గలది.

ఆఫ్ఘనిస్తాన్‌లో బ్రిటిష్ పాలకులు జరిపిన కుట్రల ఫలితంగా మూడవ ఆఫ్ఘన్ యుద్ధం జరిగింది (1919 ఏప్రిల్‌నుండి ఆగస్టు వరకు), బోల్షివిక్కులు ఆఫ్ఘనిస్తాన్ రాజుకు యిచ్చిన ప్రోత్సాహమే యిందుకు కారణమని ఇంగ్లండ్, ఇండియాలలోని బ్రిటిష్ పాలకులు చెప్పారు. ఆఫ్ఘన్‌రాజు కిచ్చిన యీ ప్రోత్సాహం భారతదేశంమీద బోల్షివిక్కులు జరపదలచుకొన్న దాడికి నాందీవాచకమని వారు ప్రకటించారు. ఈ బోల్షి విక్ ప్రమాదాన్నెదుర్కొనేందుకు ప్రజా ఉద్యమాన్ని ఆపుజేసి తనతో సహకరించవలసిందంటూ అప్పటి వైస్రాయి లార్డ్ ఛెల్మ్స్‌ఫర్డ్ కాంగ్రెస్ నాయకులకు విజ్ఞప్తి చేశాడు.

ఆ విజ్ఞప్తికి గాంధీజీ అతి నిశితంగా యీ క్రింది సమాధానం చెప్పారు :

"నే నెన్నడూ బోల్షివిక్ ప్రమాదాన్ని నమ్మియుండలేదు. ఏ భారత ప్రభుత్వమైనా రష్యన్ ప్రమాదాన్నిగాని, బోల్షివిక్ ప్రమాదాన్నిగాని,

మరే యితర ప్రమాదాన్నిగాని చూచి భయపడవలసిన అవసరమేమిటి ?" ("యంగ్ ఇండియా," 1919-1922, పేజీ 717; జఫర్ ఇమాం ఉటంకించిన వాక్యాలు - సెంట్ ఆంథోనీ పేపర్స్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటి ప్రెస్).

రష్యన్ దాడి ప్రమాదమనే పేరుతో గాంధీజీ ప్రజా ఉద్యమాన్ని విరమించడానికి నిరాకరించారు.

ఆ తర్వాత, 1928 లో గాంధీజీ లెనిన్‌ని గురించీ, బోల్షివిజాన్ని గురించీ యిలా వ్రాశారు :

"...హింసాకాండ ఆధారంపై సుస్థిరమైనదేదీ నిర్మింపబడజాలదని నా దృఢవిశ్వాసం. అయినప్పటికీ, బోల్షివిక్ ఆశయం వెనుక అసంఖ్యాకులైన స్త్రీ పురుషుల నిర్మల త్యాగాలున్నాయి; దానికోసం వారు తమ సర్వస్వాన్నీ త్యాగం చేశారు. లెనిన్‌వంటి పరమోత్కృష్టుల త్యాగాలతో పునీతమయిన ఏ ఆశయమూ నిరర్థకం కాదు." ("యంగ్ ఇండియా:" 1928 నవంబరు 5).

గాంధీమహాత్ముని అభిప్రాయాలను, నమ్మకాలను దృష్టిలో ఉంచుకొన్నప్పుడు, పై ప్రశంస అల్పవిషయమేమీకాదు.

దీన్నిబట్టి, యుద్ధానంతర దశలో మన జాతీయోద్యమ నాయకులు, జాతీయ కాంగ్రెసు నాయకులు రష్యా విప్లవంయొక్క కార్యక్రమాన్నిగాని, దాని పోరాట రూపాలనుగాని అంగీకరించారని కాదు. ఆ విధమైన ప్రభావం మన స్వాతంత్ర్యోద్యమ నాయకత్వంపై రష్యా విప్లవం కలుగజేయలేదు. కాంగ్రెసు నాయకత్వవు వర్గ స్వభావాన్నిబట్టి, ఇలాజరగడం అసంభవం,

కాని, ప్రధాన విషయమేమంటే, రష్యా విప్లవంపట్ల మన స్వాతంత్ర్యోద్యమ నాయకులు అనుకూలవైఖరి నవలంబించారు. ముఖంగా, రష్యా విప్లవంయొక్క రెండు ప్రధాన విషయాలను వారు మెచ్చుకున్నారు. మొదటిది, జారిస్టు పాలనక్రంద ఉండే పరాధీన జాతులన్నిటికీ

తక్షణమే సంపూర్ణస్వాతంత్ర్య మీయడం. రెండవది, భూస్వాముల భూములను రైతాంగానికి పంచిపెట్టడం.

భారత స్వాతంత్ర్య సాధనకై జరిగే పోరాటంలో రష్యా విప్లవం వ్యతిరేక శక్తి అనిగాని, ప్రమాదకారి అనిగాని మన నాయకు లెన్నడూ భావించియుండలేదు; పైగా దాన్ని అనుకూల శక్తిగా, సహాయకారిగా పరిగణించారు. మనదేశంపై పెత్తనం చెలాయిస్తూ, ఎప్పటికప్పుడు దాన్ని పటిష్టమొనర్చుకొనగోరే బ్రిటిష్ పాలకుల విధానానికీ, రష్యా విప్లవం అనుసరించిన విధానానికీ గల వ్యత్యాసాన్ని వారు గ్రహించారు.

మన దేశంలో కార్మికవర్గంపైన, రైతాంగంపైన రష్యా విప్లవం సహజంగా మరింత ఎక్కువ ప్రభావం కలుగజేసింది. మొత్తం జాతీ యోద్యమాన్ని అది వేగిరపరచింది. ఈ విషయాన్ని గురించి తర్వాత ప్రస్తావిస్తాను.

రష్యా విప్లవం మన జాతీయ నాయకత్వపు ఆశయాలను ప్రోత్స హించడంలో, విస్తృతమొనర్చడంలో ఎలా సహాయపడిందో తెలియ జేయడానికి ఒక ఉదాహరణ యిచ్చి, దానితో యీ అధ్యాయాన్ని ముగి స్తాను.

విప్లవానికిముందు భారతీయ నాయకులు మన జాతీయ వాంఛను "స్వపరిపాలన" అనీ, "బాధ్యతాయుత ప్రభుత్వం" అనీ, "హోంరూల్" అనీ వేర్వేరు పేర్లతో పిలిచేవారు. నిర్దిష్టంగా చెప్పాలంటే, వారు కోరుతూ వచ్చింది భారతీయ ప్రతినిధులకు మరింత అధికారం లభింపజేసే పరి పాలనా సంస్కరణలు. తిలక్, నౌరోజీలు మరో అడుగు ముందుకువేసి "స్వరాజ్యం" కావాలన్నారు. వాస్తవానికి అది అధినివేశ స్వాతంత్ర్యం.

కాని, స్వయం నిర్ణయాధికారం వీటన్నిటికన్న విస్తృతమైనది, ప్రగాఢమైనదీను. ఈ నినాదాన్ని భారత జాతీయ కాంగ్రెసు మొట్ట మొదటిసారిగా 1918 లో ఒక అధికార తీర్మానంలో రూపొందించింది.

1918 డిసెంబరులో పండిత మదన మోహన మాలవ్యా అఖిల భారత కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహిస్తూ, స్వయం నిర్ణయ సూత్రాన్ని నిర్వచించేందుకూ, భారతదేశానికి దాన్నెలా వర్తింప జేయాలో విశదపరచేందుకూ ప్రజల మహాసభ నొకదాన్ని సమావేశపరచాలని తెలియజేశారు.

"ఆ విధంగా భారత ప్రజల ప్రతినిధులు రూపొందించే ప్రతిపాదనలను అంగీకరించడంద్వారా బ్రిటిష్ ప్రభుత్వం స్వయం నిర్ణయ సూత్రాన్ని అమలు జరపాలి," అని ఆయన డిమాండుచేశారు.

భారతదేశానికి స్వయం నిర్ణయాధికారం కోరుతూ ఆ మహాసభ తీర్మానించింది.

# మూడవ అధ్యాయం

# కార్మిక కర్షకులు: రంగస్థలిపై కమ్యూనిజం ప్రవేశం

మనదేశంలో కార్మికవర్గంపైన, రైతాంగంపైన, మొత్తం జాతీయోద్యమ వెల్లువపైన రష్యా విప్లవం కలుగజేసిన ప్రభావం యింతకన్న గొప్పది. మొదటి ప్రపంచయుద్ధం తర్వాత దేశవ్యాపితంగా విజృంభించిన అద్భుతమైన వెల్లువను వర్ణించడం యీ చిన్న పుస్తకంలో సాధ్యం కాదు. దాన్ని గురించి తెలుసుకొనగోరేవారు అనేక భారతీయ గ్రంథాల్లోను, రజనీపామిదత్తు రచించిన "నేటి భారతదేశం," సోవియట్ విజ్ఞాన పరిషత్తువారి "ఆధునిక భారతదేశ చరిత్ర" వంటి విదేశ గ్రంథాల్లోను సమగ్రంగా ఉన్న సమాచారాన్ని చదవవచ్చు.

దీని అర్థం, 1919–22 మధ్య పెల్లుబికిన బ్రహ్మాండమైన జాతీయోద్యమం, వర్గపోరాటాలు రష్యా విప్లవంయొక్క ఫలితాలని కాదు. యుద్ధకాలంలో బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలకులు భారతదేశ ప్రజల్ని విపరీతమైన దోపిడీకి గురిచేయడంవల్లా, యుద్ధం ఫలితంగా ప్రపంచ సామ్రాజ్యవాదం పెద్ద సంక్షోభంలో చిక్కుకోవడంవల్లా, యుద్ధకాలపు అనుభవాలు భారత ప్రజల్లో రేకెత్తించిన నూతన కోర్కెలు, పోరాటపటిమవల్లా యీ వెల్లువ ముంచుకొచ్చింది.

నిజానికి యిది ఒక్క భారతదేశానికే పరిమితం కాలేదు. యూరపు దేశాలన్నిటిలోను యుద్ధం తర్వాత బ్రహ్మాండమైన విప్లవ వెల్లువ కార్మికవర్గంలో పెల్లుబికింది. తూర్పున చైనా లగాయితు ఆఫ్రికా ఖండంలోని మొరాకోవరకు అనేక శతాబ్దాలుగా సామ్రాజ్యవాదులక్రింద పరాధీన

స్థితిలో ఉన్న అనేక ఆసియా - ఆఫ్రికా దేశాల్లో అపూర్వమైన జాతీయ విప్లవోద్యమం పొంగులువారింది. అంతేకాదు. యూరపులోని కార్మికోద్యమం, పరాధీన దేశాల్లోని జాతీయ విప్లవోద్యమం సామ్రాజ్యవాద సంక్షోభమనే మూలంనుంచే ఉద్భవించాయి. అందుచేత అవి సన్నిహిత సంబంధంగల ఉద్యమాలు.

భారతదేశంలో జరిగిన పరిణామాలు ప్రపంచ విప్లవోద్యమ క్రమంలో ఒక భాగం. ఈ క్రమంలో రష్యా విప్లవం నిర్ణయాత్మకమైన పాత్ర వహించింది. ఆ విధంగా అది భారతదేశంలోని ప్రజా ఉద్యమంపై ప్రభావం కలిగించింది.

భారతదేశంలో మొట్టమొదటి యుద్ధానంతర వెల్లువ పంజాబులో ఉబికింది. నిజం చెప్పాలంటే, 1919-22 మధ్య భారతదేశంలో ఎక్కడా విజృంభించనంత ఉధృతంగా పంజాబులో విజృభించింది. ఆనాడు పంజాబులో బ్రిటిష్ సైనికుల అమానుష హింసాకాండ జలియన్వాలాబాగ్ దురంతాలకు మాత్రమే పరిమితంకాలేదు. మొత్తం జిల్లాలకు జిల్లాలు అనేక నెలలవరకు సైనిక శాసనంక్రింద కుమిలిపోయాయి. అనేకసార్లు విమానాలు సివిలియన్ పౌరులపై బాంబులు, మరఫిరంగులు అగ్నివర్షం కురిపించాయి. మొత్తం రాష్ట్రం అక్షరాలా పైశాచిక హింసాకాండకు లోను చేయబడింది. ఆ నాడు సాయుధ తిరుగుబాటుకు సన్నద్ధమైన పంజాబు ప్రజానీకాన్ని బ్రిటిష్ పాలకులు దారుణంగా అణచివేసినట్లు బ్రిటిష్, ఇండియన్ రచయితల భోగట్టాలనుబట్టి తెలుస్తుంది.

విప్లవ వెల్లువ పంజాబులోనే ఎందువల్ల అత్యుచ్ఛస్థాయి నందుకొంది ?

ఇందు కనేక కారణా లున్నాయి. ముఖ్యకారణం, యుద్ధంకాలంలో బ్రిటిష్ ఇండియన్ సైన్యానికి ప్రధానమైన రిక్రూటింగ్ కేంద్రం పంజాబు. లెనిన్ చెప్పినట్లు. సైనికుడు యూనిఫారం ధరించిన రైతు.

సైనికులుగా రిక్రూట్ చేసుకోబడిన పంజాబు రైతులు మొదటి

ప్రపంచయుద్ధంలో ఫ్రాన్స్, మెసపొటేమియా (ప్రస్తుతం ఇరాక్) మొద లైన దూర దేశాల్లో సాహసోపేతంగా పోరాడారు. "శ్వేత జాతి" సైనికులతో కలిసి సమాన హోదాలో పోరాడ్డంవల్ల వారిలో బ్రిటిష్ సైనికులన్నా బ్రిటిష్ సైనికాధికారులన్నా భయం, గౌరవంపోయాయి.

యుద్ధం సమాప్తమైన వెంటనే వేలాది భారతీయ సైనికులు బర్తరఫు చేయబడ్డారు. తిరిగివారు తమ గ్రామాలకు చేరుకునేసరికి తమ కుటుంబాలు, బంధుజనం విపరీతమైన పన్నులభారంతో అధిక దరలతో పడరానిపాట్లుపడుతూండడం చూశారు. యుద్ధం జరుగుతూన్నంతకాలం వారి బాధకులకు అంతులేకుండా పోయింది.

ఆ విధంగా, యుద్ధరంగాలనుంచి కొత్త ఆశలతో, ఆత్మ విశ్వాసంతో తిరిగి వచ్చిన పంజాబు సైనికులు అదివరకే ప్రేలుడు పదార్థంలా వున్న గ్రామసీమల్లో అగ్గిపుల్ల వెలిగించినట్లయింది.

అంతేకాక, పంజాబు ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రమే అయినప్పటికీ, చిన్నచిన్న పరిశ్రమలనేకం ఆ రాష్ట్రమంతటా చెల్లాచెదురుగా ఉండేవి (సాంప్రదాయ సిద్ధంగా పంజాబీలు చక్కని మెకానిక్కులు, నిపుణులైన కార్మికులూను). అనేక రైల్వే వర్క్‌షాపులా రాష్ట్రంలో ఉండేవి. ఇతర రాష్ట్రాలతో పోలిస్తే, పంజాబులో అత్యుత్తమమైన రైలు మార్గాలు వేయబడ్డాయి. ఈ విధంగా, కార్మిక - కర్షకుల మధ్య విప్లవ ఐక్యత రూపొందడంలో పంజాబు ఆనాడు ఆదర్శవంతమైన రాష్ట్రం.

అంతేకాదు. యుద్ధానికిముందు, యుద్ధకాలంలోను విదేశాలకు వలస వెళ్ళిన భారత విప్లవకారుల గ్రూపు లన్నిటిలోను అమెరికాలో స్థాపింపబడిన గదర్ పార్టీకి మాత్రమే స్వదేశంలోని ప్రజలతో విస్తృత సంబంధా లుండేవి. కారణ మేమంటే, ఆ రోజుల్లో మెకానిక్కులుగాను, సకలవిధాలైన పనులు చేయగలవారుగాను తయారైన పంజాబి రైతులు కూడా అనేకమంది అమెరికా, కెనడాలకు వలస వెళ్ళారు. వారిలో చాలమంది విప్లవకారులుగానో, విప్లవోద్యమానికి అభిమానులుగానో మారారు.

వారందరూ సహజంగా గదర్ పార్టీలో చేరడమో, దాన్ని బలపరచడమో చేశారు.

పై కారణాలవల్ల, గదర్ పార్టీకి భారతదేశ సైన్యంలో చక్కని సంబంధా లుండేవి (కార్యకర్తలు సైతం ఉండేవారు).

పై కారణాలవల్లనే, విప్లవమనగా ధనం, ఆయుధాలకు మాత్రమే సంబంధించిన సమస్య కాదన్న అవగాహనకూడా గదర్ పార్టీకి ఏర్పడింది. ప్రజా కార్యక్రమం, ప్రజా విప్లవోద్యమ నిర్మాణానికి సంబంధించిన సమస్య అది. ఈ చైతన్యం గదర్ పార్టీ కుండడంవల్ల అది భారత దేశంలోగాని, విదేశాల్లోగాని ఏర్పడ్డ విప్లవ గ్రూపు లన్నిటికంటె మిన్నగా రాణించినది. ఆ రోజుల్లో భారతదేశంలోని ఏ విప్లవ సంస్థకన్నా అది విప్లవ రైతాంగ ప్రజలు పార్టీగా రూపొందగల అవకాశ మేర్పడింది. భారత కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడ్డ తర్వాత గదర్ పార్టీ అగ్రనాయకు లందరూ అందులో సభ్యులుగా చేరారు,

చివరి విషయ మేమంటే, పంజాబు ఆఫ్ఘనిస్తాన్‌కీ, మధ్య ఆసియాకూ సమీపంలో ఉండడంవల్ల, మధ్య ఆసియాలోని విప్లవాన్ని గురించీ, రష్యా విప్లవాన్ని గురించీ ఉత్తేజకరమైన వార్తలు యితర ప్రాంతాల కన్న పంజాబుకు ఎక్కువగా చేరేవి.

బ్రిటిష్ ఇండియన్ సైన్యానికి చెందిన సైనికు లనేకమంది ఇరాన్‌లో డ్యూటీమీద ఉండేవారు. టర్కిస్తాన్, బొఖారా మొదలైనచోట్ల సోవియట్ మధ్య ఆసియా సేనలమీద దాడిచేసేందుకు బ్రిటిష్ పాలకులు మన సైనికుల్ని ఉపయోగించుకొనేవారు. కాని వారిలో చాలమంది ఎదుటి పక్షంలో చేరిపోయారు. ఆ రోజుల్లో భారతదేశంనుంచి అనేకమంది ముస్లిం ప్రవాసితులుకూడా (వీరు హిజరతీయులని పిలువబడేవారు) టర్కీలోని ఖిలాఫత్ ఉద్యమంలో పాల్గొనేందుకు దేశం విడిచి వెళ్ళారు. కాని, టర్కిస్తాన్ వెళ్ళడానికి బదులు వారు ఆఫ్ఘనిస్తాన్‌నుంచి సోవియట్

మధ్య ఆసియాకు (తాష్కెంట్, సామర్ఖండ్) చేరుకున్నారు. ఆనాడు యూరప్, అమెరికాలలో ఉండే భారతీయ విప్లవకారులుకూడా అనేకమంది గదర్ నాయకులతో సహా, మాస్కోకు, మధ్య ఆసియాకు చేరుకున్నారు.

వీరందరూ కమ్యూనిస్టులుగా మారనిమాట నిజమే. కాని, చాల మంది హిందూకుష్ పర్వతాలమీదుగాను, ఆఫ్ఘనిస్తాన్ మీదుగాను అత్యంత ప్రమాదకరమైన పరిస్థితుల్లో ప్రయాణంచేసి, భారతదేశానికి తిరిగి రాగలిగారు. అదివరకే అసంతృప్తి జ్వాలలు, తిరుగుబాటు తత్వం వ్యాపించియున్న పంజాబు రాష్ట్రానికి వీరు రష్యా విప్లవ సందేశాన్ని తీసుకొచ్చారు.

ఈ విధంగా, 1919-22 మధ్య మొత్తం పంజాబు రాష్ట్రం బ్రిటిష్ ప్రభుత్వంపై తిరుగబడింది. కార్మికులు, రైతులు, వృత్తిపనివారు, పట్టణాల్లోని మధ్య తరగతి యువకులు పోలీసు స్టేషన్లను, పోస్టాఫీసులను, ప్రభుత్వ కేంద్రాలన్నిటిని ముట్టడించారు. ఎవరికి దొరికిన ఆయుధాలతో వారు తిరుగబడ్డారు. రైలుమార్గాలు నెలల తరబడి పనిచేయని స్థితి ఏర్పడింది; అనేక జిల్లాలలో టెలిగ్రాఫ్ మార్గాలు నిర్మూలించబడ్డాయి.

రాష్ట్రమంతా ట్రేడ్ యూనియన్లు (నిజానికివి కార్మికుల పోరాట కమిటీలు), రకరకాలైన రైతు సంఘాలు ఇంద్రజాలం మాదిరిగా పుట్టుకొచ్చాయి,

ఆనాడు పంజాబులో సిసలైన కమ్యూనిస్టుపార్టీ నిర్మింపబడక పోవడం చారిత్రక విపత్తు అని చెప్పవచ్చు. పూర్తి చైతన్యం గల కమ్యూనిస్టు అగ్రగామిదళం లేని లోటు తప్ప, జాతీయ విప్లవోద్యమం విజయవంతమవడానికి కావలసిన పరిస్థితులన్నీ అనాడున్నాయి. కమ్యూనిస్టు చైతన్యం గలవారు ఆనాడు లేకపోలేదు. కాని, ప్రజా వెల్లువను క్రమశిక్షణ గల సామ్రాజ్యవ్యతిరేక, ఫ్యూడల్‌వ్యతిరేక విప్లవ మార్గంలో నడపగల పరిపక్వత వారికప్పుడు లేదు. నిర్మాణం విషయంలోకూడ వారు ఆ కర్తవ్యాన్ని నిర్వర్తించగల సమర్థులు కారు.

యుద్ధానంతర జాతీయ విప్లవ వెల్లువలో పంజాబుయొక్క స్థానం చూచినట్లయితే, రష్యా విప్లవ మిచ్చిన సందేశం, దాని పంథా, దాని అనుభవం విజాతీయమైనవి కావనీ, మన దేశంయొక్క విప్లవ పరిస్థితులు కవి పూర్తిగా సరిపోతాయనీ తెలుసుకోగలం. ఆనాటి పరిస్థితుల ప్రత్యేక లక్షణాల్ని దృష్టిలో ఉంచుకొని, వాటి కనుగుణమైన మార్పులు సహజంగా చేసుకోవలసిందే. యాంత్రికంగా, మక్కికి మక్కీగా రష్యా విప్లవాన్ని అనుకరించే సమస్యే లేదు. ఆనాడు భారతదేశం యీ మార్గ మవలంబించకపోవడానికి కారణం మన దేశ పరిస్థితుల కది సరిపడకపోవడం కాదు; ఆనాటి ప్రత్యేక పరిస్థితుల కనుగుణమైన మార్పులు తీసుకొస్తూనే రష్యా విప్లవంయొక్క ప్రధాన లక్షణాలను అర్థం చేసుకొని అమలు జరపగల నాయకత్వం ఆనాడు దేశంలో లేదు.

బ్రిటిష్ పాలకులు పంజాబులో జరిగిన ఘటనలన్నిటినీ "బోల్షివిక్ కుట్రలు"గాను, "బోల్షివిక్ ప్రమాదం"గాను ముద్రవేశారు; గొంతులు బొంగురుపోయేటట్లు వాటిని ఖండించారు. క్రిందటి అధ్యాయంలో చెప్పినట్లు, "బోల్షివిక్ బూచి"ని చూపి, మన జాతీయ నాయకుల్ని వారు భయపెట్ట చూచారు. భారతదేశంలో రష్యన్ ప్రచారాన్ని నిషేధిస్తూ లార్డు చెమ్స్‌ఫర్డు అనేక ఆర్డినెన్సులు జారీచేశాడు. అంతేకాక, దేశంలో రష్యన్ రూబుల్ నోట్లు సైతం నిషేధింపబడ్డాయి. ఎంత తమాషా యిది!

అయినప్పటికీ, భారత రాజ్యాంగ సంస్కరణలను గురించి దర్యాప్తు చేసేటందుకు నియమింపబడిన బ్రిటిష్ పార్లమెంటరీ కమిషన్ తన రిపోర్టులో, భారత ప్రజానీకానికి రష్యా విప్లవంయొక్క ప్రాధాన్యతను వివేచనతో, నిష్పాక్షికంగా గుర్తించింది. ఆ కమిషన్‌లో సభ్యులు ఆనాడు వైస్రాయిగా ఉన్న లార్డు చెమ్స్‌ఫర్డు, బ్రిటిష్ మంత్రివర్గంలో భారత దేశ వ్యవహారాలు చూచే మిస్టర్ మాంటేగ్యూ. "మాంట్-ఫర్డు కమిషన్" అనే పేరుతో పిలువబడిన ఆ కమిషన్ యొక్క రిపోర్టులో 1919 లో ప్రచురింపబడింది. అందులో యిలా ఉంది:

"రష్యా విప్లవం నిరంకుశ పాలనపై ఒక విజయంగా భారత

దేశంలో భావింపబడింది...భారత రాజకీయ వాంఛకు అది ప్రోత్సాహమిచ్చింది.

"యుద్ధం సమాప్తమయాక, యూరపులోని వివిధ యుద్ధరంగాల నుంచీ, మధ్యప్రాచ్యం నుంచీ తిరిగివచ్చిన సైనికులద్వారా గ్రామీణ ప్రజలు సుదూర రష్యాలో జరిగిన ఘటనలను గురించి విన్నారు. ఉత్తర భారతంలోని అనేక గ్రామాలలో యిలా జరిగింది. ముఖ్యంగా, భారత సైన్యంలో అత్యధికులు ఏ రాష్ట్రంనుంచి రిక్రూట్ చేసుకోబడ్డారో ఆ పంజాబులో జరిగింది సరిగ్గా యిదే. పంజాబీలు యుద్ధంలో పాల్గొన్నారు. అంతేకాదు. టర్కిస్తాన్, ట్రాన్స్‌కాకేషియా, మధ్య ఆసియాలలో జరిగిన సైనిక చర్యల్లోకూడ పాల్గొన్నారు."

కాబట్టి, బ్రిటిష్ పాలకవర్గ ప్రతినిధులే వాస్తవాన్ని అంగీకరించారు. అంతేకాక, మన ప్రజల జాతీయ వాంఛను సంతృప్తిపరచేందుకు కొన్ని రాజ్యాంగ సంస్కరణలీయడం అవసరమని బ్రిటిష్ పాలకులచే గుర్తించేలా చేయడంలో రష్యా విప్లవం ప్రబలమైన పాత్ర వహించినట్లు వారే స్పష్టంగా అంగీకరించారన్నమాట. ఈ విధంగా, రష్యా విప్లవం మనకు పరోక్షంగాకూడ సహాయపడింది.

భారత కార్మికవర్గంపైన, కార్మికోద్యమం పైన రష్యా విప్లవం యొక్క ప్రభావం సహజంగా అపూర్వమైనది. 1918 లో ప్రారంభమైన అసాధారణమైన కార్మిక సమ్మెలు రష్యా విప్లవం జరిగిన కొద్ది మాసాల్లోనే ప్రారంభ మయాయన్న విషయం గమనార్హం.

ఈ మహా వెల్లువ ఒక నగరంనుంచి మరో నగరానికి, ఒక పరిశ్రమనుంచి మరో పరిశ్రమకు, ఒక రాష్ట్రంనుంచి మరో రాష్ట్రానికి దవానంలా వ్యాపించింది. చివరకు, 1920 పూర్వార్ధభాగంలో అది ఎంత ఉచ్ఛస్థాయికి చేరిందంటే, ఆ ఆరు మాసాల్లోనూ జరిగిన 200 సమ్మెలలో 15 లక్షలకు పైగా కార్మికులు పాల్గొన్నారు.

యుద్ధానికి పూర్వంకంటె యుద్ధం తర్వాత జరిగిన సమ్మెలు మరింత పట్టుదలతో, మరింత ఎక్కువకాలం జరిగాయి.

ఈ సమ్మెలలో అధికభాగం పూర్తిగాగాని, పాక్షికంగాగాని విజయవంతమయాయి. కార్మికుల వేతనాలు 100కి 10 నుంచి 30 వరకు పెంచబడ్డాయి.

ఈ సమ్మెల ప్రధాన లక్షణ మేమంటే (ఆనాడు "కేసరి" పత్రిక గుర్తించినట్లు), కార్మికుల్లో వర్గ చైతన్యం, దృఢ సంకల్పం, సంఘీభావం ఆత్మ విశ్వాసం అపారంగా వృద్ధిచెందాయి. ఈ సంఘీభావం ఒకే పరిశ్రమకు చెందిన ఫ్యాక్టరీలకే కాక, మొత్తం పరిశ్రమ లన్నిటికీ, మొత్తం రాష్ట్రా లన్నిటికీ వ్యాపించింది. ఈ దశలో సానుభూతి సమ్మెలు అనేకం జరిగాయి. ఒక పరిశ్రమలో సమ్మెచేసే కార్మికుల పట్ల మరో పరిశ్రమలో పనిచేసే కార్మికులు, ఒక నగరంలో సమ్మెచేసేవారి పట్ల మరో నగరంలోనివారు సానుభూతి సూచకంగా సమ్మెలు జరిపారు.

పంజాబులోనేకాక, యు. పి., బెంగాల్, అస్సాం మొదలైన రాష్ట్రాల్లో కార్మిక సమ్మెలు, వాటి పొరుగున రైతు ఉద్యమాలు ఒకే పోరాటంలో రెండు భాగాలుగా కొనసాగాయి. వాటి లక్ష్యం, దుర్భరమైన జీవన పరిస్థితుల్ని మెరుగు పరచుకోవడం, "స్వరాజ్యం" సాధించడమూను.

ఈ విధంగా, రాజకీయ కోర్కెలు కూడ యీ సమ్మె వెల్లువలో ముంచుకొచ్చాయి. ఒక్కొక్కప్పుడు అవి ఆర్థిక కోర్కెల తర్వాత, మరొకప్పుడు ఆర్థిక కోర్కెలతోబాటు ముందుకొచ్చేవి, ముఖ్యంగా, రైల్వేలలోను, ప్లాంటేషన్లలోను తరుచుగా యిది కనిపిస్తుంది. ఈ రైల్వేలు, ప్లాంటేషన్లు బ్రిటిష్‌వారి యాజమాన్యంక్రింద ఉండేవి; బ్రిటిష్ ఉద్యోగులు వీటిని నడిపేవారు.

ఈ ఉద్యమం చైతన్యం విషయంలోను, పోరాట పటిమలోను, అంతకంతకు వృద్ధిచెందేకొద్దీ (ముఖ్యంగా బొంబాయి, కలకత్తా, అహ

మ్మదాబాద్ మొదలైన పారిశ్రామిక కేంద్రాల్లో), కార్మికులు తరచు కేవల రాజకీయ నిరసన సమ్మెలే జరపడం, రోజుల తరబడి పోలీసులతో ప్రత్యక్ష పోరాటాలు జరపడం కనిపిస్తుంది; (ఇట్టి కేంద్రాల్లో కార్మికులు అంతకు పూర్వమే రాజకీయంగా ముందుకొచ్చారు). ఒక్కొక్కప్పుడు వారు బ్యారికేడ్లను కూడా నిర్మించి పోరాడేవారు. ఆ రోజుల్లో అత్యంత దృఢసంకల్పంతో జరిగిన సార్వత్రిక రాజకీయ సమ్మె 1921 చివరి భాగంలో జరిగింది. మన జాతీయోద్యమానికి అవమానకరంగా బ్రిటన్ నుంచి ఓడదిగిన వేల్స్ యువరాజు రాకను నిరసిస్తూ బొంబాయి బట్టల మిల్లు కార్మికులు బ్రహ్మాండమైన సార్వత్రిక సమ్మె జరిపారు.

భారత కార్మికోద్యమంలో కొన్ని నినాదాలు, పరిణామాలు ఎప్పుడు ఉత్పన్నమయాయో ఖచ్చితమైన తేదీలు చెప్పలేం. కాని, ఒకటి మాత్రం స్పష్టం. రష్యా విప్లవం తర్వాత భారతదేశ కార్మికులు ప్రపంచ కార్మికోద్యమ పతాకమైన ఎర్ర జండాను తమ జండాగా స్వీకరించారు.

ఇలాగే. "ప్రపంచ కార్మికులారా, ఏకంకండి!" "సామ్రాజ్య వాదం నశించుగాక!" వంటి ప్రధాన నినాదాలు కూడా రష్యా విప్లవం విజయాన్ని సాధించిన వెంటనే మనదేశంలో వినిపించాయి. "రష్యా విప్లవం వర్ధిల్లుగాక!" "సోవియట్ ప్రభుత్వం వర్ధిల్లుగాక!" అనే నినాదాలు ఆ దశలోనే విస్తృతంగా వ్యాప్తిచెందాయి. 1925 తర్వాత యీ నినాదాలు మరింతగా వ్యాప్తిచెందాయి.

దేశంలో బలీయమైన, సుస్థిరమైన ట్రేడ్ యూనియన్ ఉద్యమం యుద్ధానంతరం కార్మిక వెల్లువనుంచే ఉత్పన్న మయిందనడంలో ఎట్టి సందేహం లేదు. 1920 నాటికి సంఘటిత ట్రేడ్ యూనియన్ల సభ్యత్వం 5 లక్షలు దాటింది.

1920 లో అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు స్థాపింపబడింది. ఆనాటి పరిస్థితుల్లో, జాతీయోద్యమంలోని అతివాదులే (వీరు తీవ్రతర వాదులని ఆనాడు పిలువబడేవారు) మొట్టమొదటి కార్మికోద్యమం పట్ల శ్రద్ధతీసుకోడం, దాన్ని నిర్మించడానికి ముందుకురావడం సహజమూ

అనివార్యమూను. అంతేకాక, గొప్ప సామ్రాజ్య వ్యతిరేక శక్తిగా కార్మికోద్యమం బలీయమైనదనీ, జాతీయ నాయకుల కంట్రోలునుంచి అది తప్పించుకొని బయటపడే "ప్రమాదం" కూడా ఉందనీ అభిప్రాయ పడ్డవారు కొందరుండేవారు,

భారత కార్మికోద్యమానికి రష్యా విప్లవం చేసిన అత్యద్భుతమైన సహాయమేమంటే, దాని కొక అంతిమ లక్ష్యాన్ని చూపెట్టింది. కార్మికోద్యమంయొక్క అంతిమ లక్ష్యం పెట్టుబడిదారీ విధానాన్ని — విదేశీ, స్వదేశీ— కూలద్రోసి కార్మికవర్గ అధికారాన్ని స్థాపించడమనే అవగాహనను అది కలిగించింది. ఈ లక్ష్యాన్ని చేయకోగల శక్తి తమ కుందనీ, సప్లై — డిమాండు అనే పైశాచిక పెట్టుబడిదారీ సూత్రానికి తాము శాశ్వత బానిసలుగా ఉండవలసిన అవసరం లేదనీ గ్రహించేటట్లు అది చేసింది. ఆ విధంగా మన కార్మికుల్లో ఆత్మవిశ్వాసం కలిగించింది.

ఈ నూతన చైతన్యం అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు యొక్క మొదటి సమావేశంలోనే ద్యోతక మయింది. ఆ సమావేశానికి అధ్యక్షత వహించింది లాలాలజపతిరాయి. పంజాబులో ఆయన అతివాద జాతీయ నాయకుడుగా ప్రఖ్యాతిచెందారు. అంతకు ముందు అమెరికాలో ఆయన చాల సంవత్సరాలు ప్రవాసజీవితం గడిపారు. విదేశాల్లోని కార్మికోద్యమంతోను, సోషలిస్టు ఉద్యమంతోను సన్నిహిత సంబంధం కలిగి యుండేవారు.

లజపతిరాయి అధ్యక్షోపన్యాసనుంచి కొన్ని భాగాలను యిక్కడ పేర్కొనడం సముచితం.

"సామ్రాజ్యవాదం, సైనికతత్వం, పెట్టుబడిదారీ విధానంయొక్క కవల బిడ్డలు. అవి మూడింటిలో ఒకటీ, ఒకటిలో మూడూను. వారికి విరుగుడు యీ మధ్యనే కనిపెట్టబడింది. అది సంఘటిత కార్మికోద్యమం.

"ప్రపంచంలోని కార్మికులందరి లక్ష్యం ఒకటేననీ, ఆసియా కార్మికులు సంఘటితులై అంతర్జాతీయంగా అనుబంధింపబడకపోతే

మోక్షంలేదనీ యూరప్, అమెరికాలలోని కార్మికులు యీ మధ్యనే కని పెట్టారు.

"కాబట్టి, యీ రోజున మనం ప్రారంభిస్తూన్న ఉద్యమం జాతీయ ప్రాముఖ్యం గలది మాత్రమే కాదు. దానికి అంతర్జాతీయ ప్రాముఖ్యత ఉంది. భారతదేశ కార్మికులు తమ ప్రయోజనాల్ని దృఢ పరచుకోడానికేగాక, అంతర్జాతీయ సౌహార్దత అనే గొలుసులో ఒక లింకును తయారు చేయడానికి కూడా చేతులు కలుపుతున్నారు."

తర్వాత, కార్మికులు ఓటుహక్కు సంపాదించవలసిన అవసరాన్ని లజపతిరాయి తెలియజేశారు. ఆ హక్కు సంపాదించిన తర్వాత "మీవర్గా నికి చెందిన అభ్యర్థులకే, లేదా మీ శ్రేయస్సుకై కృషిచేయడానికి ప్రతిజ్ఞ తీసుకొన్నవారికే" ఓటు చేయవలసిందని విజ్ఞప్తి చేశారు.

ఆ తర్వాత, కార్మిలు తమ ఆర్థిక-రాజకీయ కోర్కెలను సాధించు కోడానికి సమ్మె ఎంత బలమైన ఆయుధమో తెలియజేస్తూ తన ఉపన్యా సాన్ని యిలా కొనసాగించారు :

"యూరపియన్ కార్మికులు మరో ఆయుధాన్ని కనుగొన్నారు. అదే ప్రత్యక్ష కార్యాచరణ. రష్యన్ కార్మిలు యింకొక అడుగు ముందుకు వేసి, శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించ తలపెట్టారు...

"మన దేశంలో కార్మిలు అనేక శృంఖలాలను భేదించుకోవలసి యుంది. అందుకు వ్యవధి కావాలి; శక్తి కావాలి; కృషి కావాలి; నిర్మాణం, క్రమశిక్షణ, ఆత్మనిగ్రహం కావాలి. అయితే, ఆ శృంఖలాలన్నిటినీ ఛేదించుకోకపోతే వారు స్వేచ్ఛ ననుభవించలేరు."

ఆ రోజుల్లో సోవియట్ యూనియన్‌గురించి భారతదేశానికి సరా సరి సమాచారం అందేదికాదు; బ్రిటిషు పాలకులు ముమ్మరంగా సోవి యట్ వ్యతిరేక ప్రచారం సాగించేవారు. అటి పరిస్థితుల్లో అత్యుత్తము లైన జాతీయవాదులుకూడా గందరగోళంలో పడేవారు. అయినప్పటికీ లజపతిరాయి "పెట్టుబడిదార్లు, ప్రభుత్వం రష్యాను గురించి చెప్పే వాస్త

వాన్ని" తాను ప్రయుంగడలుచుకోలేదనీ ఖరాఖండీగా తెలియజేశారు. ఆయ నిలా అన్నారు :

"ఎప్పటికైనా సోషలిస్టు సత్యం." బోల్షివిక్ సత్యమైనాసరే, పెట్టు బడిదారీ సత్యంకన్న ఉత్తమమనీ, మానవీయమనీ నా యూరపు, అమెరి కాల అనుభవంనుంచి తెలుసుకున్నాను."

ఉపన్యాసాంతంలో లజపతిరాయి యూరపియన్ కార్మికుల్ని యిలా ఉద్బోధించారు :

"ఇండియా. చైనాలలో చౌక కూలీ యున్నంతకాలం యూరపి యన్ కార్మికులకు భద్రత ఉండదు."

అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుయొక్క ప్రారంభ సమావేశం ఒక కార్యక్రమాన్ని ఆమోదించింది. వేతనాలు, పని గంటలు జీవన పరిస్థితులు వీటికి సంబంధించిన కోర్కెలతోబాటు. "యితర దేశాల ట్రేడ్ యూనియన్ల, కార్మికోద్యమాల మధ్య ఒక వారధిగా" ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు పనిచేస్తుందని ఆ కార్యక్రమం తెలియజేసింది.

ఈసందర్భంలో జ్ఞాపకముంచుకోవలసిన ప్రధానఘటన ఒకటుంది. చాలకాలంనుంచి కాంగ్రెసువాదిగా ఉంటూ, ఆ నాడు మద్రాసు ట్రేడ్ యూనియన్ నాయకుల్లో అగ్రగణ్యుడయిన శ్రీ సింగారవేలు చెట్టియార్ అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు స్థాపింపబడే సమయంలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభకు అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు తన ప్రతినిధుల్ని పంపాలనేది ఆ తీర్మానం. కాని, ఆ తీర్మానం ఆమోదింపబడలేదు. ఇది అర్థంచేసుకో గల విషయమే.

అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు రెండవ సమావేశం 1922 లో ఝరియాలో జరిగింది. ఆ యేడు రష్యా ప్రజలు దారుణమైన కరువుకు గురి అయారు. వారికి సహాయం చేసేందుకు భారత కార్మికు లందరూ ఒక నిధి వసూలుచేసి పంపాలని ఆ సమావేశం విజ్ఞప్తిచేసింది.

భారతదేశంలో సంఘటిత కార్మికోద్యమాల ప్రారంభమైనప్పటినుంచీ, గొప్ప దేశవ్యాపితశక్తిగా అది తయారయేందుకు ముందడుగువేసిన క్షణం నుంచీ దానిపై రష్యా విప్లవం ఎంత గొప్ప ప్రభావం కలిగించిందో పై విషయాలనుబట్టి తెలుసుకోవచ్చు.

నిజం చెప్పాలంటే, యుద్ధానంతరం భారతదేశంలో పెల్లుబికిన కార్మిక - కర్షక వెల్లువ మన జాతీయ స్వాతంత్రోద్యమంతో సన్నిహిత సంబంధాన్ని కలిగి యుండడంలో ఆశ్చర్యంలేదు; అది అత్యంత సహజ మైన, అనివార్యమైన పరిణామం.

దీని అర్థమేమంటే, భారత ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులైన కార్మికుల్ని, రైతుల్ని సమీకరించనిదే, మన స్వాతంత్ర్యోద్యమం బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని శక్తివంతంగా ఎదుర్కొన గలిగేదికాదు. అదే సమయంలో, కార్మిక కర్షక ప్రజానీకం ఒకసారి జాతీయోద్యమంలో ప్రవేశించగానే, తమ వర్గ వాంఛలను, ఆశయాలను కూడా అందులో ప్రవేశపెట్టారు. బ్రిటిషు పాలననుంచి స్వాతంత్ర్యం పొందాలనే ఆశయాన్ని విదేశీ, స్వదేశీ దోపిడీనుంచి తాము సాంఘికంగాను, ఆర్థికంగాను విముక్తి చెందాలనే ఆశయంతో జోడించారు. ఇదికూడా అతి సహజమైన పరిణామమే.

ఆనాటి కార్మిక — కర్షక పోరాటాలను కాంగ్రెసు నాయకత్వం భారత స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా — ప్రధాన భాగమనేమాట అలా ఉంచి — గుర్తించడమనేమాట నిజమే. ముఖ్యంగా, గాంధిజీ లక్షలాది ప్రజల్ని సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనమనీ, జైళ్ళను, లాఠీలను, తుపాకులను లెక్కజేయకుండా పోరాడమనీ ఉత్తేజపరుస్తున్న సమయంలో కార్మిక — కర్షకుల పోరాటాలను ఆయన ఖండించారు; అవి సర్వనాశనానికి దారితీస్తాయని నిరసించారు.

కాని. వాస్తవ మేమంటే, ఆదంతా ఒకే ఒక వెల్లువ. గాంధిజీ నడిపిన సహాయనిరాకరణోద్యమం, కార్మికుల సమ్మెలు, రైతుల పోరాటాలు యివన్నీ మన జాతీయ స్వాతంత్ర్య సమరంలో భాగాలు. వాటి

మూలకారణాలు ఒకటే. ఒకే చారిత్రక క్రమంలో అవి వేర్వేరు భాగాలు.

కాంగ్రెసు నాయకత్వపు అంతిమ ఆశయాలకూ, శ్రామిక ప్రజల అంతిమ ఆశయాలకూ వైరుధ్యం ఉన్నమాట నిజమే. ఆనాడు అవి నిర్దిష్టంగాను, క్రమబద్ధంగాను రూపొందింపబడలేదు. ఇలాగే, పోరాట రూపాల, పద్ధతుల విషయంలోకూడ వైరుధ్యం ఉండేది.

ఈ విషయాన్ని గాంధీజీ దాచిపెట్టలేదు. సహాయనిరాకరణ, సత్యాగ్రహం అనే పద్ధతులకూ, కార్మికుల రాజకీయ సమ్మెలు, రైతాంగ తిరుగుబాట్లు అనే పద్ధతులకూ పొత్తుకుదరదని ఆయన ఎల్లప్పుడూ చెబుతూనే వచ్చారు. సాధారణంగా ఆయన యీ వ్యత్యాసాన్ని హింసాయుత మార్గానికీ అహింసాత్మక మార్గానికీ మధ్య వ్యత్యాసంగా చిత్రించేవారు. కాని, అదొక్కటే వ్యత్యాసం కాదని గాంధీజీకి తెలుసు. ఇందు కనేక ఉదాహరణ లున్నాయి.

ప్రజా సామాన్యం, బ్రిటిషు పాలకుల ఆర్థిక, రాజకీయ ఆధికారాన్ని సమూలంగా పెకలించివేసి, దేశంలోని ఫ్యూడల్ — పెట్టుబడిదారీ దోపిడీని రూపుమాపాలని వాంఛించారు. కాని, గాంధీజీ స్వాతంత్ర్యం కొరకు పోరాడుతూనే, "దరిద్ర నారాయణుని" ఆర్థిక — సాంఘిక స్థితి గతులను మెరుగుపరచాలని తహతహలాడుతూనే, "హృదయపరివర్తన" "ధర్మకర్తృత్వం" అనే సిద్ధాంతం ఆధారంపై బ్రిటిషు పాలకులతోను, దేశంలోని స్వార్థపరవర్గాలతోను రాజీ పడాలనుకున్నారు.

1947 లో స్వాతంత్ర్యం సిద్ధించే వరకు గాంధీజీ మొత్తం జాతీయోద్యమాన్ని తన ఆశయాల, మార్గాల పరిధిలోనే ఉంచగలిగారని మనం అంగీకరించాలి.

కాని, మరో విషయాన్ని కూడా అంగీకరించాలి. మౌలికంగా సాధ్యంకాని పనిని ఆయన చేబట్టారు. కార్మిక - కర్షక ప్రజానీకాన్ని ఒకసారి సామ్రాజ్య వ్యతిరేక స్వాతంత్ర్యోద్యమంలో సమీకరించిన

తర్వాత, వారిని శాశ్వతంగా బూర్జువా జాతీయ స్వాతంత్ర్య లక్ష్య పరిధుల్లో బంధించియుంచడం సాధ్యంకాదు. సామ్రాజ్యవాదంతోను, దేశంలోని ఫ్యూడల్ వర్గాలతోను చేసుకొనే రకరకాలైన రాజీలకు వారు సమ్మతించరు. పదేపదే వారు యీ పరిధుల్ని ఛేదించుకొని తీరుతారు. కాలం గడిచేకొద్దీ, చైతన్యం వృద్ధిచెందేకొద్దీ, నిర్మాణపటుత్వం పెరిగేకొద్దీ, విజయాలు లభించేకొద్దీ వారీమార్గం అవలంబించి తీరుతారు.

నిజానికి యీ పరిణామం మొట్టమొదటిసారిగా దేశవ్యాపితవెల్లువ ప్రారంభమైనప్పటినుంచీ, అంటే మొదటి ప్రపంచయుద్ధం తర్వాత, ద్యోతకమయింది. తర్వాత విజృంభించిన పోరాటాల్లో, ముఖ్యంగా ఉద్యమంపై తన కంట్రోలు తప్పిపోతుందనే భయంతో అకస్మాత్తుగా ఆయన దాన్ని ఉప సంహరించినప్పుడల్లా, యిది ద్యోతకమయింది. ప్రస్తుతం, 1967 సాధారణ ఎన్నికల తర్వాత, స్వాతంత్ర్యం లభించిన 20 సంవత్సరాల అనంతరం, యీ పరిణామం అతి తీవ్రరూపంలో ఉచ్ఛస్థాయి నందుకొంది. ఇటీవలికాలంలో, అమెరికన్ సామ్రాజ్యవాదులు మనదేశ ఆర్థిక వ్యవస్థలోను, రాజకీయ వ్యవహారాల్లోను ప్రవేశించడం ఎక్కువయాక, పరిస్థితి మరింత గందరగోళంగా తయారయింది. ఫలితమేమంటే, భారత ప్రజలు స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనేందుకూ, తమ సామాజిక విముక్తిని సాధించుకొనేందుకూ కూడా పోరాడవలసిన అవసరం ఏర్పడింది.

---

మొత్తం పరిస్థితులు పై విధంగా పరివర్తన చెందుతూన్నప్పుడు కమ్యూనిజం - అనగా మార్క్సిజం తెనినిజం, భారతకమ్యూనిస్టుపార్టీ - మన స్వాతంత్ర్యోద్యమ రంగస్థలిపై ప్రవేశించింది.

క్లుప్తంగా చెప్పాలంటే, భారత రాజకీయాల్లో కమ్యూనిజం, కమ్యూనిస్టుపార్టీ ప్రవేశించడం యీ క్రింది పరిణామాల ఫలితం: (1) మొదటి ప్రపంచయుద్ధం తర్వాత మన దేశంలో జాతీయ స్వాతంత్ర్యోద్యమం మరింత విస్తృతమయింది; మరింత ప్రగాఢమయింది. (2) దానితో కార్మిక — కర్షకుల పోరాటల వెల్లువ పెనవేసుకుపోయింది. (3) కాంగ్రెసు

నాయకత్వం ఒకవైపు జాతీయోద్యమాన్ని తీవ్రతరం చేస్తూనే, మరో వైపు దాన్ని బూర్జువా లక్ష్యాల, పద్ధతుల పరిధిలో అట్టేపెడుతూవచ్చింది. (4) మన స్వాతంత్ర్యోద్యమంపై రష్యా విప్లవం ఎంతో ప్రభావం కలుగజేసింది.

భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ ఒక విజాతీయశక్తిగా, జాతీయ వ్యతిరేకశక్తిగా ఉద్భవించలేదనీ, పైగా జాతీయ స్వాతంత్ర్య పోరాటాన్ని మరింత తీవ్రమొనర్చే శక్తిగా, మరింత విప్లవాత్మకమొనర్చే శక్తిగా అది ఉద్భవించిందనీ, కోట్లాది శ్రామిక ప్రజల్ని సాంఘికంగా కూడ విముక్తిచేసేటట్లు ఆ ఉద్యమాన్ని ముందుకు తీసుకొనిపోవడమే దాని లక్ష్యమనీ రుజువు చేసేందుకు అనేక చారిత్రక ఆధారాలున్నాయి.

రష్యా విప్లవం తర్వాత, యూరపులోని, అమెరికాలోని భారత విప్లవకారులు చాలమంది మాస్కోతో సంబంధాలు పెట్టుకున్నారని పైన చెప్పాను. వారు, రాజా మహేంద్రప్రతాప్, ఆయన అనుచరులు; బెర్లిన్‌లో వీరేంద్రనాథ చటోపాధ్యాయ నాయకత్వాన ఉన్న భారతీయ కమిటీ; హరదయాళ్ నాయకత్వంక్రింద నున్న గదర్ పార్టీ. వీరిలో అధిక సంఖ్యాకులు స్వయంగా మాస్కోకు వెళ్ళి, అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ నాయకుల్ని కలుసుకున్నారు. లెనిన్‌తో సహా. ఎం. ఎన్. రాయ్ మెక్సికోనుంచి మాస్కోకు 1920 లో చేరుకున్నారు.

వీరిలో రాయ్ తప్ప మిగతా వారెవరూ మాస్కోకు వెళ్ళకముందు కమ్యూనిస్టులు కారు. భారతదేశాన్ని బ్రిటిష్ శృంఖలాలనుంచి విముక్తి. చేసేందుకు సహాయ మర్థించవచ్చిన తీవ్ర జాతీయవాదులు, వారంతా బోల్షివిక్కులనుంచి సహాయం లభిస్తుందని వారు విశ్వసించారు. ఎందు చేతనంటే, బోల్షివిక్కులు అదివరకే సకలజాతులకు స్వయం నిర్ణయాధికార మిచ్చారు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడే పరాధీన దేశాల స్వాతంత్ర్యోద్యమాలకు వారు సమస్త సహాయం చేస్తారనడానికి అనేక ఆధారాలున్నాయి.

సోవియట్ యూనియన్‌లో వారు ఆశాభంగం పొందలేదు. భారత స్వాతంత్ర్య సాధనకై ఎలాంటి సహాయాన్ని తాము ఉపయోగించుకోగల మని వారనుకున్నారో అలాంటి సహాయమంతా లెనిన్ వారికిచ్చాడు.

విప్లవమంటే ధన సమీకరణ, ఆయుధాలు మాత్రమే కాదనికూడా రష్యన్ నాయకులు యీ ప్రతినిధి వర్గాలకు విశద పరచారు. ఇది సహజం, సరియైనదీను. నిజం చెప్పాలంటే, ప్రజల్ని కార్యరంగంలోకి దింపక పోతే ధనం, ఆయుధాలు నిష్ప్రయోజనం. భారత స్వాతంత్ర్య సాధనకు అత్యంత ఉపయుక్తమైన కార్యక్రమం, విధానం, పద్ధతులు ఏవి అనే విషయంపై మాస్కోలో ఎడతెగని చర్చలు జరిగాయి. శాస్త్రీయ పరి భాషలో చెప్పాలంటే, భారతదేశంలో అమలు జరపవలసిన సామ్రాజ్య వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక జాతీయ ప్రజాతంత్ర విప్లవంయొక్క కర్తవ్యాలకు నిర్దేశించే కార్యక్రమం, పాలసీలు అవి.

ఈ పరిణామాల ఫలితంగా, భారతీయుల్లో కొందరు కమ్యూనిస్టు లయారు; మిగతావారు తమ పాత ఆలోచనలను విడనాడలేనందున వారు కమ్యూనిస్టులుగా మారలేదు. అలా కమ్యూనిజాన్ని స్వీకరించిన వారూ, మధ్య ఆసియాకు చేరుకున్న హిజరతీయుల్లో కొందరూ కలిసి 1920 లో భారత కమ్యూనిస్టుపార్టీ స్థాపనకు మొదటి ప్రయత్నం చేశారు.

ఇది యీలా వుండగా, భారతదేశంలో కూడ యిలాంటి పరిణా మమే, యింతకన్న సుసంపన్నమైనది, జరిగింది. ఎందుచేత సుసంపన్న మైనదంటే, భారతదేశంలో కమ్యూనిజాన్ని స్వీకరించినవారు వేగంగా మారుతూన్న పరిస్థితులతో దగ్గర సంబంధ ముంచుకున్నారు. కాని, ప్రవా సితుల్లో అధిక సంఖ్యాకులు చాలకాలం భారతదేశం వెలుపల ఉన్నందున, కొత్త పరిణామాలతో వారికి సంబంధం లేకపోయింది. వారు దేశం విడిచి వెళ్ళేనాటికి అలాంటి పరిణామాలు జరుగుతాయని కలలోకూడా ఊహించి యుండరు.

జాతీయోద్యమం అనుభవం, కార్మిక-కర్షక వెల్లువ, రష్యా విప్లవ ప్రభావం, చౌరీ చౌరా ఉదంతం తర్వాత గాంధీజీ 1922లో అకస్మాత్తుగా

సహాయ నిరాకరణోద్యమాన్ని ఉపసంహరించడం (చౌరీ చౌరాలో పోలీసుల కవ్వింపు చర్యవల్ల కోపోద్రిక్తులైన ప్రజలు పోలీసు స్టేషన్‌పై దాడి చేసి ఒక పోలీసు కానిస్టేబుల్‌ను సజీవదహనం చేశారు) - యీ ఘటనలన్నీ యువక జాతీయవాదుల్లో కొందరిని కమ్యూనిజంవైపు మరల్చాయి, వారినుంచే డాంగే, ముజఫర్ అహమ్మద్, ఘాటే మొదలైనవారు 1925లో భారత కమ్యూనిస్టు పార్టీని స్థాపించారు.

కామ్రేడ్ డాంగే వ్రాసిన "గాంధీ X లెనిన్" అనే కరపత్రాన్నీ (ఇది 1921 లో ప్రచురించబడింది), ఆయన సంపాదకత్వం క్రిందనే 1922 లో వెలువడిన "సోషలిస్టు" అనే వారపత్రిక సంచికలనూ చదువుతూంటే, విప్లవకారుడైన ఒక యువక జాతీయవాది హృదయం గాంధీవాదంనుంచీ, జాతీయ వాదంనుంచీ మార్క్సిజం వైపు మరలుతూన్నప్పుడు పడే ఆరాటం మనకు కనిపిస్తుంది. గాంధీజీ అనుచరుడుగా ఉన్నప్పు డాయనకుండే అభిప్రాయాలు యీ రచనల్లో పూర్తిగా విసర్జింపబడలేదు. రెండో వైపు, విప్లవానికి సంబంధించిన కొత్త సిద్ధాంతాన్ని ఆయన సమగ్రంగా జీర్ణించుకున్నట్లూ లేదు. కాని, ఆ రచనలు యిప్పటికీ విలువగలవే. ఎందుచేతంటే, డాంగేతోబాటు ఆనాడు యువక జాతీయవాదులు గాంధీ వాదంనుంచి లెనినిజానికి ఎలా పరివర్తన చెందారో వాటిలో మనకు తెలుస్తుంది.

బ్రిటిష్ పాలకులచే అనేక యాతనలకు, కారాగార శిక్షలకు గురి చేయబడ్డం మాట అలా ఉంచి (ఇవి ఆనాడు దుర్భరమైన కష్టాలేమీ కావు), 1920 ప్రాంతంలో జాతీయవాదం నుంచి కమ్యూనిజం వైపు వచ్చిన భారతీయ యువకుల ప్రయాణం సులభమైనదేమీ కాదు. తమ పాత భావాలను. నమ్మకాలను, స్నేహాలను, భక్తి ప్రపత్తులను - రాజకీయ, సిద్ధాంత, వ్యక్తిగతమైనవి-విడనాడవలసి వచ్చింది; వాటి స్థానే కొత్త విశ్వాసాలను ఏర్పరచుకోవలసియుంది. ఇది అన్నిటికంటె కష్టమైన విషయం. ఒకవైపు, శాస్త్రీయమైన నూతన సిద్ధాంతాన్ని కనుగొన్నందుకు సంతోషం. మరోవైపు, నిన్న మొన్నటిదాకా పరమసత్యం

అని గాఢంగా నమ్మిన వాటిని విసర్జిస్తున్నందుకు బాధ, ఈ విధంగా సంతృప్తి, బాధ ఆనాటి యువకుల హృదయాల్లో పెనవేసుకున్నాయి. 1925 లో భారత కమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడేనాటికి ఈ యువక కమ్యూనిస్టులు ఒక ప్రధాన నిర్ధారణకు వచ్చారు. అదేమంటే : భారత జాతీయ కాంగ్రెసుయొక్క కార్యకలాపాల్లోనూ, అది నడిపే స్వాతంత్ర్యోద్యమం లోను పాల్గొంటూనే, దాని కార్యక్రమాన్నీ, పాలసీలనూ. అది నడిపే పోరాటాలనూ తీవ్రతర మొనర్చడానికి కృషి చేయడం ఎంతో అవసరం; యిందుకై కార్మిక - కర్షకుల హక్కులకై పోరాడే స్వతంత్ర సంస్థలను నిర్మించాలి; వారి స్వతంత్ర పోరాటాలను ఆర్గనైజ్ చేయాలి; మార్క్సిజం-లెనినిజం అనే విప్లవ సిద్ధాంతం ఆధారంపై కార్మికవర్గ పార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీని ఆర్గనైజ్ చేయాలి. ఈ కార్యకలాపాల ప్రధాన లక్ష్యం, జాతీయ స్వాతంత్ర్యోద్యమం విజయాన్ని సాధించేటట్లు సోషలిజం వైపు అది పురోగమించేటట్లు చేయడానికి కార్మికవర్గంయొక్క నాయకత్వ పాత్రను అభివృద్ధి చేయడం.

కాంగ్రెసు నడిపే స్వాతంత్ర్యోద్యమం పట్ల భారత కమ్యూనిస్టులు (దేశంలోనూ బయటనూ ఉన్నవారు) ప్రారంభ దినాల్లో ఎట్టి వైఖరి నవలంబించారో, దాన్ని తీవ్రతర మొనర్చే కర్తవ్యాన్నెలా నిర్వర్తించారో తెలియజేయడానికి చక్కని ఉదాహరణ లిచ్చి యీ అధ్యాయాన్ని ముగిస్తాను.

1921 చివరి రోజుల్లో జాతీయ కాంగ్రెసు వార్షిక మహాసభ అహమ్మదాబాదులో జరిగింది. స్వరాజ్య సాధనకై ఆ మహాసభ రాజీలేని ప్రజా పోరాటానికి పిలుపు యిస్తుందని అందరూ ఎదురు చూస్తున్నారు. ఆ మహా సభకు భారత కమ్యూనిస్టు పార్టీ యీ విధంగా విజ్ఞప్తి చేసింది :

"భారతదేశాన్ని పునాదులంటా కదిలించివేస్తున్న యీ విప్లవాన్ని కాంగ్రెసు నడపదలచుకొంటే, కేవలం ప్రదర్శనతో, ఒళ్ళు తెలియని ఆవేశంతో సంతృప్తి చెందకూడదు. ట్రేడ్ యూనియన్ల కోర్కెలను తన కోర్కెలుగా, రైతు సంఘాల కార్యక్రమాన్ని తన కార్యక్రమంగా

అది రూపొందించాలి. అలా చేస్తే, ఎన్ని ఆటంకాలు ఎదురైనా కాంగ్రెసు ఆగకుండా ముందుకు సాగిపోతుంది. యావన్మంది ప్రజలు చైతన్య యుతంగా తమ ప్రయోజనాలకై పోరాడుతూ, అప్రతిహతమైన తమ శక్తితో దాన్ని బలపరుస్తారు."

ఈ విజ్ఞప్తిని అహమ్మదాబాదు కాంగ్రెసు అంగీకరించలేదు. 1922 లో శాసనోల్లంఘ నోద్యమం విరమింపబడింది. ఆ విజ్ఞప్తి ఆనాడు అంగీకరింపబడియుంటే, మన స్వాతంత్ర్యోద్యమం 1922 లో ఓడిపోయి ఉండేది కాదనీ, నిరాశా నిస్పృహలు వ్యాపించియుండేవి కావనీ కనీసం యిన్ని సంవత్సరాలుగ గడచిన తర్వాతైనా అంగీకరించాలి.

1922 చివరి రోజుల్లో కాంగ్రెసు మహాసభ గయలో జరుగు తూండగా, భారత కమ్యూనిస్టుపార్టీ ఒక విజ్ఞప్తిరూపంలో కార్యక్రమా న్నొకదాన్ని సమర్పించింది. అందులో యీ క్రింది కోర్కెలు రూపొం దింప బడ్డాయి :

సంపూర్ణ జాతీయ స్వాతంత్ర్యం; సార్వత్రిక ఓటింగు హక్కు; భూస్వామ్య విధానపురద్దు; ప్రజోపయోగ సర్వీసులు జాతీయకరణ; కార్మి కులు సంఘాలుగా ఏర్పడే హక్కు; అన్ని పరిశ్రమల్లోని కార్మికులకు కనీసవేతనం; 8 గంటల పని దినం; లాభాల్లో కార్మికులకు వాటా; నిర్బం ధోచిత విద్య; స్వాతంత్ర్య పరిరక్షణకై యావన్మంది ప్రజలకు ఆయుధా లీయడం."

మన స్వాతంత్ర్యోద్యమ లక్ష్యాలను గురించీ, వాటి సాధనకై అను సరించవలసిన మార్గాన్ని గురించీ కమ్యూనిస్టుపార్టీ అవలంబించిన దృక్పథం అది.

ఆ వైఖరి, ఆ దృక్పథం మనల్ని మరింత శీఘ్రంగాను, మరింత సమగ్రంగాను స్వాతంత్ర్యంవైపు కొనిపోయి యుండేదా (మనం సాధించు కున్న దానికన్న) ? లేక స్వాంతత్ర్యంవైపు మన పురోగతిని ఆటంక పరచియుండేదా ?

జవాబు స్పష్టంగానే తెలుసుకోవచ్చు.

# నాలుగవ అధ్యాయం

# లెనిన్, భారత దేశ స్వాతంత్ర్యం

లెనిన్, జాతుల స్వయంనిర్ణయ సూత్రాన్ని ఖచ్చితంగా అమలు జరిపాడు. పరాధీన జాతులు జాతీయ స్వాతంత్ర్యంకొరకు జరిపే పోరాటాలను (సాధారణంగా వీటిని వలస విముక్తి ఉద్యమ మని పిలుస్తూ ఉంటారు) ఆయన ఎల్లప్పుడూ బలపరుస్తూనే వచ్చాడు.

ఇందుకు కారణం ఆయనలోని ప్రగాఢమైన ప్రజాతంత్రదృక్పథ మొక్కటేకాదు. సామ్రాజ్యవాదంయొక్క స్వభావాన్ని గురించీ, దాని పాత్రను గురించీ ఆయన అత్యంత సవ్యమైన, విప్లవాత్మకమైన పరిశీలనలు జరిపాడు. ఆ పరిశీలనల ఆధారంపై, సామ్రాజ్యవాద దేశాల్లోని శ్రామికవర్గ సోషలిస్టు విప్లవాలకూ, పరాధీన వలస దేశాల్లోని సామ్రాజ్య వ్యతిరేక జాతీయ విప్లవాలకూ అవినాభావసంబంధం ఉందని గ్రహించాడు.

లెనిన్ దృష్టిలో, వలసదేశాల్లోని సామ్రాజ్య వ్యతిరేక పోరాటాలు పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా సోషలిజంకొరకు జరిగే ప్రపంచ కార్మికవర్గ పోరాటంలో ఒక భాగం. పాశ్చాత్యదేశాల్లోని సోషలిస్టు, కార్మికవర్గ ఉద్యమమూ, ప్రాచ్యదేశాల్లోని జాతీయ విముక్తి ఉద్యమాలూ ఒకదానికొకటి సహాయకారులనీ, యూరపులోని కార్మికవర్గ పార్టీలు ఆసియా — ఆఫ్రికాలలో జరిగే జాతీయ స్వాతంత్ర్యోద్యమాలకు తోడ్పడితీరాలనీ లెనిన్ ఎల్లప్పుడూ నొక్కి చెప్పేవాడు.

అంతేకాదు. ఒక సామ్రాజ్యవాదదేశంలోని కార్మికవర్గపార్టీ ఆ దేశం యొక్క పరిపాలనక్రింద పరాధీనస్థితిలో ఉండే దేశాల్లోని స్వాతంత్ర్యోద్యమాలను పూర్తిగా బలపరచాలని లెనిన్ మరీ గట్టిగా నొక్కిచెప్పాడు.

అంటే, బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ భారత స్వాతంత్ర్యోద్యమాన్నీ, ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ ఫ్రెంచి వలసల్లో జరిగే స్వాతంత్ర్యోద్యమాలనూ బల పరచడం వాటి ప్రత్యేక కర్తవ్యమన్నమాట. ఇలాగే యితర సామ్రాజ్య వాద దేశాల్లోని కమ్యూనిస్టుపార్టీల విషయంకూడా.

లెనిన్ సోషల్ డెమాక్రటిక్ (సంస్కరణవాద) సంస్థ అయిన రెండవ అంతర్జాతీయ సంస్థతో తెగతెంపులు చేసుకోడానికి కారణమైన వాటిలో ఒక ప్రధాన సమస్య వలస ప్రజల హక్కుకి సంబంధించిన, జాతుల స్వయం నిర్ణయానికి సంబంధించిన సమస్య. సామ్రాజ్యవాదానికి మెరుగులుదిద్ది, పరాధీన దేశాలకు తాము స్వయంనిర్ణయాధికారం నిరాకరించడాన్ని సమర్థించుతున్న సోషల్ డెమాక్రటిక్ నాయకుల్ని (ఉదా: రామ్సే మాక్డొనాల్డు) ఆయన తీవ్రంగా నిరసించాడు.

బ్రిటన్ మొదలైన సామ్రాజ్యవాద ప్రభుత్వాలు భారతదేశంలోను, చైనాలోను నిర్వహించిన ఆర్థిక, రాజకీయ పాత్రను గురించీ, వాటి అమానుష పైశాచిక పద్ధతుల్ని గురించీ లెనిన్ ప్రారంభదశనుంచీ విపులంగా వ్యాసాలు వ్రాశాడు. అంతేకాక, యీ సమస్యలపై ఆయన చాలా సంక్షిప్త వ్యాఖ్యలు వ్రాశాడు. ఉదాహరణకు, బ్రిటిషు పాలకులు "సిపాయి పితూరీ" అని ముద్రవేసిన 1857 తిరుగుబాటుయొక్క ప్రజా స్వభావాన్ని, విప్లవ స్వభావాన్ని ఆయన వివరించాడు. "సామ్రాజ్య వాదాన్ని గురించిన నోట్‌బుక్కు" లో 1905 నాటి బెంగాల్ విభజనను గురించి ఆయన వ్రాసిన మాటలివి : "బ్రిటిషు పాలకులు 'విభజించి పాలించు' అనే పాలసీద్వారా పెత్తనం చెలాయిస్తున్నారు...1905 లో బ్రిటిషువారి బెంగాల్ విభజన (జాతీయోద్యమాన్ని అణచే ఉద్దేశం)."

ఆయన రచనల్లో యిలాంటి వ్యాఖ్యలు చాలా ఉన్నాయి.

ఇండియా, చైనాలలోని జాతీయ విముక్తి ఉద్యమాన్ని గురించికూడా లెనిన్ చాల తరచు ప్రస్తావించేవారు. ప్రపంచ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో యీ ఉద్యమాలు నిర్ణాయకపాత్ర వహిస్తాయని ఆయన అభిప్రాయం. ఇండియా, చైనాలలో సామ్రాజ్యవాదుల

దుండగాలకు వ్యతిరేకంగా ఎంత చిన్న ప్రతిఘటన జరిగినా, దాన్ని ఆయన కొనియాడేవాడు.

ఉదాహరణకు, 14-4-1913 తేదీ "ప్రావ్దా"లో లెనిన్ "సంస్కార వంతులైన యూరపియన్లు, ఆటవికులైన ఆసియావాసులు" అనే వ్యంగ్యాత్మకమైన వ్యాసమొకటి వ్రాశాడు. అది బర్మాలో జరిగిన ఒక ఉదంతానికి సంబంధించినది. బర్మాలో ఒక బ్రిటిషు సైనికాధికారి ఐనా అనే పేరుగల పదకొండేండ్ల నౌకరీ బాలికను మానభంగంచేసి, ఒక గదిలోపెట్టి తాళం వేశాడు. ఆమె తండ్రి అప్పుడు మరణావస్థలో ఉన్నాడు. కూతుర్ని చూడాలని తహతహ లాడుతున్నాడు. ఇదంతా తెలుసుకున్న ఆ గ్రామస్తులు కోపోద్రిక్తులయారు, పోలీసులు ఆ అధికారిని అరెస్టు చేసేటట్లు వారు చేశారు. కోర్టులో అతనికి వ్యతిరేకంగా బలమైన సాక్ష్యం వచ్చింది. అయినా, జడ్జీ అతనిమీద కేసు కొట్టేశాడు, కారణం, ఐనా పడుపుకత్తెట. ఈ జడ్జీకూడ బ్రిటిష్‌వాడే మరి !"

పై సంక్షిప్త వ్యాసంలో లెనిన్ యీ ఉదంతాన్ని వివరంగా వర్ణించాడు. "భారతదేశంలో యిలాంటి ఉదంతాలు వేలు, లక్షలు జరుగుతున్నాయి," అని వ్రాస్తూ, భారతదేశంలో రాక్షసపాలన కొనసాగించే బ్రిటిష్ లిబరల్స్‌ని అతి తీవ్రంగా ఖండించాడు. వ్యాసం చివర ఆయన వాక్యాలివి: "30 కోట్లకుపైగా ప్రజలు నివసించే భారతదేశంలో విప్లవం ఎంత వేగంగా వృద్ధిచెందుతుందో యీ ఒక్క ఉదంతం సుదీర్ఘమైన సిద్ధాంత సూత్రీకరణలకన్న శక్తివంతంగా విశదపరుస్తుంది."

అంతకుముందే 1908 లో ఒక సందర్భంలో లెనిన్ యిలా వ్రాశాడు : "భారతదేశంతో 'నాగరికులైన' బ్రిటిష్ పెట్టుబడిదార్ల నేటివ్ బానిసలు యీ మధ్య తమ 'కామందులకు' చాలా దుఃఖాభాజ్యమైన ఆందోళన కలిగిస్తున్నారు: భారతదేశంలో జరిగే దౌర్జన్యాలకు, దోపిడీకి అంతులేకుండా ఉంది. ఇదంతా 'భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనా వ్యవస్థ' అనే పేరుతో పిలువబడుతోంది." (లెనిన్ : "ప్రపంచ రాజకీయాల్లో ప్రేలుడు పదార్థం")

ఆ వ్యాసంలోనే లెనిన్ తిలక్‌ని గురించీ, 1908 లో ఆయనకు ఆరేండ్లు కఠినశిక్ష విధింపబడినప్పుడు బొంబాయి బట్టలమిల్లు కార్మికులు జరిపిన నిరసన సమ్మెను గురించీ ప్రస్తావిస్తూ యిలా వ్రాశాడు:

"భారత ప్రజలు తమ రచయితల్నీ, రాజకీయ నాయకుల్నీ బలప రుస్తూ పోరాడ నారంభించారు. భారత ప్రజాతంత్రవాది అయిన తిలక్‌పై బ్రిటిష్ గుంటనక్కలు దారుణమైన శిక్ష విధించారు. (ఆయనపై దీర్ఘకాల దేశాంతర జైలుశిక్ష విధింపబడింది; ఆ మధ్య బ్రిటిష్ కామన్స్ సభలో అడిగిన ఒక ప్రశ్ననుబట్టి, భారత దేశస్థులైన జూరర్లు ఆయనను నిరప రాధిగా పరిగణించి విడుదల చేయాలనీ. కాని బ్రిటిషు జూరర్ల ఓట్లనుబట్టి శిక్ష విధింపబడిందనీ తెలుస్తోంది). ఈ శిక్ష ఒక ప్రజాతంత్రవాదిపై కోటీశ్వరుల బంట్లు తీసుకొన్న ప్రతీకారం. దీనికి నిరసనగా బొంబాయి వీధుల్లో పెద్ద ప్రదర్శనలు జరిగాయి; కార్మికులు సమ్మెచేశారు. భారత దేశంలోకూడా కార్మికవర్గం చైతన్యయుతంగా రాజకీయ ప్రజా పోరాటాల దశకు అభివృద్ధిచెందిం దన్నమాట. అందుచేత. రష్యాలో ఉన్న లాంటి బ్రిటిషు పరిపాలన భారతదేశంలో కూడా అంతంకాక తప్పదు." (లెనిన్ : "ప్రపంచ రాజకీయాల్లో ప్రేలుడు పదార్థం." క్రింది గీతలు మాతృక లోనివి).

భారతదేశంలో యుద్ధానంతర జాతీయ వెల్లువపట్ల, గాంధీజీ — కాంగ్రెసు నాయకత్వాన కొనసాగిన ఉద్యమంపట్ల లెనిన్ వైఖరిని గురించి ప్రత్యేకంగా నేను చెప్పదలచుకున్నాను. చారిత్రకంగా యిది చాల ముఖ్య మైన సమస్య. నేటి భారత ప్రజాతంత్రవాదులకు, సోషలిస్టులకు యిది ఆసక్తి కలిగించకమానదు. 1920-30 చివరిదశలోను, 1930-40 ప్రారంభ దశలోను భారత కమ్యూనిస్టులు యీ సమస్యపై లెనిన్ అభిప్రాయాల్ని అధ్యయనంచేసి అర్థం చేసుకొనియుంటే, భారతకమ్యూనిస్టుపార్టీ 1930-34 మధ్య జరిగిన శాసనోల్లంఘనోద్యమంలో అత్యంత నష్టం తెచ్చిపెట్టిన పొరబాట్లనుంచి రక్షింపబడి యుండేది; ఆ ఉద్యమ పరిణామంలో ఒక బలమైన జాతీయశక్తిగా అది అభివృద్ధిచెంది యుండేది.

ఈ సమస్యపై లెనిన్ వ్రాసిన సమగ్ర వ్యాసమేదీ లేదు. కాని, దానిమీద ఆయన అభిప్రాయాలను మనం స్పష్టంగా తెలుసుకోడానికి తగినంత సాక్ష్యం ఉంది. అంతర్జాతీయ కమ్యూనిస్టుసంస రెండవ మహాసభచే ఎన్నుకోబడిన కమిషన్—జాతుల సమస్యపైన, వలసదేశాల సమస్యపైన రిపోర్టు తయారు చేయడానికి ఎన్నుకోబడిన కమిషన్—1920 జూలై 17 ఆగస్టు 7 తేదీల మధ్య లెనిన్‌గ్రాడ్, మాస్కో నగరాల్లో సమావేశమైనప్పుడు యీ సమస్య సమగ్రంగా చర్చింపబడింది. ఆ చర్చల్లో లెనిన్ పాల్గొన్నాడు. ఆ సమావేశ చర్చలను గురించిన మినిట్స్ చదివినట్లయితే, యీ సమస్యపై నిస్సందేహంగా చాల చక్కని వివరణ మనకు కనిపిస్తుంది.

లెనిన్ జాతుల సమస్యపైన, వలసదేశాల సమస్యపైన రెండవ మహాసభకు తన ప్రాథమిక డ్రాఫ్టు థీసీసును సమర్పించాడు. అందులో పరాధీన వలస దేశాల్లోని కమ్యూనిస్టులు స్వతంత్ర కార్మిక – కర్షక సంసలను నిర్మించాలనీ, వారి పోరాటాలను నడపాలనీ తెలియజేశాడు. అంతే కాక, అట్టి దేశాల్లో కమ్యూనిస్టులు జాతీయ బూర్జువావర్గపు రాజీ పోకడలను ఎదుర్కోవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాడు. ఈ అంశాలపై అభిప్రాయభేదేవీ ఆ నాడు లేవు.

చర్చకు వచ్చిన అసలు అంశం, ప్రధానాంశం ఏమంటే, జాతీయ బూర్జువావర్గ నాయకత్వం నడిపే జాతీయ స్వాతంత్ర్యోద్యమాల పట్ల, వాటి నాయకులపట్ల ఎట్టి వైఖరి నవలంబించాలనేది. అనేక వలస దేశాల్లో కొత్తగా స్థాపింపబడిన కమ్యూనిస్టు పార్టీలకు యిదే ఆనాడు ప్రధాన సమస్య.

రెండవ మహాసభకుముందు లెనిన్ చాలకాలంగా వలస దేశాల్లోని బూర్జువావర్గం (పెట్టుబడిదారీవర్గం) సామ్రాజ్య వ్యతిరేకశక్తి అనీ, అభివృద్ధినిరోధక శక్తులకది వ్యతిరేకమనీ చెబుతూ వచ్చాడు. ఉదాహరణకు, 1913 మే నెలలో "వెనుకబడిన యూరపు, ముందున్న ఆసియా" అనే సుప్రసిద్ధ వ్యాసంలో ఆయన యూరపియన్ బూర్జువావర్గం అభివృద్ధినిరో

ధికత్వంలో పడిపోయిందనీ, ఆసియాలోని బూర్జువావర్గం అభివృద్ధినిరోధ కత్వానికి వ్యతిరేకంగా నిలిచియుందనీ తెలియజేశాడు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే :

"ఆసియాలో ప్రతిచోటా ఒక బ్రహ్మాండమైన ప్రజాతంత్ర ఉద్యమం వ్యాపిస్తోంది; అది అంతకంతకు బలపడుతోంది. అక్కడ బూర్జువావర్గం యిప్పటికి అభివృద్ధినిరోధకత్వానికి వ్యతిరేకంగా ప్రజల పక్షాన నిలబడియుంది. అనేక కోట్లమంది ప్రజలు నిద్ర మేల్కొని, వెలుతురు చూచి, స్వాతంత్ర్య భావోద్దీపితులవుతున్నారు." (క్రింది గీత నాది —రచయిత).

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్యంకొరకు జరిగే పోరాటాల్లో వలసదేశాల్లోని జాతీయ బూర్జువా వర్గానికి లెనిన్ ఏ స్థానమిచ్చాడో. సందేహాలకు తావులేకుండా, సులభంగా మనం తెలుసుకోవచ్చు.

తిలక్‌ను కొనియాడుతూ లెనిన్ చెప్పిన మాటలను యిదివరకే నేను పేర్కొన్నాను.

ఈ దృక్పథాని కనుగుణంగా, జాతుల సమస్యపైన, వలసదేశాల సమస్యపైన లెనిన్ తయారుచేసిన ప్రాథమిక డ్రాఫ్టుథీసిసులో యిలా ఉంది :

"ఫ్యూడల్ సంబంధాలు, లేదా మాతృస్వామిక, పితృస్వామిక రైతు సంబంధాలు ప్రబలంగా ఉన్న వెనుకబడిన దేశాలు, జాతుల విషయంలో జ్ఞాపకముంచుకోవలసిన అతి ప్రధానమైన అంశాలేవంటే :

"మొట్టమొదటిది : ఈ దేశాల్లోని బూర్జువా ప్రజాతంత్ర విముక్తి ఉద్యమాలకు అన్ని కమ్యూనిస్టుపార్టీలు సహాయం చేయాలి; అత్యంత క్రియాత్మకమైన సహాయం చేయవలసింది ఎవరంటే, ఏ దేశంపై వెనుకబడియున్న జాతి వలసపాలన, ద్రవ్య విషయాల్లో ఆధారపడియుందో

ఆ దేశంలోని కార్మికులు," (లెనిన్ : "ప్రాచ్య దేశాల్లో జాతీయ విముక్తి ఉద్యమం," పేజీ 254—విదేశ భాషా ప్రచురణసంస్థ, మాస్కో, 1962).

అయితే, కమిషన్‌లో జరిగిన చర్చల ఫలితంగాను, రెండవ మహాసభ ఆమోదించిన రూపంలోను "బూర్జువా ప్రజాతంత్ర జాతీయవిముక్తి, ఉద్యమం" అనే మాటలు ఆ థీసిసులో చేర్చబడ్డాయి. ఇది ఎలా జరిగింది? దీని అర్థమేమిటి?

ఆ రోజుల్లో భారతదేశంలోగాని, విదేశాల్లోగాని నివసించే భారత కమ్యూనిస్టు లందరిలోను ఎం. ఎన్. రాయి ఎక్కువగా అభివృద్ధిచెందిన వాడూ, నాయకుడూ అనే విషయం అందరికీ తెలుసు. ఆయన అభిప్రాయాలకు, అంచనాలకు లెనిన్ విలువ యిచ్చేవాడు. అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ రెండవ మహాసభకు రాయ్ ఒక ప్రతినిధి (మెక్సికోనుండి); జాతుల సమస్యపైన రిపోర్టు తయారుచేయడానికి ఆ మహాసభచే ఎన్నుకోబడిన కమిషన్‌లో ఆతడు చాల చురుకైన సభ్యుడు. నిజానికి అతడు లెనిన్ థీసిసుకు ప్రత్యామ్నాయంగా ఒక ప్రత్యేక థీసిసును తయారుచేసి, కమిషన్‌కి సమర్పించాడు.

ఆనాడు రాయ్ అభిప్రాయాలు చాల "అతివాదం"గా ఉండేవి. అయితే, 1928 లో అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థనుంచి తొలగింపబడ్డాక అతడు మితవాదుల్లో మితవాదిగా తయారై, చివరకు మార్క్సిజాన్నే విసర్జించాడు. లెనిన్ థీసిస్‌తో పోలిస్తే రాయ్ "అతివాద పైఖరి నవలంబించినట్లు అందరూ అంగీకరిస్తున్నారు. అతడు ప్రచురించిన "స్మృతులు" అనే గ్రంథంలో అత డీ విషయాన్ని స్వయంగా విశదీకరించాడు.

రాయ్ పదేపదే భారత దేశాన్ని గురించి తన కెక్కువగా తెలుసునన్న ధీమాతో మాట్లాడేవాడు, నిజానికి, లెనిన్‌కి అతని అభిప్రాయాలకు విలువ యివ్వడానికి కారణం యిదే. అయినప్పటికీ, రాయ్ ప్రవేశపెట్టిన ప్రత్యామ్నాయ థీసిసులోని దిగువ భాగాలకు పరిశీలిస్తే, వలస దేశాల పరిస్థితుల్ని గురించి "పరిమిత" (!) జ్ఞానం మాత్రమేగల లెనిన్

వలస విముక్తి ఉద్యమంయొక్క వాస్తవ స్థితిగతులను — కమ్యూనిస్టులు అవలంబించవలసిన ఎత్తుగడలతో సహా — ఎంత ఆశ్చర్యంగొల్పేటట్లు ఆకళింపుచేసుకున్నాడో, రెండోవైపు, దీనిపై తన కెంతో పరిజ్ఞాన ముందని చెప్పకొంటూవచ్చిన రాయ్ ఎట్టి ఊహా ప్రపంచంలో విహరించే వాడో స్పష్టంగా బోధపడుతుంది.

రాయ్ ప్రత్యామ్నాయ థీసిసులో యిలా ఉంది :

"పరాధీన దేశాల్లో రెండు భిన్నమైన ఉద్యమా లున్నాయి; యివి రోజు రోజుకూ ఒక దాన్నుంచి ఒకటి విడివడుతున్నాయి. ఒకటి బూర్జువా ప్రజాతంత్ర జాతీయోద్యమం; దాని కార్యక్రమం బూర్జువా వ్యవస్థక్రింద రాజకీయ స్వాతంత్ర్య సాధన. రెండు, నిరుపేదలైన, అజ్ఞానులైన కార్మిక - కర్షకుల ప్రత్యక్ష కార్యాచరణ; దాని లక్ష్యం, సకల విధాలైన దోపిడీనుంచి విముక్తి.

1920 నాటి భారతదేశంలో, "బూర్జువా వ్యవస్థ క్రింద రాజకీయ స్వాతంత్ర్య సాధన," "సకల విధాలైన దోపిడీనుంచి విముక్తి" అనే రూపంలో రెండు "భిన్నమైన" ఉద్యమాలు ఎక్కడుండేవి? రాయ్ స్వప్న జగత్తులో మాత్రమే.

ఆయన థీసిసులో ఇంకా యిలా ఉంది : "అనేక వలస దేశాల్లో, కార్మిక ప్రజలతో దగ్గర సంబంధా లుంచుకోడానికి ప్రయత్నించే సుసంఘటితమైన విప్లవ పార్టీలు యిదివరకే ఉన్నాయి."

"కార్మిక ప్రజలతో దగ్గర సంబంధా లుంచుకోడానికి ప్రయత్నించే సుసంఘటిత విప్లవ పార్టీల" మాట అలా వుంచి, భారతదేశంలో 1920 నాటికి ఒక్క కమ్యూనిస్టుకూడా లేడు. ఆ విధమైన "విప్లవ పార్టీలు" కమ్యూనిస్టు పార్టీలుగా తప్ప ఉండలేవు. నిజానికి రాయ్ కొన్ని పంక్తుల తర్వాత, అలాంటి పార్టీలు "ఆయా దేశాల్లో కార్మిక వర్గానికి అగ్రదళంగా ఉన్నాయి," అని వ్రాశాడు. దీన్నిబట్టి ఆయన ఉద్దేశంలో "విప్లవ పార్టీ"లంటే అర్థం కమ్యూనిస్టు పార్టీలేనని స్పష్టమవుతుంది.

రాయ్ థీసిసులో అన్నిటికంటె ఆశ్చర్యకరమైన సూత్రీకరణ ఏమంటే :

"వలస దేశాల్లో నాయకత్వం ప్రారంభంనుంచే కమ్యూనిస్టు అగ్ర దళం చేతిలో ఉంటే, విప్లవ ప్రజానీకాన్నెవరూ పెడమార్గం పట్టించ లేరు." ఒక పరాధీన దేశంలోని కమ్యూనిస్టు పార్టీ "ప్రారంభంనుంచీ" స్వాతంత్ర్యోద్యమ నాయకత్వాన్ని ఎలా చేజిక్కించుకో గలదో భగవంతు నికే తెలియాలి. సరియైన పాలసీ, సరియైన ఎత్తుగడలు ఉన్నప్పటికీ, అసాధారణమైన కృషితోగాని సాధ్యంకాని యీ పని రాయ్ దృష్టికి క్షణ మాత్రంలో సాధ్యమని తోచింది.

తన "స్మృతుల"లో అతడు రెండవ మహాసభలో తనకూ, లెని న్‌కీ మధ్య ఏర్పడ్డ అభిప్రాయ భేదాలను కొంత దీర్ఘంగా వివరించాడు. వలస దేశాల్లో జాతీయ బూర్జువా వర్గంయొక్క సామ్రాజ్య వ్యతిరేక పాత్రను గురించి లెనిన్ అంచనాను అతడు ఉన్నదానికంటె ఎక్కువ చేసి చూపాడు. అయినప్పటికీ, అలాంటి దేశాల్లో కమ్యూనిస్టులు జాతీయ బూర్జువా నాయకత్వం యెడల విమర్శనాత్మకమైన సహకార ధోరణిని ప్రదర్శించాలని లెనినూ, దీనికి విరుద్ధంగా పూర్తి వ్యతిరేఖ వైఖరి నవలం బించాలని రాయీ అభిప్రాయ పడినట్లు స్పష్టంగా బోధపడుతుంది. ఆయన మాటల్లోనే చెప్పాలంటే, "స్మృతులు" 379 పేజీలో యిలా ఉంది :

"సామ్రాజ్యవాదం వలస దేశాల్ని ఫ్యూడల్ సామాజిక పరిస్థితుల్లో బిగపట్టి ఉంచిందనీ. దీని ఫలితంగా పెట్టుబడిదారీ విధానపు అభివృద్ధి నిరోధింపబడిందనీ, జాతీయ పెట్టుబడిదార్ల ఆశలు అడియాస లయాయనీ లెనిన్ వాదించాడు. చారిత్రకంగా చూస్తే, జాతీయ విముక్తి ఉద్యమానికి బూర్జువా ప్రజాతంత్ర ఉద్యమపు ప్రాధాన్యత ఉంది...అందుచేత, కమ్యూనిస్టులు జాతీయ బూర్జువా వర్గపు నాయకత్వం క్రింద నున్న వలస విముక్తి ఉద్యమాన్ని బలపరచాలి; జాతీయ బూర్జువా వర్గం వస్తుతః విప్లవశక్తి అనే విషయం గుర్తించాలి...ఇదీ లెనీన్ దృక్పథం.

"అతి ప్రధానమైన వ్యత్యాసం గాంధీజీ పాత్రను గురించి. ఆయన ప్రజా ఉద్యమాన్ని ఉత్తేజపరుస్తూ నడుపుతూన్నందున విప్లవపాత్ర వహించాడని లెనిన్ అభిప్రాయ పడ్డాడు. కాని, ఆయన మతరీత్యాను, సాంస్కృతికంగాను సనాతనవాది గనుక రాజకీయంగా ఎంత విప్లవ వాదిగా కనిపించినప్పటికీ, సామాజికంగా అభివృద్ధి నిరోధకుడుగా ఉండక తప్పదని నేను వాదించాను."

పై వాక్యాల్లో రాయ్ చిత్రణ కొంత వక్రంగా ఉందనేది స్పష్టం. అయినప్పటికీ, ప్రధాన భేదం స్పష్టంగానే కనిపిస్తుంది.

ఈ సమస్యపై వెలుగు చూపేటందుకు మరొక ఆధారం ఉంది: అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ రెండవ మహాసభకు ఆల్ఫ్రెడ్ రోస్మర్ అనే పేరుగల ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు ఒక ప్రతినిధిగా హాజ రయ్యాడు: ఆయన "లెనిన్ కాలంలో మాస్కోలో : 1920-21" అన్న శీర్షికతో తన స్మృతులు వ్రాశాడు, అందులో యిలా తెలియజేశాడు :

"లెనిన్ ఎంతో ఓపికతో రాయ్‌కి సమాధానం చెప్పాడు, భారత కమ్యూనిస్టు పార్టీ కొంతకాలం వరకు కొద్దిమంది సభ్యులతో ఒక చిన్న పార్టీగా ఉంటుందనీ, బలహీన స్థితిలోనే ఉంటుందనీ, తన కార్యక్రమం ఆధారంపై. సొంత కార్యకలాపాల ద్వారా అది కార్మికుల్ని, రైతుల్ని గణనీయమైన సంఖ్యలో సమీకరించజాలదనీ లెనిన్ వివరించాడు, జాతీయ స్వాతంత్ర్య వాంఛను ఆధారం చేసుకొని పనిచేస్తే, విస్తృత ప్రజానీకాన్ని సమీకరించడం సాధ్యమవుతుంది. అనుభవమే దీన్ని చక్కగా రుజువు చేసింది. భారత కమ్యూనిస్టు పార్టీ యిలాంటి పోరాట క్రమం లోనే తన నిర్మాణాన్ని పటిష్టం చేసుకొని అభివృద్ధి చేసుకోగలుగుతుంది. ఆ అభివృద్ధి ఎంత ఉచ్ఛస్థాయికి చేరుకొంటుందంటే, జాతీయ వాంఛ సిద్ధించిన తర్వాత భారత బూర్జువా వర్గాన్ని ఎదుర్కొగల స్థితిలో అది ఉంటుంది." (ఓవర్ స్ట్రీట్, విండ్ మిల్లర్ : "కమ్యూనిజం ఇన్ ఇండియా" అను గ్రంథంలో ఉటంకింపబడిన భాగం-పేజీ 32)

పై వాక్యాలనుకూడ మనం ముక్కస్యముక్కార్థః అర్థం చేసుకోనక్కర్లేదు. వాటి సారాంశం మాత్రం స్పష్టమే.

క్లుప్తంగా చెప్పాలంటే, ఆ సారాంశం యిది: భారతదేశంలోని కమ్యూనిస్టులు గాంధీజీతోను, ఆయన నడిపే ప్రజా ఉద్యమంతోను సహకరించాలనీ, అదే సమయంలో ఆ ఉద్యమాన్ని తీవ్రతర మొనర్చేటందుకు, మరింత పోరాట పటిమను దానికి సమకూర్చేటందుకు సకల చర్యలు తీసుకోవాలనీ లెనిన్ అభిప్రాయ పడ్డాడు.

జాతుల సమస్యపైన, వలస దేశాల సమస్యపైన రిపోర్టు తయారు చేసేందుకు నియమింపబడ్డ కమిషన్‌లో యీ సమస్య సాకల్యంగా చర్చింపబడిన తర్వాత, తన థీసిసులోని "అన్ని కమ్యూనిస్టు పార్టీలు యీ దేశాల్లోని (పరాధీన దేశాలు - రచయిత) బూర్జువా ప్రజాతంత్ర విముక్తి ఉద్యమానికి సహాయపడాలి," అనే వాక్యంలో ఉన్న "బూర్జువా ప్రజాతంత్ర విముక్తి ఉద్యమం" అనే మాటకు బదులు "జాతీయ విప్లవోద్యమం" అనే మాటను చేర్చడాని కంగీకరించిన మాట నిజమే (అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ రెండవ మహాసభలో జాతుల సమస్యను గురించి, వలస దేశాల సమస్యను గురించి ప్రవేశపెట్టబడిన థీసిసుపై జరిగిన చర్చకు లెనిన్ జవాబు: "ప్రాచ్య దేశాల్లో జాతీయ విముక్తి ఉద్యమం," పేజీ 265_66).

లెనిన్, తనకంటె ఎక్కువ విషయ పరిజ్ఞానం గలవారుగా పరిగణించిన వ్యక్తుల అభిప్రాయాలను ఎంత గౌరవించేవాడో, తనెంత నమ్రతను ప్రదర్శించేవాడో తెలుసుకోడానికి యీ ఉదంతం ఒక తార్కాణం. పైగా, ఆ కమిషన్ సభ్యుల్లో రాయ్ ఒక్కడే కాదు "అతివాది." ఇతరులు కూడా అలాంటి అభిప్రాయాలనే కలిగియుండేవారు. లెనిన్ తన అభిప్రాయాన్ని మార్చుకొనేటట్లు చేయడంలో రాయ్ పాత్ర యిదీ.

ఈ సందర్భంలో మనం గమనించవలసిన విషయ మేమంటే, రాయ్ తన "స్మృతుల్లో" దీన్ని గురించి రెండవసారి ప్రస్తావించాడు. రాయ్ అభిప్రాయాల్లో కొన్నిటిని లెనిన్ అంగీకరించిన తర్వాతకూడా

ఆయన యీ క్రింది విధంగా చెప్పినట్లు ఆ గ్రంథంలో ఉంది: "మన మొక కొత్త అంశాన్ని పరిశోధిస్తున్నాం. ప్రత్యక్షానుభవం లభించేవరకు అంతిమ నిర్ణయాన్ని వాయిదా వేసుకోవాలి." (పేజీ 380).

"జాతీయ వాదానికి ఎర్రరంగు పూయవద్దు," అని లెనిన్ తరచు తనను మందలించేవాడనికూడా రాయ్ తన గ్రంథంలో తెలియజేశాడు.

కాబట్టి, మనకుగల ఆధారాలన్నిటినిబట్టి, ఒక స్పష్టమైన నిర్ధారణకు మనం రాకతప్పదు. అదేమంటే, వలస దేశాల్లోని కమ్యూనిస్టులు బలమైన జాతీయశక్తిగా అభివృద్ధి చెందాలంటే వారు బూర్జువా జాతీయ స్వాతంత్ర్యోద్యమాలలో పాల్గొనవలసి యుంటుందనేది లెనిన్ దృఢాభిప్రాయం. అలా పాల్గొనకుండా, అట్టి ఉద్యమాల నాయకుల్ని "అభివృద్ధినిరోధకులు" అని ఖండించడం ద్వారా వాటి కెదురు నిలిస్తే, "నిజమైన జాతీయ విప్లవోద్యమం" అనే పేరుతో "దానికి భిన్నమైన" మరో ఉద్యమాన్ని నిర్మిస్తే, అట్టి విధానం విప్లవానికి దారితీయదు; పైగా కమ్యూనిస్టుల్ని జాతీయ విముక్తి విప్లవంనుంచి వేరుపరుస్తుంది; వారి పనిని స్తంభింపజేస్తుంది.

లెనిన్ వలస విముక్తి ఉద్యమానికి సంబంధించిన అతి క్లిష్టమైన, అతి సున్నితమైన సమస్యలను సైతం ఆవగాహనచేసుకోడంలో ఎంత నిశితమైన బుద్ధిని ఉపయోగించేవాడో తెలుసుకోడానికి ఒక ఉదాహరణ యిస్తాను.

1920 లో భారతీయుల బృంద మొకటి లెనిన్‌కి ఒక సందేశం పంపారు. దానికి జవాబుగా లెనిన్ యిలా వ్రాశాడు (1920, మే 20):

"కార్మిక — కర్షకుల రిపబ్లిక్ స్వయంనిర్ణయ సూత్రాన్ని, విదేశీ — స్వదేశీ పెట్టుబడిదార్ల దోపిడీనుంచి పీడిత జాతుల విముక్తినీ ప్రకటించినందుకు స్వాతంత్ర్య సాధనకై వీరోచితంగా పోరాడుతూన్న అభ్యుదయకాముకులైన భారతీయులనుంచి యింత శీఘ్రంగా హర్షామోదాలు లభించినందుకు నేను సంతోషిస్తున్నాను. రష్యన్ శ్రామిక ప్రజా

నీకం భారతదేశంలోని శ్రామిక — కర్షకుల జాగృతిని గురించి అత్యంత శ్రద్ధతో తెలుసుకొంటూనే ఉన్నారు. శ్రామిక ప్రజల నిర్మాణం, క్రమశిక్షణ, పట్టుదల, ప్రపంచ కార్మికులతో వారి సంఘీభావం — యివి అంతిమ విజయానికి సూచనలు. ముస్లింలు, ముస్లిమేతరులు సమైక్యమవుతూండడాన్ని మేము హర్షిస్తున్నాం. ఈ సమైక్యత ప్రాచ్యదేశాల్లోని శ్రామిక ప్రజానీకానికంతకూ వ్యాపించాలని మేము హృదయపూర్వకంగా వాంఛిస్తున్నాం. ఎందుచేతంటే. ఇండియా, చైనా, కొరియా. జపాన్, పర్షియా, టర్కీ దేశాల కార్మికులు, రైతులు చేతులుకలిపి, వారి ఉమ్మడి ఆశయమైన స్వాతంత్ర్య సాధనకై కలిసి పోరాడితేనే, దోపిడీదార్లపై పై నిర్ణయాత్మకమైన విజయం సాధ్యమవుతుంది. స్వతంత్ర ఆసియా చిరకాలం వర్ధిల్లుగాక."

పీడిత జాతుల విముక్తికి సంబంధించిన సమస్యపై లెనిన్ అవగాహనను, దృక్పథాన్ని, పాలసీని పై జవాబు ద్యోతకం చేస్తుంది. అదే సమయంలో, పై జవాబులోని ఒక అంశం ఎంత ప్రధానమైనదో మనం గమనించాలి.

లెనిన్ తన జవాబులో ఏ "ముస్లిం, ముస్లిమేతరుల సమైక్యత"ను హర్షించాడు ? 1920 లో ఆ సమైక్యత ఏ సందర్భంలో ప్రదర్శింపబడింది? ఖిలాఫత్ సమస్యపై ప్రదర్శింపబడిన ఐక్యతను గురించి ఆయన ప్రస్తావించాడనడంలో సందేహంలేదు.

భారత స్వాతంత్ర్యోద్యమం అతిక్లిష్టమైన పరిస్థితుల్లో ఆ హిందూ —ముస్లిం సమైక్యతయొక్క సామ్రాజ్య వ్యతిరేక పాత్ర, జాతీయ విమోచనపాత్ర లెనిన్ నిశితదృష్టినుంచి తప్పించుకుపోలేదు. బహుశా రాయ్ దృష్టిలో ఖిలాఫత్ ఐక్యత "మతవిషయిక, సనాతన, అభివృద్ధినిరోధక" సమస్య.

భారత స్వాతంత్ర్యోద్యమ సమస్యలను లెనిన్ అంత కుశాగ్రబుద్ధితో అవగాహన చేసుకున్నాడు. ఉత్తరోత్తరా భారతశ్రామిక ప్రజల విముక్తికి దారితీసేటట్లు ఆ ఉద్యమ విజయానికి చక్కని మార్గంచూపాడు.

# ఐదవ అధ్యాయం

# 1930 - 40 నాటి సిద్ధాంత, సాంస్కృతిక వెల్లువ

సహాయనిరాకరణోద్యమం 1922 లో ఉపసంహరింపబడ్డంతో, ప్రజా ఉద్యమం చల్లబడి ఛిన్నాభిన్నమయింది. దేశమంతటా నిస్పృహ, నిస్తబ్ధత వ్యాపించాయి. ఈ పరిస్థితి 1927 వరకు కొనసాగింది;

కాని, 1920-30 చివరిభాగంలో ఒక కొత్త వెల్లువ ప్రారంభమై, 1930-40 మధ్య ఉధృతరూపం ధరించి, రెండవ ప్రపంచయుద్ధంతర్వాత అత్యున్నత శిఖరా న్నందుకొంది. 1947 లో భారతదేశం జాతీయస్వాతంత్ర్యాన్ని సాధించుకొంది.

గాంధీజీ తాత్విక భావాల పరిమితుల్ని గురించీ. సహాయనిరాకరణోద్యమం విఫలమవడానికి గల కారణాలను గురించీ హృదయ పరిశోధన; 1929 లో ప్రారంభమైన ప్రపంచ ఆర్థిక సంక్షోభం, అది భారత దేశానికి తెచ్చిపెట్టిన ముప్పు; యూరపులో హిట్లరు ఫాసిజం ఆవిర్భావం: యూరపు, ఆసియాలలో ఫాసిస్టుల, సామ్రాజ్యవాదుల దురాక్రమణ — యివన్నీ సహజంగా నూతన జాగృతికి కారణమయాయి.

కాని, నూతన ఆలోచనలను రేకెత్తించడంలో అన్నిటికన్న ప్రబలమైన అంశం సోవియట్ యూనియన్ సుస్థిరత, ఆర్థిక -సాంస్కృతిక రంగాల్లో అది సాధించిన బ్రహ్మాండమైన విజయాలు, వెనుకబడిన పరాధీన దేశాల ప్రజల్లో సోషలిస్టు సోవియట్ సమాజపు విజయాలు కలుగజేసిన మహత్తర ప్రభావమూను.

1920–30 చివరి దశవరకు సిద్ధాంత, సాంస్కృతిక రంగాల్లో భారత స్వాతంత్రోద్యమంయొక్క, దేశభక్తి భావాలయొక్క ప్రధాన ధోరణి, "భారతదేశపు ప్రాచీన, సముజ్వల సంప్రదాయాన్ని పునరుద్ధరించడం." తిలక్ విషయమూ యింతే. గాంధీజీ విషయమూ యింతే. ఈ దృక్పథం నిస్సందేహంగా కొన్ని దశాబ్దాలవరకు బలమైన సామ్రాజ్య వ్యతిరేక పాత్ర నిర్వహించింది. కాని, దాని సహజ పరిమితులవల్ల నష్టం కలిగింది.

ఈ దృక్పథం ప్రజల్లో అనంతమైన ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని, సాహసాన్ని, త్యాగశీలతను పురిగొల్పినప్పటికీ, తిరోగమనంవల్ల నవభారతం నిర్మింపబడజాలదు. గతించిన కాలంనుంచి ఉత్సాహం పొందడం ద్వారా మనం పారిశ్రామిక, శాస్త్రీయ, సాంస్కృతిక పునరుజ్జీవం కలిగించలేం. అంతేకాక, ఆనాడు దేశాన్నెదుర్కొన్న కీలక సమస్యలో – బ్రిటిష్ పాలనను అంతమొనర్చడం—ఏది ప్రాధాన్యం వహించింది? ఆనాటి భారత స్వాతంత్ర్యోద్యమం ప్రపంచ రాజకీయాల్లోని ప్రజాతంత్ర, సామ్రాజ్య వ్యతిరేక ధోరణులతో సంబంధం లేకుండా విడిపడి యుంటే అది అభివృద్ధి చెందియుండేది కాదు.

అందుచేతనే దేశంలో సిద్ధాంత, సాంస్కృతిక వెల్లువ ఒకటి విజృంభించింది. అది 1920–30 చివరి దశలో ప్రారంభమయింది. విస్తృతిలోను, ప్రగాఢతలోను అది దేశ చరిత్రలోనే అనన్య సామాన్యమైనట్టిది. దేశం సిద్ధాంత, సాంస్కృతిక రంగాల్లో తిరోగమన మార్గాన్ని విడనాడి పురోగామి దేశంగా అభివృద్ధి చెందసాగింది. విస్తృతమైన బాహ్య ప్రపంచంవైపు, దానితో మనకు గల సంబంధంవైపు దృష్టిని సారించ నారంభించారు. మధ్య యుగాల ఆలోచనా రీతులనుంచి ఆధునిక భావ తరంగాలవైపు పురోగమించసాగాం. 1933 లో నెహ్రూ ఒకచోట యిలా వ్రాశారు: నేడు భారతదేశం ఒక విధమైన మానసిక గందరగోళంలో పడిఉంది. తన జాతీయ సిద్ధాంత ధోరణి నేటి ప్రపంచ పరిస్థితులకు సరపడదని తెలుసుకొంటూంది. అందుచేత, ఒక నూతన ఆలోచనా విధానాన్ని రూపొందించుకోడానికి ప్రయత్నిస్తోంది. ఈ ప్రయత్నం

బాధాకారంగాను, గందరగోళంగాను ఉంది. అయినప్పటికీ ఆ ప్రయత్నం మాత్రం మానకూడదు. ఎందుచేతంటే, భారతదేశం అభ్యుదయకరమైన సామాజిక విప్లవ దృక్పథ మలవరచుకోడం ద్వారానే, స్వాతంత్ర్య పోరాటంలోను, ప్రపంచ పోరాటంలోను కూడా శక్తివంతంగా పాల్గొనగ్గలుతుంది." ("సోషలిజం గురించి నెహ్రూ" - పేజీ 50-51)

దీని అర్థం, అంతకుముందు దశాబ్దాల్లో, లేదా శతాబ్దంలో, యిలాంటిదేమీ జరగలేదని కాదు. కాని, యిటీవలి పెల్లువతో పోలిస్తే, యిదివరకటి నూతన భావరీతులు చిన్న తరంగాలు మాత్రమే (అవైనా పట్టణ మేధావులకు మాత్రమే పరిమిత మయాయి). అత్యంత ప్రధానమైన విషయమేమంటే, యిప్పుడు ప్రపంచంనుంచి వీచనారంభించిన కొత్త గాలులు సోషలిస్టు రష్యానుంచి (ఆనాడు 'సోవియట్ యూనియన్' అనే శబ్దం వ్యాప్తిలో లేదు) వచ్చాయి. కాని రష్యా విప్లవానికి పూర్వం అవి ప్రధానంగా పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాల్లోని నవ్యభావుకులనుంచి వచ్చాయి.

లెనిన్ ఒక సందర్భంలో యిలా వ్రాశాడు : "సరియైన విప్లవ సిద్ధాంతమైన మార్క్సిజాన్ని ఆచరణలో పెట్టడంలో రష్యా అనంతమైన బాధ లనుభవించింది; అర్ధ శతాబ్దకాలం నిరుపమానమైన త్యాగా లొనర్చింది; అనన్య సామాన్యమైన విప్లవ సాహసం, నమ్మశక్యంకాని శక్తి, దృఢ విశ్వాసంతో కూడిన అన్వేషణ, అధ్యయనం, ప్రయోగం, వైఫల్యం, యూరపుఅనుభవంతో సరిపోల్చిచూచుకోడం—వీటన్నిటి ఫలితమే రష్యా విప్లవం." ఈ ప్రయత్నాల్లో. "దారి తెన్ను తెలియని పర్యటనలు, ఊగిసలాటలు, పొరబాట్లు, ఆశాభంగాలు యివన్నీ కూడ రష్యా విప్లవ సిద్ధాంత పరిణామంలో భాగాలే" నని లెనిన్ తెలియజేశాడు, (లెనిన్ : "అతివాద కమ్యూనిజం : ఒక బాలారిష్టం," సెలెక్టెడ్ వర్క్స్- రెండవ సంపుటి. పేజీ 575).

భారతదేశంకూడా చాలా కాలం యిట్టి బాధలే అనుభవించింది. కాని, 1920-30 మధ్యనుంచి అది సరికొత్త ఆలోచనలను, అనుభవాలను సంతరించుకొంది.

ఆ దశలో భారతదేశంలో ద్యోతకమైన నూతనభావ వెల్లువను గురించి తెలుసుకోవడం ఆసక్తిదాయకమైన, సహాయకరిమైన విషయం.

ఈ నూతన జాగృతికి, నూతన మార్గాన్వేషణకు తొలి ఘట్టం ఏదంటే, స్వాతంత్ర్యం సాధించుకోడానికి, పేదరికాన్నీ బడుగు స్థితినీ తొలగించుకొనేందుకు, సౌఖ్యప్రదమైన నూతన వ్యవస్థను నిర్మించుకొనేందుకు చేబట్టవలసిన కార్యక్రమం, పద్ధతుల కొరకు అన్వేషించడం.

ఈ అన్వేషణ ఫలిత మేమంటే, సోషలిస్టు లక్ష్యాన్నీ, భావాలనూ దేశంలో అనేకులు హర్షించడం, ఆమోదించడం; భారత స్వాతంత్ర్య పోరాటం ఆసియా - ఆఫ్రికా ఖండాల్లోని వలస విముక్తి ఉద్యమాలతో అవినాభావ సంబంధం కలిగియుందని గుర్తించడం; యూరపులోని ఫాసిస్టు వ్యతిరేక ప్రజాతంత్ర ఉద్యమంతోకూడ దానికి అవినాభావ సంబంధముందని గ్రహించడం, సోవియట్ యూనియన్ అభ్యుదయానికీ, ప్రజాస్వామ్యానికీ, జాతీయ స్వాతంత్ర్యానికీ సహాయకారి అని తెలుసుకోవడం.

జవహర్లాల్ నెహ్రూ 1936 లో లక్నోలో జరిగిన కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహిస్తూ, తన ఉపన్యాసంలో యిలా తెలియజేశారు : "ఈ విధంగా, ప్రపంచం యీనాడు రెండు పెద్ద శిబిరాలుగా విభజింపబడియుంది : సామ్రాజ్యవాదులు - ఫాసిస్టులు ఒక శిబిరంలోను, సోషలిస్టులు-జాతీయ వాదులు రెండవ శిబిరంలోను ఉన్నారు." సోవియట్ యూనియన్ భారత దేశానికి సోషలిస్టు భావాలను తీసుకొచ్చిందనికూడా ఆయన చెప్పారు.

ఈ సమస్యలపై పత్రికల్లో అనేక వ్యాసాలు, యితర విధాలైన సాహిత్యం ఆ రోజుల్లో వెలువడ్డాయి. మొత్తం జాతియొక్క చైతన్యం ఆనాడు నిజంగా పొంగులు వారింది.

కాని, నేను నెహ్రూ - టాగూర్ ల రచనలకు మాత్రమే పరిమితమవుతాను. ఇందుకొక కారణం, గ్రంథ విస్తరణను తగ్గించడం; రెండ

వది, వీరిద్దరూ సుప్రసిద్ధులు, సుసంపన్నులు కావడం; మూడవది, లక్ష లాది ప్రజలు సనాతనత్వంనుంచి నూతనత్వానికి చేరుకొనేందుకు జరిగే పోరాటాన్ని సమకాలీన భారతీయు లందరికంటే వీరు సుస్పష్టంగా ప్రతిబింబించడం.

నెహ్రూ, టాగూర్‌లు కేవలం మహా పురుషులే కారు; సామాజిక ఆశయాలకు, ఆకాంక్షలకు వారు చారిత్రక ప్రతినిధులు.

నెహ్రూ ప్రధానంగా తన దేశస్థుల హృదయాల్లోని సిద్ధాంత - రాజకీయ సంఘర్షణను ప్రతిబింబిస్తే, టాగూరు సాంస్కృతిక-సౌందర్య విషయిక సంఘర్షణను ప్రతిబింబించారు. అందుచేత వారు సహజంగా ఒకే చిత్రంయొక్క రెండు పార్శ్వాలు.

ఈ సందర్భంలో మనం రెండు అంశాలను గమనించాలి. నెహ్రూ టాగూర్‌లు యిద్దరూ భారతదేశంయొక్క ప్రాచీన ఔన్నత్యాన్నీ, సాంస్కృతిక విశిష్టతల్నీ గౌరవించారు; కొనియాడారు. నూతనత్వం కొరకు అన్వేషించడంలో వారు గతాన్ని పూర్తిగా త్రోసిరాజనలేదు. కొంతకాలం తర్వాత నెహ్రూ తన "భారత దర్శనం"లో వ్రాసినట్లు, "కాబట్టి, జాతీయ పురోగతి గతాన్ని పునరావృతం చేయడంద్వారా గాని, తిరస్కరించడంద్వారా గాని సాధ్యపడదు. కొత్త విధానాలను మనం తప్పనిసరిగా అనుసరించాలి; కాని పాత విధానాలతో వాటిని సమన్వయ మొనర్చాలి," ("భారత దర్శనం," పేజీ 550).

అందుచేత, వారిద్దరూ భారతదేశ పురోగతికి శృంఖలాలుగా తయారైన పాత సంప్రదాయాలను, విధానాలను విసర్జించాలని భావించారు. అదే సమయంలో, విలువగల వాటిని సుసంపన్న మొనర్చి కొత్తవాటితో సమన్వయ మొనర్చా లన్నారు.

ఈ కృషిలో వా రెంతవరకు విజయం సాధించారో — నిజంగా గొప్ప విజయమే సాధించారు—మనం చర్చించవచ్చు. కాని, శాస్త్రీయ సోషలిస్టులంగా మనం గుర్తించవలసిం దేమంటే, వారలా కృషిచేయడం పూర్తిగా సరియైనది. మార్క్సిజంకూడా గతాన్ని విసర్జించడమూ చేస్తుంది.

సుసంపన్నం మొనర్చడమూ చేస్తుంది. మరో విధంగా దాన్ని అర్థంచేసు కుంటే, అది శాస్త్రంగా ఉండదు; ఊహాచిత్ర మవుతుంది. మార్క్స్ ఎంగెల్స్ చేసిన మహోన్నతసేవ ఏమంటే, వారు సోషలిజాన్ని ఊహా చిత్రంనుంచి శాస్త్రంగా మార్చారు.

మరొక విషయం కూడా మనం గుర్తించాలి. ఆ దశలో కమ్యూ నిస్టుపార్టీ సమకాలీన కమ్యూనిస్టు ఉద్యమాన్ని అభివృద్ధి చేయడంలో విలు వైన సేవ చేసినప్పటికీ, పై విధమైన కృషి ఏదీ చేయలేదు. మనం స్వతంత్ర కార్మికోద్యమాన్నీ, రైతు ఉద్యమాన్నీ నిర్మించాం; వాటిని స్వాతంత్రోద్యమంతో సమన్వయ మొనర్చేటందుకు ప్రయత్నించాం. కాని, భారతదేశంలో అనేక శతాబ్దాలుగా. వేలాది సంవత్సరాలుగా రూపొందుతూన్న అభ్యుదయ, విప్లవకర భారత భావస్రవంతిలో ఒక ఉజ్వల ఘట్టంగా భారత కమ్యూనిస్టుపార్టీ పురోగతిని చిత్రించలేక పోయాం.

అట్టి సంప్రదాయాలు మన జీవిత రంగాలన్నిటిలోను – సాంఘిక రాజకీయ, వైజ్ఞానిక, సాంస్కృతిక, తాత్విక రంగాలు-అనేకం ఉన్నాయి. కాని; మనం వాటిని పరిశోధించలేదు; విశదీకరించలేదు.

నెహ్రూ తరచు భారతదేశ కమ్యూనిస్టుల్ని "మీ దృష్టిలో చరిత్ర 1917తో ప్రారంభ మయిం"దని మందలించేవారు. నిజానికది అన్యాయ మైన, అవాస్తవమైన ఆరోపణ. కాని, కమ్యూనిజంపట్ల చాల సుముఖంగా ఉంటూ, మన అనేక కార్యకలాపాల్ని మెచ్చుకొన్న చాలమంది భారతీ యుల కూడా యీ అభిప్రాయాన్ని కలిగియుండేవారు.

భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం, కమ్యూనిస్టుపార్టీ మరింత వేగంగా అభివృద్ధి చెందడానికి యిదొక ఆటంక మయిందనే వాస్తవాన్ని మన మంగీకరించాలి. ఏ కమ్యూనిస్టుపార్టీ కయినా యిది చేటు తెచ్చేదే. అభ్యుదయ కాముకులంతా వేనోళ్ళ కొనియాడే మహోన్నతమైన ప్రాచీన నాగరికతగల భారతదేశంలో యిది మన పార్టీకి మరింత చేటు తెచ్చింది.

రెండవ విషయ మేమంటే, నెహ్రూ ఎన్నడూ మార్క్సిజాన్ని పూర్తిగా అంగీకరించలేదు; అలా అంగీకరించినట్లు ఆయన చెప్పుకోనూ లేదు; సోవియట్ యూనియన్‌లో జరిగిన అనేక ఘటనలను, సోవియట్ జీవితానికి సంబంధించిన కొన్ని లక్షణాలను నెహ్రూ, టాగూరు లిద్దరు ఖండించారు. అయితే, విభజనరేఖ గీయవలసి వచ్చేటప్పటికి వా రెల్లప్పుడూ సోవియట్ యూనియన్‌నే బలపరిచేవారు; సామ్రాజ్యవాదుల దౌష్ట్యాన్నీ, వక్రభాష్యాల్నీ ఎదుర్కొనేవారు.

అంతేకాదు. నెహ్రూ మార్క్సిజాన్ని ఖండించినప్పుడల్లా "ఆక్స్‌ఫర్డు నన్ను మరీ వెంటాడుతోంది," "బహుశా నాలో వ్యక్తిగత అహంభావం మరీ ఎక్కువగా ఉంది," మొదలైన వాక్యాలను ఆయన జోడించేవారు. తన "స్వీయ చరిత్ర"లో (1936) ఆయనిలా వ్రాసుకున్నారు: "ఈ పుటల్లో ద్యోతక మయేటట్లు, నేను కమ్యూనిస్టు నేమాత్రమూ కాదు. బహుశా నా మూల భావా లిప్పటికే కొంతవరకు 19 వ శతాబ్దంలో వేళ్ళు తన్నుకొని యుండవచ్చు. నామీద ఉదార మానవతా సంప్రదాయం చాల బలమైన ప్రభావం కలిగియుంది; దాన్నుంచి నేను పూర్తిగా విడపడలేకున్నాను. ఈ బూర్జువా ప్రభావం నన్ను వెంటాడుతూ ఉంటుంది. అందుచేత, యిది సహజంగా చాలమంది కమ్యూనిస్టులకు చికాకు కలిగిస్తూ ఉంటుంది." (పేజీ 591).

ఇలాగే, సోవియట్ వ్యవస్థకు సంబంధించిన కొన్ని లక్షణాలను విమర్శించే టప్పుడల్లా ముఖ్యంగా హింసాకాండను గురించీ, వ్యతిరేకాభిప్రాయాలు అణచబడ్డం గురించీ యివి కొన్ని చారిత్రక కారణాలవల్ల అనివార్యమై యుండవచ్చునని నెహ్రూ వివరించేవారు.

ఉదాహరణకు, "స్వీయ చరిత్ర" లో ఆయనిలా వ్రాశారు: "హింసాకాండ పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క సహజ లక్షణం; రష్యాలో కూడ అది ఉన్నప్పటికీ, శాంతి, సహకారం, ప్రజలకు నిజమైన స్వేచ్ఛ అనే పునాదిపై ఒక నూతన వ్యవస్థను నిర్మించడం దాని లక్ష్యం." (పేజీ 461). అంతేకాక, బోల్షివిక్కులు శత్రు మూకలచే చుట్టుముట్టబడి

యుండడంవల్లా, విదేశీ దురాక్రమణయొక్క ప్రమాదంవల్లా ఆర్థికాభివృద్ధిని మరింత త్వరితమొనర్చేటందుకు హింస అవసరమైయుండవచ్చునని ఆయన తెలియజేశారు.

ఆ గ్రంథంలోనే లెనిన్ ఇంకా యిలా వ్రాశారు: "రష్యాలో తరచు ప్రతికక్షులపై దాడులు జరుగుతూ ఉంటాయి. ఇది గర్హనీయంగా కనబడవచ్చు. కాని, సోవియట్ యూనియన్‌లో ఒకవైపు బ్రహ్మాండమైన మార్పులు జరుగుతూండగా మరోవైపు ప్రతికక్షులు వాటిని ఫలప్రదంగా ఎదుర్కొంటూ ఉంటే, ఆ మార్పులన్నీ దారుణంగా విఫలమైయుండేవి. ఈ దృష్ట్యా చూచినప్పుడు మనం వారి చర్యలను అర్థంచేసుకోగలం." (పేజీ 363).

సోవియట్ యూనియన్‌లో ప్రజాస్వామ్యాన్ని గురించి ఆయనిలా చెప్పారు: "మొత్తం సోవియట్ వ్యవస్థ అంతా ఒక విస్తృతమైన సజీవమైన ప్రజాతంత్ర పునాదిపై నిర్మింపబడింది. రష్యా పాశ్చాత్యదేశాల వంటి ప్రజాతంత్రదేశం కాదు. అయినప్పటికీ, ప్రజలు ఏదేశంలోనూ లేనంత ఎక్కువ ప్రజాస్వామ్యాన్ని ఆ దేశంలో అనుభవిస్తున్నారు." (లక్నో కాంగ్రెసులో అధ్యక్షోపన్యాసం — 1936). ఆ తర్వాత, సోవియట్ ప్రజాస్వామ్యం ఎలా అమలు జరుగుతుందో ఆయన వర్ణించారు. సిడ్నీవెబ్, బియాట్రిస్‌వెబ్ తమ "సోవియట్ కమ్యూనిజం"లో వర్ణించిన విధంగా దాన్ని వర్ణించారు.

ఆ తర్వాత జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభలో బహిర్గత మొనర్చబడిన ఉదంతాల దృష్ట్యా, సోవియట్ యూనియన్ పట్ల నిస్సందేహంగా అభిమానంగల నెహ్రూ మొదలైన వారి విమర్శనలకు, ఖండనలకు కొంత ఆధారం ఉందని బోధపడుతుంది. వారి విమర్శనలు సోవియట్ వ్యతిరేక విమర్శనలు కావు; విప్లవ విద్రోహుల హింసను అణచడానికి విప్లవ ప్రతిహింస అవసరమని వారు గుర్తించక పోనూలేదు.

కమ్యూనిస్టుల పిడివాదాన్నీ, అసహనం మొదలైన లక్షణాలనూ కూడ నెహ్రూ విమర్శించారు. కాని, వెంటనే వారినిలా ప్రశంసించారు: "నే నెల్లప్పుడూ వారి ధైర్య సాహసాలను, త్యాగశక్తిని మెచ్చుకుంటాను...వా రనుభవించే బాధల్లో ఒక విషాద గ్రస్తమైన ఔన్నత్యం కనిపిస్తుంది... ఓ సప లక్ష్యాన్ని సాధించేందుకై పురోగమించే మహా సైన్యంలో తానొక భాగమని కమ్యూనిస్టు భావిస్తాడు. అంతేకాక, చరిత్రతోబాటు తానుకూడా అడుగువేస్తూ, కదంతొక్కుతూ పురోగమిస్తున్నాననే చైతన్యం అతని కుంది." (స్వీయ చరిత్ర — పేజీ 592).

ఇదీ నెహ్రూ దృక్పథం. అనేకవిషయాల్లో ఆయన అడుగు తడబడుతూ ఉండేది. ఉదార వాదంలోను, గాంధీవాదంతోను పూర్తిగా తెగతెంపులు చేసుకోగల శక్తి ఆయనకు లేదు. అయితే, ఆయన చేసిన అఖండసేవ ఎందులో ఉందంటే, సామ్రాజ్యవాదానికీ, ఫాసిజానికీ, దేశం సనాతన శక్తులకూ వ్యతిరేకంగా అభ్యుదయం, ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యంతరపున ఆయన దృఢంగా నిలబడ్డారు; చరిత్రను శాస్త్రీయంగా అవగాహన చేసుకొనేందుకు, జీవితాన్ని అర్థవంత మొనర్చుకొనేందుకు తోడ్పడే తత్వశాస్త్రం మార్క్సిజ మొక్కటేనని ఆయన అన్నారు.

ఈ విధంగా వేలాది — లక్షలాది భారత యువకులు గాంధీవాదం, జాతీయవాదంయొక్క పరిమితుల్ని అధిగమించి సోషలిజాన్ని స్వీకరించేందుకు నెహ్రూ ఎంతగానో తోడ్పడ్డారు.

ఇక మనం నెహ్రూ అన్వేషణ ఎలా ప్రారంభమయిందో, అది యీ నూతన దృక్పథాని కెలా దారితీసిందో తెలుసుకుందాం.

నెహ్రూ మొట్టమొదట 1927 లో సోవియట్ యూనియన్ వెళ్ళారు. అప్పటికి యుద్ధంతోను, అంతర్యుద్ధంలోను ఛిన్నాభిన్నమైయున్న రష్యన్ ఆర్థికవ్యవస్థ అంతంత మాత్రంగానే కోలుకొంది. మొదటి పంచవర్ష ప్రణాళిక సైతం యింకా రూపొందింపబడలేదు. సోవియట్ యూనియన్‌లో ఆయన మూడు నాలుగు రోజులే ఉన్నప్పటికీ, అక్కడి పరిణామాలు ఆయన్ను బ్రహ్మాండంగా ఉత్తేజపరచాయి. భారత

దేశానికి తిరిగివచ్చాక ఆయన "సోవియట్ రష్యా" అనే పుస్తకం వ్రాశారు. అందులో యిలా చెప్పారు :

"రష్యా...ఎందుచేత మనలో ప్రత్యేక ఆసక్తిని కలిగిస్తుందంటే, యిదివరకటి - యిప్పటి రష్యా దేశ పరిస్థితులకూ, భారతదేశ పరిస్థితులకూ పెద్దగా వ్యత్యాసం లేదు. రెండూ చాల పెద్ద వ్యవసాయ దేశాలు; రెండిటి పారిశ్రామికాభివృద్ధి ప్రారంభ దశలోనే ఉంది. రెండూ దారిద్ర్యాన్నీ, నిరక్షరాస్యతను ఎదుర్కోవలసి యుంది. ఈ సమస్యలను రష్యా సంతృప్తికరంగా పరిష్కరించుకో గల్గితే, భారతదేశంలో మన కృషి సులభమవుతుంది."

కాబట్టి భారతదేశ సమస్యలకు పరిష్కార మార్గం చూపగలిగేదిగా సోవియట్ ప్రయోగం ఆయనలో ఆసక్తిని కలిగించింది. ఆ విధంగా నెహ్రూ రష్యాను మెచ్చుకోడం ప్రారంభమయింది.

ఈ దశలో నెహ్రూ సోషలిజాన్ని గురించీ, సోవియట్ యూనియన్ గురించీ మరింత క్రమబద్ధంగా అధ్యయనం చేయడం ప్రారంభించారు. ఈ దశను గురించి తర్వాత వ్రాసిన (1945) "భారత దర్శనం"లో ఆయన యిలా తెలియజేశారు :

"మార్క్స్, లెనిన్‌ల రచనలు నా మనస్సుమీద బలమైన ప్రభావం కలుగజేశాయి. చరిత్రను సమకాలీన ఘటనలను కొత్త వెలుగులో చూచేటందు కవి నాకు సహాయపడ్డాయి. చరిత్ర సామాజికాభివృద్ధి అనే మహా స్రవంతికి ఒక అర్థం ఉన్నట్లు, పూర్వాపరా లున్నట్లు నాకు తోచింది. భవిష్యత్తుకూడా అగమ్యగోచరం కాదనిపించింది. అంతేకాక, సోవియట్ యూనియన్ విజయాలుకూడా అద్భుతమైనవిగా కనిపించాయి. సోవియట్ యూనియన్ మానవ సమాజాన్ని ఎంతో ముందుకు లంఘింపజేసిందనీ, ఆరిపోని అమరజ్యోతిని అది వెలిగించిందనీ నేను దృఢంగా విశ్వసించాను. ప్రపంచం ఏ నూతన నాగరికతవైపు పురోగమించవలసి యుందో ఆ నాగరికతకు అది పునాదులు నిర్మించిందనికూడా నేను భావించాను." (పేజీ 29)

ఒక సంవత్సరం తర్వాత మరొక సంవత్సరం గడిచింది. కొత్తగా నాటబడిన బీజం మొలకెత్తింది. నెహ్రూ వెల్లడించిన నూతన అభిప్రాయాలు అంతకంతకు స్పష్టమైన, నిశితమైన రూపం ధరించాయి. 1936లో లక్నో కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహిస్తూ, ఆయన దృఢ విశ్వాసంతో యిలా ఉపన్యసించారు :

"ప్రపంచ సమస్యలకు, భారతదేశ సమస్యలకు సోషలిజం మాత్రమే పరిష్కార మార్గమని నేను దృఢంగా నమ్ముతున్నాను. నేనీ మాటను అస్పష్టమైన అర్థంలో, జీవకారుణ్య దృష్టితో ఉపయోగించడం లేదు; శాస్త్రీయమైన అర్థంలో, ఆర్థిక పరిణామాల దృష్ట్యా ఉపయోగిస్తున్నాను, అయితే సోషలిజం ఆర్థిక సిద్ధాంతం మాత్రమేకాదు; జీవితానికి సంబంధించిన ఒక తత్వశాస్త్రం అది. అందువల్లకూడా అది నన్ను ఆకర్షించింది. భారత ప్రజలు నేడనుభవిస్తున్న దారిద్ర్యం, నిరుద్యోగం, బానిసత్వం సోషలిజంద్వారా గాని నిర్మూలింపబడవు. అనగా, మన రాజకీయ - సామాజిక వ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పులు రావాలన్నమాట; భూమిమీద, పరిశ్రమలమీద పెత్తనం చెలాయించే స్వార్థపరుల ప్రయోజనాలు అంతమవాలన్నమాట; ఫ్యూడల్ నిరంకుశ సంస్థానాలన్నీ కూలిపోవాలన్నమాట. మరో విధంగా చెప్పాలంటే, సొంత ఆస్తి విధానాన్ని రద్దుచేయాలి, కొద్దిగా పరిమితులు విధిస్తూ; ప్రస్తుతం అమల్లో ఉన్న లాభాల ఆర్జన పద్ధతికి బదులు సహకార కృషి అనే ఉన్నత ఆశయాన్ని అమలు జరపాలి. ఈ మార్పులు ఉత్తరోత్తరా మన ప్రవృత్తులను, అలవాట్లను, కోర్కెలనుకూడా మార్చివేస్తాయి. క్లుప్తంగా చెప్పాలంటే నేటి పెట్టుబడిదారీ వ్యవస్థకు భిన్నమైన ఒక నూతన నాగరికత యిది.

"ఈ కొత్త నాగరికతయొక్క లక్షణాలను మనం సోవియట్ భూభాగంలో రేఖా మాత్రంగా చూడవచ్చు. అక్కడ జరిగిన కొన్ని ఘటనలు నాకెంతో బాధ కలిగించినమాట వాస్తవమే. వాటితో నేను ఏకీభవించను. అయితే, అక్కడ ఒక నూతన వ్యవస్థ ఒక నూతన నాగరికత

అద్భుతంగా, ఆశ్చర్యంగొల్పే విధంగా వికసిస్తోంది. మన దుఃఖభాజన మైన ప్రపంచాని కది కొత్త ఆశలు కలిగించేదిగా నేను దాన్ని పరిగణి స్తాను. మానవజాతి భవిష్యత్తు ఆశాపూరితంగా ఉందంటే, అందుకు చాల వరకు కారణం సోవియట్ యూనియనూ, అది సాధించిన విజయాలూను. ముందు ముందు ప్రపంచ విపత్తు ఏదీ సంభవించకపోతే, యీ నూతన నాగరికత యితర దేశాలకు కూడా వ్యాపించి తీరుతుందనీ, పెట్టుబడిదారీ విధానంచే పెంచి పోషింపబడుతున్న యుద్ధాలు, సంఘర్షణలు అంత మవుతాయనీ నేను నమ్ముతున్నాను." ("సోషలిజం గురించి నెహ్రూ," పేజీ 66–67)

ఆ ఉపన్యాసంలోనే నెహ్రూ ఇంకా యిలా చెప్పారు: నేను స్వాతంత్ర్యం కొరకు పాటుపడుతున్నానంటే, నాలోని జాతీయత విదేశీ పాలనను సహించదు. దానికొరకు నేను మరింతగా పాటుపడ్డానికి కారణం పెద్ద సామాజిక, ఆర్థిక మార్పులకు అది ఒక సోపానం."

లక్నో మహాసభ జరిగిన ఒక సంవత్సరం లోపల జాతీయ కాంగ్రెసు ఆనాటి రాష్ట్ర శాసన సభలకు జరిగిన ఎన్నికల్లో బ్రహ్మాండ మైన విజయాలు సాధించింది. ఆ శాసన సభల్లో కాంగ్రెసు మంత్రి వర్గాల నేర్పరపరాదని నెహ్రూ గట్టిగా అభిప్రాయ పడ్డారు. కారణం, అసలు అధికారమంతా బ్రిటిష్‌వారి చేతుల్లో ఉండగా కాంగ్రెసు మంత్రి వర్గాలు సాంఘిక. ఆర్థిక అభ్యుదయానికి సాధనాలుగా ఉండజాలవు. మొట్ట మొదట మనం స్వాతంత్ర్యం సాధించుకోవాలని ఆయన వాదించారు.

అయినా, నెహ్రూ భవిష్యత్తులో ఏర్పడబోయే స్వతంత్ర భారతం ఆర్థికంగా పురోగమించడానికి మార్గాలేమిటని ఆలోచించసాగారు. ఆ సంద ర్భంలో ఆయ నిలా చెప్పారు :

"అభివృద్ధిని సాధించాలని మనం తహతహలాడాం. అనేక విష యాల్లో బాగా అభివృద్ధి చెందిన యితర దేశాల్ని అనుకరించాలని ఉవ్వి ళ్ళూరాం. అమెరికాను గురించి ఆలోచించాం. కొన్ని ప్రాచ్య దేశాలను

గురించి కూడా ఆలోచించాం. (జపాన్‌ని ఉద్దేశించి చెప్పినమాట అయి వుండాలి—రచయిత). కాని, అన్నిటికంటే సోవియట్ యూనియన్ ఉదాహరణ మనముందు ఉంది. అది రెండు దశాబ్దాల స్వల్పకాలంలో, యుద్ధాలు - అంతర్యుద్ధాల మధ్య, అధిగమించ శక్యంకానట్లున్న చిక్కులెన్నిటినో అధిగమించి. అద్భుతంగా పురోగమించింది. విద్య సంస్కృతి, వైద్య సహాయం, శరీర దారుఢ్యం, జాతుల సమస్యకు పరిష్కారం—వీటన్నిటిలో సోవియట్ యూనియన్ సాధించిన పురోగతిని చూచి అందరూ ఆశ్చర్యచకితులయారు. పాత ప్రపంచపు శిధిలాలమీద ఒక కొత్త ప్రపంచాన్ని నిర్మించేందుకు ఆ దేశంలో జరుగుతున్న అపార కృషి అనన్య సామాన్యం." (భారత దర్శనం," పేజీ 394)

భారతదేశపు ప్రధాన సమస్యల పరిష్కారంలో రష్యా విప్లవం, సోవియట్ యూనియన్, మార్క్స్ - లెనిన్‌ల రచనలు వీటి స్థానమేమిటో పైన వివరించాను. ఇక యిప్పుడు భారత స్వాతంత్ర్యోద్యమానికీ ప్రాచ్యదేశాల వలస విముక్తి ఉద్యమాలకూ గల సంబంధం మన స్వాతంత్ర్యోద్యమానికి పాశ్చాత్య దేశాల్లో తలఎత్తిన ఫాసిస్టు ప్రమాదానికీ గల సంబంధం ఎలాంటిదో కూడ తెలుసుకుందాం.

ఈ రెండు సమస్యలమీద తన అభిప్రాయాలూ, జాతీయ కాంగ్రెసు అభిప్రాయాలూ ప్రధానంగా 1927 తర్వాతనే ఎలా రూపొందనారంభించాయో నెహ్రూ తన "భారత దర్శనం"లో తెలియజేశారు. "అన్నిచోట్ల రాజకీయ, ఆర్థిక సామ్రాజ్యవాద నిర్మూలన, స్వతంత్ర జాతుల మధ్య అన్యోన్య సహకారం అనే ప్రాతిపదికపై కాంగ్రెసు క్రమంగా తన విదేశాంగ విధానాన్ని అభివృద్ధి చేసుకొంటూ వచ్చింది." (పేజీ 441)

అంతేకాక, మనం ప్రత్యక్షంగా గమనించవలసిన విషయమేమంటే, ఒకవైపు బ్రిటన్ మొదలైన సామ్రాజ్యవాద ప్రభుత్వాలు జాతీయ విముక్తి ఉద్యమాలను అణచేందుకు సర్వవిధాల ప్రయత్ని

స్తూంటే, రెండో వైపు రష్యా వాటిని బలపరుస్తోందన్న విషయం అంత కంతకు అధికంగా గుర్తింపబడుతూ వచ్చింది.

"ప్రపంచ పరిస్థితి ఒక పెద్ద సంఘర్షణకు దారితీసేటట్లు కనబ డింది. ఒక వైపు యూరపియన్ జాతుల గ్రూపుకు నాయకత్వం వహించే బ్రిటన్-ఫ్రాన్స్‌లు, మరొకవైపు కొన్ని ప్రాచ్య జాతులతో కలిసి సోవి యట్ రష్యా...

"ఈ పరిస్థితుల్లో, భారత ప్రజాభిప్రాయం అనివార్యంగా సోవి యట్ రష్యా. ప్రాచ్యజాతుల పక్షాన ఉంది... చైనా విప్లవంయొక్క విజ యాలు చూచి, భారత స్వాతంత్ర్యం సమీపిస్తుందనీ. ఆసియాలో యూరపు రాజ్యాల దురాక్రమణ అంతంకాబోతుందనీ భావించి మన ప్రజలు ఆ విజయాలను ఉత్సాహంతో కొనియాడసాగారు. డచ్చి తూర్పు ఇండియా దీవుల్లోను, ఇండోచైనాలోను, పశ్చిమ ఆసియా దేశాల్లోను, ఈజిప్టులోను పెల్లుబుకుతూన్న జాతీయోద్యమాలపట్ల మనం ఆసక్తిని ప్రదర్శించాం." (పేజీ 442).

రోజులు గడిచేకొద్దీ ఈ భావాలు స్పష్టమైన, నిశితమైన రూపం ధరించాయి. 1933 చివరి రోజుల్లో నెహ్రూ "భారతదేశం ఎటు నడు స్తుంది?" అనే పుస్తకంలో యిలా వ్రాశారు :

"భారతదేశ సమస్య ఆసియా సమస్యల్లో ఒకటి; ప్రపంచ సమ స్యలతో అది ముడిపడియుంది. ఇతర సమస్యలనుంచి దాన్ని మనం వేరు చేయలేం. భారతదేశంలో జరిగే పరిణామాలు ప్రపంచంమీద ప్రభావం కలుగజేస్తాయి. అలాగే ప్రపంచ ఘటనలు భారతదేశ భవిష్యత్తును మారు స్తాయి. నిజానికి నేడు మనముందు మూడు ప్రధానమైన ప్రపంచ సమస్య లున్నాయి. అవి : పెట్టుబడిదారీ విధానంయొక్క భవిష్యత్తు; అంటే యూరపు-అమెరికాల భవిష్యత్తు; భారతదేశ భవిష్యత్తు; చైనా భవి ష్యత్తు. ఇవి అవినాభావ సంబంధంగల సమస్యలు. ఈ రోజున యావ త్ప్రపంచంలో పీడిత ప్రజల విముక్తికై జరిగే మహాపోరాటంలో భారత

ప్రజల పోరాటం ఒకభాగం." ("సోషలిజం గురించి నెహ్రూ," పేజీ 23.)

ఈలోగా జర్మనీలో హిట్లరు అధికారాన్ని హస్తగతం చేసుకోడంతో, ప్రపంచాన్ని ఫాసిస్టు ప్రమాదం ఆవరించింది. ఇది యావత్ప్రపంచంలోని జాతీయ విముక్తి ఉద్యమాలకు, ప్రపంచ శాంతికి, ప్రజాస్వామ్యానికి ఎంత ముప్పు తెచ్చిపెడుతుందో నెహ్రూ వెంటనే గ్రహించారు. ఫాసిజాన్ని ఆయన అతి నిశితంగా, అతి తీవ్రంగా ఖండించారు; 1933, డిసెంబరు 18 తేదీని పత్రికల కిచ్చిన ఒక ప్రకటనలో ఆయ నిలా చెప్పారు:

"నేడు ప్రపంచంముందు ప్రధానంగా రెండే రెండు ప్రత్యామ్నాయాలున్నాయని నేను గట్టిగా నమ్ముతున్నాను ఒకటి. ఏదో ఒకరూపంలో కమ్యూనిజం, రెండు, ఏదో ఒక రూపంలో ఫాసిజం. నేను మొదటి దాన్నే, అనగా కమ్యూనిజాన్నే ఎంచుకుంటాను. ఫాసిజాన్నే నేను తీవ్రంగా ద్వేషిస్తాను. నిజానికి, ఫాసిజం అంటే నేటి పెట్టుబడిదారీ వ్యవస్థ ఏదో ఒక విధంగా తన్ను తాను రక్షించుకోడానికి చేసే అతి క్రూరమైన, అమానుషమైన ప్రయిత్నం తప్ప మరొకటి కాదు. ఫాసిజానికీ; కమ్యూనిజానికీ మధ్యే మార్గమంటూ లేదు. రెండింటిలో ఏదో ఒకదాన్ని మనం ఎంచుకోవాలి. నేను కమ్యూనిస్టు ఆదర్శాన్ని ఎంచుకుంటాను ... కమ్యూనిజంయొక్క మూల సిద్ధాంతం, చరిత్రను గురించిన దాని వ్యాఖ్యానం సరియైనవేనని నేను అభిప్రాయపడుతున్నాను." ("సోషలిజం గురించి నెహ్రూ," పేజీ 49).

ఈ భావాలను అనేక సభలద్వారా, వ్యాసాలద్వారా యావద్భారత దేశంలో వ్యాపింపజేయడానికి నెహ్రూ అమితోత్సాహంతో కృషిచేశారు. 1936 ప్రారంభంలో లక్నో కాంగ్రెసు మహాసభకు, 1936 చివర ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహిస్తూ యిచ్చిన ఉపన్యాసాల్లోను, యింకా అనేక ప్రసంగాల్లోను ఆయన నొక్కిచెప్పిన అంశాలివి : ప్రపంచం రెండు శిబిరాలుగా విభజింపబడింది. ఒక శిబిరంలో

ఫాసిజం, సామ్రాజ్యవాదం; మరొక శిబిరంలో సోషలిజం, జాతీయ స్వాతంత్ర్యం. భారతదేశం ప్రపంచంలోని పురోగమి శక్తులతో చేతులు కలపాలి.

ప్రపంచ సోషలిస్టు ఉద్యమ ప్రయోజనాలూ, జాతీయస్వాతంత్రోద్యమ ప్రయోజనాలూ ఒకటేనని గుర్తించడంతో, భారతదేశం స్వాతంత్ర్యంకొరకు జరిపే పోరాటానికీ, సామాజిక విముక్తికై జరగవలసిన పోరాటానికీ గల అవినాభావ సంబంధాన్ని గురించి నెహ్రూ వెల్లడి చేసిన అభిప్రాయాలు మరింత నిశితరూపం ధరించాయి. "భారతదేశం ఎటునడుస్తుంది ?" అనే పుస్తకంలో ఆయ నిలా వివరించారు:

"భారతదేశానికి స్వాతంత్ర్యం ఎందువల్ల అవసరమంటే, భారత ప్రజానీకంపైన, మధ్య తరగతి ప్రజలపైన యిప్పుడున్న భారం మోయ లేనంతగా ఉంది. ఆ భారాన్ని తగ్గించాలి. లేదా పూర్తిగా తొలగించాలి. ఆ భారం ఏ మేరకు తొలగుతుందో ఆ మేరకు స్వాతంత్ర్యం సిద్ధించిందన్నమాట. విదేశీ ప్రభుత్వపు స్వార్థ ప్రయోజనాలవల్లా, దేశంలోనూ బయటా ఉండే కొన్ని వర్గాల స్వార్థ ప్రయోజనాలవల్లా ఆ భారం యింత భరించరానిదిగా ఉంది...అత్యంత చాతుర్యం గల ఒక ప్రభుత్వం విదేశీ ప్రభుత్వపు స్థాన మాక్రమించి, యీ స్వార్థపర వర్గాల దోపిడీని యధా ప్రకారంగా కొనసాగనిస్తే, అది స్వాతంత్ర్యంయొక్క ఛాయ అనికూడా అనిపించుకోదు.

"నాయకులు, వ్యక్తులు వస్తూ ఉంటారు, వెళ్తూ ఉంటారు. వారు అలసిపోవచ్చు, లేదా నీరసించిపోవచ్చు. వారు రాజీ చేసుకోవచ్చు, లేదా ద్రోహం చేయవచ్చు. కాని, పీడింపబడే, బాధింపబడే ప్రజలు పోరాటం కొనసాగించక తప్పదు. ఎందుచేతంటే, వారిని ముందుకు లాక్కు వెళ్ళేది ఆకలి. వారికి స్వరాజ్యమంటే, దోపిడీనుంచి విముక్తి అంటే ఒక చక్కని పత్రంమీద వ్రాయబడిన రాజ్యాంగచట్టంకాదు...

"మన లక్ష్యం మానవ శ్రేయస్సా, లేక కొన్ని వర్గాల భోగభాగ్యా

లను, కొన్ని గ్రూపుల స్వార్థ ప్రయోజనాలను రక్షించడమా? మనలో ప్రతి ఒక్కరం యీ ప్రశ్నకు స్పష్టంగా, సిద్ధంగా జవాబు చెప్పాలి. మొత్తం జాతి శ్రేయస్సు, కోట్లాది ప్రజల శ్రేయస్సు ప్రమాదంలో పడి నప్పుడు మనం నీళ్ళు నమలడానికి వీల్లేదు.

“కాబట్టి, భారతదేశంయొక్క తక్షణ ఆశయం, భారత ప్రజల్ని దోపిడీనుంచి విముక్తి చేయడం. రాజకీయంగా దీని అర్థం సంపూర్ణ స్వాతంత్ర్యం, బ్రిటన్‌తో సంబంధాన్ని తెగతెంపులు చేసుకోడం. అంటే, సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని కూలద్రోయడ మన్నమాట. ఆర్థికంగాను, సామాజికంగాను దీని అర్థం, ప్రత్యేక వర్గ సౌకర్యాలన్నిటినీ, స్వార్థ ప్రయోజనాలన్నిటినీ నిర్మూలించడం. ఇందుకోసమే యావత్ప్రపంచం పోరాడుతుంది. భారతదేశంకూడా యిందుకై పోరాడగలదు. భారత స్వాతంత్ర్య పోరాటం ప్రపంచ ప్రజల పోరాటంతో కలిసి పురోగమించడానికి మార్గం యిదే.” (సోషలిజం గురించి నెహ్రూ,” పేజీ 25).

నెహ్రూ మనస్సు భారతదేశపు ఆర్థిక — రాజకీయ సమస్యలపై కేంద్రీకరింపబడితే, రవీంద్రనాథ్‌టాగూరు భారత సామాజిక వ్యవస్థ సాంస్కృతికంగాను, ఆధ్యాత్మికంగాను పతనావస్థలో ఉన్నందుకు వ్యథ చెందారు. ఈ పతనావస్థకు కారణాలు, మతంవల్లా కులవ్యవస్థవల్లా దాపురించిన సామాజికవిచ్ఛిత్తి; పైకులాలకూ క్రిందికులాలకూ మధ్య అభేద్యమైన అడ్డుగోడ లేర్పడ్డం; కరడుకట్టిన కులాభిమానాలవల్ల, కుల కట్టుబాట్లవల్ల, కులాచారాలవల్ల స్వతంత్ర ఆలోచనలు శృంఖలాబద్ధం కావడం; ఆ విధంగా సృజింపబడ్డ పాడు పరిసరాలు సమానత్వం, సోదరత్వం అనే ఆయన ఆశయాల సిద్ధి కొనసాగవలసిన పురోగతిని నిరోధించాయి.

ఈ తరతరాల శృంఖలాలను ఛేదించి తీరాలని టాగూరు దృఢంగా సంకల్పించుకోడం కొత్త విషయం కాదు. ఇది బ్రహ్మ సమాజంనుంచి ఆయనకు లభించిన వారసత్వం. కాని, తన లక్ష్య సాధనకై ఆయన జీవితాంతం కృషి చేసినా ప్రయోజనం లేకపోయింది. తన ఆత్మను బంధించి

యుంచిన శృంఖలాలను ఆయన ఛేదించలేకపోయారు. ఒక్క సోవియట్ యూనియన్‌లోనే మానవుడు మహోన్నత శిఖరాలను చేరుకొనేందుకు పురోగమించడం ఆయన చూచారు. అంతవరకు అది ఆయన స్వప్న జగత్తులో మాత్రమే ఉండేది. సోవియట్ యూనియన్ పర్యటించి తిరిగి వచ్చాక ఆయన వ్రాసిన వ్యాసాల్లోను, తన లేఖల్లోను కలలు నిజమవుతూన్నందుకు సంతోషం ప్రకటించడం కనిపిస్తుంది.

పైగా, టాగూరు రాజకీయాలతో బొత్తిగా సంబంధంలేనివాడు కాదు. ఐశ్వర్యాన్నంతా కొద్దిమంది గుప్పెట్లో పెట్టుకోవడం వల్ల నిజమైన ప్రజాస్వామ్యం ఎలా అణచివేయబడుతుందో ఆయన గ్రహించకపోలేదు. అంతకు చాల సంవత్సరాల క్రిందటే ఆయన పరాధీన దేశాల్లో సామ్రాజ్యవాదం నిర్వహిస్తున్న పాత్రను స్పష్టంగా చూచారు. మూఢ విశ్వాసాలతో, అమానుష ప్రవృత్తులతో నిండియున్న పాత సామాజిక వ్యవస్థను కూలద్రోయడానికి భారతదేశం సాగిస్తున్న కృషికి పాశ్చాత్య దేశాలు తోడ్పడతాయనే భ్రమ ఆయనకు లేదు. 1904 లోనే, సామ్రాజ్యవాదాన్ని గురించి ఆయ నిలా వ్రాశారు:

"సామ్రాజ్యవాదం ఏ పాపమూ ఎరుగని టిబెట్‌లో యుద్ధం చేయడానికి బయల్దేరుతుంది. మనకు గల 'హక్కు' మాత్రం ఆ యుద్ధానికైన ఖర్చులన్నీ చెల్లించడం. సోమాలీలాండ్‌లో వారు విప్లవం జరక్కుండా నివారించాలి. మన 'హక్కు' మాత్రం అందుకై ప్రాణాలర్పించడం. సామ్రాజ్య విస్తరణకై ఉష్ణ దేశాల్లో వారు పెద్ద పెద్ద తోటలు పెంచాలి. మన 'హక్కు' చౌక కూలీలను సప్లై చేయడం." (హిరేన్ ముఖర్జీ వ్రాసిన "ఆయనే ఒక మహాకావ్యం" అనే గ్రంథంలో ఉటంకింపబడిన టాగూరు వాక్యాలు——పేజీ 115).

ఏ రాజకీయ ఆందోళన కారుడూ భారతదేశంలో బ్రిటిష్ పాలనను యింత నిశితమైన వ్యంగ్యంతో ద్వేషించలేడు.

మరొకచోట, "సహకారం" అనే శీర్షికతో 1921 లో వ్రాసిన ఒక బెంగాలీ వ్యాసంలో ఆయ నిలా వ్రాశారు :

"పెట్టుబడిదార్లకూ, కార్మికులకూ మధ్య పెద్ద అగాధం ఉన్న చోట ప్రజాస్వామ్యం అడుగడుగునా కుంచింపబడక మానదు. ఎందుచేతంటే, ధనం అన్ని విధాలైన అధికారానికి ప్రధాన సాధనం...ఈ విధంగా, అమెరికాలో అన్ని స్థాయిలలోను ధనం అధికారం చెలాయిస్తోందనడానికి అనేక ఉదాహరణలు మనకు కనిపిస్తాయి. అక్కడ ప్రజాభిప్రాయాన్ని తీర్చిదిద్దేది ధనమే. అంతేకాదు. ఐశ్వర్యవంతుల విరోధులను అణచివేసేందుకు కూడా ధనపిశాచమే సాధనంగా ఉంది. ఏ విధంగా చూచినా, దాన్ని మనం ప్రజల పరిపాలనగా పరిగణించలేం." (పై గ్రంథంనుంచే)

ఆ తర్వాత, 1929 లో టాగూరు అదే శీర్షికతో మరో వ్యాసం వ్రాశారు. అందులోని వాక్యాలు :

"...ఈ రోజున ఐశ్వర్యవంతులు స్వార్థరహితులుగా ఉండడం యింకా దుర్లభం (రచయిత యిదివరకటి భారతదేశ పరిస్థితులతో పోల్చి చెబుతున్నమాట—రచయిత), అయినా, యిదీ మంచికే వచ్చింది; ప్రజానీకం యీ రోజున తమ సహజ శక్తిని అభివృద్ధి చేసుకోవాలి. అప్పుడే దానికి శాశ్వతమైన విలువ ఉంటుంది.

"...సమాజాన్ని ఐశ్వర్యమనే మహాభారం నుంచి విముక్తి చేయవలసింది ఐశ్వర్యవంతులు కాదు; పేద ప్రజలు...పేదల బలహీనతవల్ల నాగరికత యింతకాలంగా బలహీన స్థితిలో, అసమగ్రంగా ఉండిపోయింది, వారు దీన్ని సరిదిద్దాలి. ఇందుకు మార్గం అధికారాన్ని హస్తగతం చేసుకోడం." (పై గ్రంథంనుంచే — పేజీ 120).

టాగూరు తాను నిర్మించుకొన్న ఒక ఊహా జగత్తులో, కావ్య జగత్తులో నివసించారనీ, బాధాతప్తమైన నిరుపేదల జీవితానికి ఆయన దూరంగా ఉన్నారనీ, వాస్తవికతతో సంబంధంలేని శాంతి సందేశాన్ని, ప్రేమ సందేశాన్ని ఆయన బోధించారనీ భావించేవారు, లేదా ఉద్దేశపూర్వకంగా అలా చిత్రించేవారి మాటలు నమ్మి ఆ విధంగా అభిప్రాయ

పడేవారు టాగూర్‌ని ఏమాత్రం అర్థంచేసుకోలేదనే చెప్పాలి. పీడితుల పట్ల, బాధితులపట్ల ఆయన వ్యక్తం చేసిన అభిమానం వారి బాధలను అర్థంచేసుకోడం చేతనే కలగలేదు. ఆయన దృఢంగా వారి తరపున నిల బడ్డారు; వారిని అణచియుంచిన వారిని వ్యతిరేకించారు.

1930 లో సోవియట్ యూనియన్‌కి వెళ్ళిన టాగూరు యిట్టి టాగూరే.

రష్యానుంచి వ్రాసిన ఒక జాబులో (1930) ఆయ నిలా తెలియ జేశారు :

"ఇప్పుడు నేను రష్యాలో ఉన్నాను. నేనిక్కడికి వచ్చియుండక పోతే, నా జీవితయాత్ర అసమగ్రమయి యుండేది...నాకు మొట్టమొదటి యీ దేశంలో తట్టిన విషయ మేమంటే : వీరి శక్తి ఎంత నమ్మశక్యం కానంత గొప్పది : ఒక నూతన ప్రపంచాన్ని నిర్మించేందుకు వీరు కృత నిశ్చయులై యున్నారు. కాలాన్ని వారు ఏమాత్రం వృధాచేయలేరు ఎందుచేతంటే, మొత్తం ప్రపంచమంతా వారికి వ్యతిరేకంగా నిలిచి యుంది...

"నేను స్వయంగా నా కళ్ళతో యీ విషయాలను చూచియుండక పోతే. అజ్ఞానంలోనూ అవమానాల్లోనూ కృంగిపోయిన లక్షలాది ప్రజల్ని అక్షరాస్యులుగా చేయడమేకాక, మానవ ఔన్నత్యాన్ని కూడా వారికి ప్రసాదించడం సాధ్యమని నమ్మియుండేవాణ్ణి కాదు. వారు తమకోసం తాము ఎంత గట్టిగా కృషి చేస్తున్నారో, యితర జాతులకోసం కూడా అంత గట్టిగానూ కృషి చేస్తున్నారు. అయినప్పటికీ, సంకుచితులైన మత స్థులు వీరిని మత విశ్వాసంలేని వారంటున్నారు...

"ఇట్టి మహాత్కార్యం ఎలా సాధ్యపడింది? నా మనస్సుకు తోచిన జవాబేమంటే, యిక్కడ దురాశ అనే అడ్డుగోడ లేదు." (పై గ్రంథం నుంచే - పేజీ 122).

మరొకచోట యిలా వ్రాశారు :

"సోవియట్లు సాధారణ విద్య, సంస్కృతి ద్వారా మానవుని సహజ శక్తుల్ని పెంపొందించేందుకు ఎడతెగని కృషి చేస్తున్నారు. ఫాసిస్టుల మాదిరిగా వాటిని అణచియుండటంలేదు, (పై గ్రంథంనుంచే - పేజీ 123).

పీడితులకు, పీడకులకు కూడ సమానంగా ప్రేమ సందేశమిచ్చే పలాయన వాదుల వ్యాఖ్యానమిలా ఉంటుందా?

టాగూరు అక్కడి బలప్రయోగాన్నీ, నిర్బంధ చర్యలనూ, నియంతృత్వాన్నీ ఖండించినమాట నిజమే. అయినప్పటికీ, సోవియట్ యూనియన్‌లో అనుసరింపబడిన పద్ధతుల్ని గురించి ఆయన వ్యక్తం చేసిన అభిప్రాయ మేమిటో తెలుసుకుందాం.

"రష్యా దేశ పరిస్థితి యుద్ధకాలాన్ని పోలియుంది. స్వదేశంలోని విదేశాల్లోని శత్రువులు ఆ దేశంపై దాడిచేశారు. మొత్తం ప్రయోగాన్నే విచ్ఛిన్నం చేసేటందుకు వారు కుట్రలు పన్నుతున్నారు. అందుచేత. వారు తమ సౌధంయొక్క పునాదుల్ని సాధ్యమైనంత త్వరలో పటిష్టం చేసుకోవలసి యుంది. కాబట్టి, హింసను ఉపయోగించడంలో వారికి అనుమానాలంటూ లేవు." (పై గ్రంథంనుంచే - పేజీ 123).

మాస్కోలో జరిగిన వీడ్కోలు సభలో (1930 సెప్టెంబరు 24) టాగూరు యిలా ఉపన్యసించారు :

"నేను చూచినది కొద్దిమాత్రమే. అయినప్పటికీ, అపూర్వమైన అభివృద్ధి జరిగినట్లు నేను నమ్ముతున్నాను. నిజంగా యిది పరమాద్భుతం...ఆర్యన్ నాగరికతకు ఆటపట్టు అయిన ప్రాచీన భారతదేశంలో కూడా విద్య, ప్రజలందరికీ సమానావకాశాలు అనే వరప్రసాదం ఎప్పుడు లభిస్తుందా అని నేను ఉవ్విళూరుతాను. యుగయుగాలుగా శృంఖలాబద్ధమై యున్న ప్రజల మనస్సులను బంధవిముక్తి చేయాలని నేను చాలకాలం నుంచీ కలకంటున్నాను. ఆ కలను ప్రత్యక్ష రూపంలో నాకు సాక్షాత్కరింపజేసిన మీ అందరికి కృతజ్ఞుణ్ణి. ఇందుకు నేను కృతజ్ఞతాభివందన లర్పిస్తున్నాను." (పై గ్రంథంనుంచే — పేజీ 122);

కాబట్టి, ఎంతో దూరాన ఉన్న సోవియట్ యూనియన్‌లో టాగూరు మనస్సు ఎల్లవేళలా సోవియట్ ప్రపంచాన్ని తన దేశ ప్రజల ప్రపంచంతో పోల్చుకుంటూ వచ్చారు. సోవియట్ యూనియన్‌లో తాను ప్రత్యక్షంగా చూచిన, రక్త మాంసాలతో కూడుకొనియున్న పరమాద్భుతాన్ని తన మాతృదేశంకూడా ఎప్పుడు సాధించుకొంటుందా అని ఆయన ఉవ్విళ్ళూరారు.

సోవియట్ యూనియన్‌నుంచి టాగూరు సరాసరి అమెరికాకు వెళ్ళారు. ఆ రెండుదేశాలకు మధ్య గల వ్యత్యాసం ఆయనలో దిగ్భ్రాంతి కలిగించింది. అమెరికా చేరుకోగానే ఆయన ఒక లేఖలో సోవియట్ యూనియన్ గురించి యిలా వ్రాశారు:

"మానవజాతి చరిత్రలో మరెక్కడా నేను సంతోషానికీ, ఆశకూ యింత సుస్థిరమైన కారణం కనుగొని యుండలేదు." (పై గ్రంథంనుంచే — పేజీ 124).

తన కోడలికి వ్రాసిన ఉత్తరంలో ఆయన వాక్యాలు : "నేను చిరకాలంగా ఆశిస్తున్నది రష్యాలో సాధింపబడింది." (పై గ్రంథంనుంచే— పేజీ 124).

కాని, అమెరికానుగురించి టాగూరు యిలా వ్రాశారు: "ఐశ్వర్యం యొక్క యీ భారం ఎంత బరువుగా, ఎంత అర్థరహితంగా ఉంది!" (పై గ్రంథంనుంచే — పేజీ 124)

అంతకుముందు, 1920 లో మొదటిసారి అమెరికాకు వెళ్ళినప్పుడు ఆయనొక జాబులో యిలా వ్రాశారు : "ప్రతిచోటా ఆసియాపట్ల ద్వేషం కనిపిస్తోంది. విస్తృతమైన దుష్ప్రచారం ద్వారా యిది వ్యక్తమవుతోంది. నీగ్రోలు సజీవంగా దహింపబడుతున్నారు. కొన్ని సందర్భాల్లో వారు చట్టప్రకారం ఓటు హక్కును వినియోగించుకోవడమే యిందుకు కారణం. జర్మన్లు దూషింపబడుతున్నారు. రష్యాలోని పరిస్థితులు ఉద్దేశపూర్వకంగా వక్రీకరింపబడుతున్నాయి." పై గ్రంథంనుంచే — పేజీ 119);

సోవియట్ యూనియన్‌పట్ల టాగూరు ఆసక్తి, అభిమానం చివరి వరకూ మొక్కవోక నిలిచియుంది. ఆయన 1941 లో కాలధర్మం చెందారు. చివరి గంటల్లో ఆయన సోవియట్ యూనియన్‌ని గురించే ఆలోచిస్తూ ఉన్నారు. ఆ రోజుల్లో స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం అతి ముమ్మరంగా సాగుతోంది. స్టాలిన్‌గ్రాడ్‌లో రక్షింపబడుతూన్నది స్వాతంత్ర్య జ్యోతి, మానవ నాగరికత అని ఆయన అన్నారు. స్పృహపోయేముందు టాగూరు ఆ వీరోచిత నగరాన్ని గురించి పదేపదే అడిగి తెలుసుకొనే వారట.

నెహ్రూ తన "భారత దర్శనం"లో టాగూరు మరణ సందేశాన్ని పేర్కొన్నారు. (పేజీ 395) అందులో యిలా ఉంది.

"...రోగాలను, అవిద్యను నిర్మూలించడానికి రష్యా శక్తివంచన లేకుండా కృషిచేసింది; అజ్ఞానాన్నీ, దారిద్ర్యాన్నీ క్రమక్రమంగా నిర్మూలించే కృషి ఫలిస్తోంది? ఒక మహాఖండంయొక్క ముఖాన్ని ఆవరించి యున్న అవమానాన్ని అది తుడిచివేసింది. ఒక వర్గానికీ మరో వర్గానికీ మధ్య ఒక తెగకూ మరో తెగకూ మధ్య కృత్రిమ విభేదాలు రష్యా నాగరికతలో లేవు. ఆ దేశం వేగంగా; ఆశ్చర్యకరంగా సాధించిన పురోగతికి నేను ఆనందపడుతున్నాను. అదే సమయంలో ఈర్ష్యకూడా పడుతున్నాను. ... రెండువందల ఉపజాతులు — కొద్ది సంవత్సరాలవరకు వేర్వేరు అభివృద్ధి దశల్లో ఉన్నట్టివి — శాంతియుతంగా, స్నేహంగా, చేయి చేయికలిపి ముందుకు సాగిపోతున్నాయి. కాని, నా దేశంవైపు చూచుకొంటే - గొప్ప నాగరికతలో పుట్టి పెరిగిన, మేధాసంపన్నులైన ప్రజలు అనాగరికమైన అవ్యవస్థలో పడిపోతున్నారు. ఈ రెండు పరిపాలనా వ్యవస్థలు ఎంత భిన్నమైనట్టివో కళ్ళకు కట్టినట్లు కనిపిస్తోంది. ఒక వ్యవస్థకు పునాది సహకారం; రెండవ వ్యవస్థకు పునాది దోపిడీ. ఈ రెండు వ్యవస్థల మధ్య భిన్న పరిస్థితు లుండడానికి కారణమిదే:"

చరిత్రను త్రికరణశుద్ధిగా, సత్యసంధతతో రచిస్తే, సత్యాన్ని దాపరికం లేకుండా, వక్రీకరణ లేకుండా, ఉన్నది ఉన్నట్లు వెల్లడించడమే చరిత్ర పరమార్థమయితే, ఒక విషయం మనకు స్పష్టంగా, అనుమానాలకు తావులేకుండా బోధపడుతుంది. అదేమంటే, ఆనాడు మన మనస్సులలో కొత్త ఆలోచనలను, కొత్త ఆశయాలను పురిగొల్పిన లెనిన్‌కీ, రష్యా విప్లవానికీ, సోవియట్ యూనియన్‌కీ భారతీయులమైన మనం ఎంతో రుణపడియున్నాం.

# ఆరవ అధ్యాయం

# జాతీయైక్య సంఘటన నిర్మాణం

ఈ దశలో విజృంభించిన వెల్లువ కేవలం సిద్ధాంత, సాంస్కృతిక మైనదే కాదు. దానికి మూలాధారం ఆనాటి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులు. ఆ పరిస్థితులనుంచి ఉత్పన్నమైన వెల్లువ తిరిగి దేశంలోని ప్రజా ఉద్యమా లన్నిటిపైన ప్రభావం కలుగజేసింది. చరిత్ర అనే శంఖ చక్ర క్రమం ఎల్లప్పుడూ అలాగే ఉంటుంది.

మొదటి ప్రపంచయుద్ధం తర్వాత విజృంభించిన వెల్లువకూ 1927 తర్వాత వ్యాప్తిచెందిన దానికీ ప్రధాన వ్యత్యాస మేమంటే; రెండవ వెల్లువలో కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ మరింత అభివృద్ధిచెందాయి; మరింత చైతన్యవంతమయాయి,

1927 తర్వాత ఒక కొత్త సమ్మె వెల్లువ ప్రారంభమయింది. 1928 లో బొంబాయి బట్టలమిల్లు కార్మికులు ఆరు నెలలు సాగించిన అద్భుతమైన సమ్మె భారత ట్రేడ్ యూనియన్ ఉద్యమ చరిత్రలో అన్నిటికంటే పెద్ద సమ్మె; అన్నిటికంటే నిర్మాణయుత మైనట్టిది; అన్నిటి కంటే క్రమశిక్షణతో జరిగినది; అన్నిటికంటే ఎక్కువకాలం కొనసాగినది.

యజమానులు ప్రవేశపెట్టిన రేషనలైజేషనుపల్ల ప్రారంభమైన యీ సమ్మె స్పష్టంగా అనేక కొత్త లక్షణాలను కలిగియుంది.

అరుణ పతాకాన్ని కార్మికవర్గ పతాకంగా యీవిద్భారితదేశంలో గుర్తింపబడేటట్లు చేసిన మొట్టమొదటి సమ్మె యిది. మిల్లు కమిటీల రూపంలో అతి చురుకైన, చొరవగలిగిన సాధారణ కార్మికులతో ఏర్పడ్డ

బలమైన కార్మిక నాయకత్వం యీ సమ్మెతో అభివృద్ధిచెందింది. వీటికి బలమైన ఒక కేంద్ర సమ్మె కమిటీ నాయకత్వం వహించింది. నగరం లోని అన్ని బట్టలమిల్లుల కార్మికులు ఎన్నుకున్న ప్రతినిధులు (ఒకటి రెండు మిల్లులు తప్ప) మొత్తం 72 మిల్లులలో ఎన్నుకున్నవారు యీ కేంద్ర కమిటీలో సభ్యులు: యజమానులు ఎంతో సంఘటితంగా సాగించిన సమ్మెవిచ్ఛిన్నచర్యలను, వారికి అండగా పనిచేసిన పోలీసుల దమన కాండను సమ్మెదార్లు ఎదుర్కోవలసివచ్చింది. ఈ రెంటినీ వారు అద్భుతమైన ఐక్యతతో, ఆత్మవిశ్వాసంతో, క్రమశిక్షణతో ఓడించి, విజయం సాధించారు,

ఈ సమ్మె ఆనాడు ఆసియాలోకల్లా బలమైన ఒక ట్రేడ్ యూనియన్ని, సుప్రసిద్ధ ఎర్రజెండా గిర్ని కాంగార్ యూనియన్ని: ప్రసాదించింది. 80,000 లకుపైగా చందాలు చెల్లించే కార్మికులందులో సభ్యులుగా ఉండేవారు.

అత్యంత నిర్మాణయుతంగా యీ సమ్మె ముగింపుకు వచ్చింది. యజమానులు రేషనలైజేషన్ స్కీమును ఉపసంహరించుకోడాని కంగీకరించారు: వేతనాలను క్రమబద్ధమొనర్చే సమస్యనూ, నియామక షరతులకు సంబంధించిన, పని పరిస్థితులకు సంబంధించిన స్టాండింగ్ ఆర్డర్సునూ ఒక విచారణ సంఘానికి ఒప్పగించడానికి కూడా అంగీకరించారు. ఈ విషయాలపై వారు యూనియన్ నాయకులతో క్రమబద్ధమైన ఒప్పందం కుదుర్చుకున్నారు.

అంతేకాదు. సోవియట్ యూనియన్ని గురించీ, కార్మికుల ఆశయమైన కార్మికరాజ్య స్థాపనను గురించీ, భారతదేశంలో మొట్టమొదటి సారిగా విస్తృతంగా ప్రచారం జరిగింది యీ సమ్మెలోనే. తర్వాత కాలంలో "ఎర్ర జండా కార్మికులు" అనే పేరుతో ప్రఖ్యాతి పొందిన చాలమంది మిలిటెంట్ కార్మికుల్ని ప్రసాదించిన మొట్టమొదటి సమ్మె కూడా యిదే. ఈ విధంగా, కార్మికరాజ్య స్థాపనకై పోరాటం జరపాలనే స్పష్టమైన ఆశయంతో, వర్గ చైతన్యం గల మొట్టమొదటి కార్మికతరం భారతదేశంలో ఉద్భవించింది.

ఇలాంటి సమ్మెలే 1928 లో కలకత్తా జూట్ మిల్లులలోను, అనేక రైల్వే వర్క్‌షాపులలోను కూడ జరిగాయి.

1928 తర్వాతనే యించుమించు దేశంలోని ట్రేడ్ యూనియన్ కేంద్రా లన్నిటిలోను మే దినోత్సవం, రష్యా విప్లవ దినోత్సవం, లెనిన్ దినోత్సవం జరగసాగాయి,

1927 వరకు సంస్కరణ వాదుల నాయకత్వంక్రింద నున్న అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కమ్యూనిస్టుల పలుకుబడి క్రిందికి వచ్చింది. 1928 లో గణనీయంగా కమ్యూనిస్టుల నాయకత్వం దాని కేర్పడింది. ఆనాడు కమ్యూనిస్టులే దేశంలోని మిలిటెంట్ కార్మికోద్యమానికి దాదాపు ఏకైక నాయకులని చెప్పవచ్చు.

బొంబాయి బట్టలమిల్లు కార్మికులు 1929 లో రెండవసారి మరో పెద్ద సమ్మె పోరాటం జరపవలసి వచ్చింది. ఈసారి, ట్రేడ్ యూనియన్లను నిర్మించుకొనే హక్కును అపహరించడానికి యజమానులు, ప్రభుత్వం కలిసి దాడిచేశారు. ఈ సమ్మె మొదటిదానికంటె తీవ్ర రూపంలో కొనసాగింది. కాని విఫలమయింది.

బ్రిటిష్ పార్లమెంటు, దేశంలో అసంతృప్తి ఉధృతం కాబోతూందని కనిపెట్టి, భారతదేశంలో తాము ప్రవేశపెట్టవలసిన "రాజ్యాంగ" సంస్కరణలను గురించి దర్యాప్తు చేయడానికి 1927 లో ఒక కమిషన్‌ను నియమించింది, అదే సైమన్ కమిషన్. సర్ జాన్ సైమన్ అనే బ్రిటిష్ నిరంకుశశోద్యోగి దానికి అధ్యక్షుడు.

ఈ కమిషన్ నియామకాన్నీ, భారతదేశంలో యీ కమిషన్ సభ్యుల పర్యటననూ వ్యతిరేకిస్తూ, మొట్టమొదటి సారిగా 1928 లో బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిపినది బొంబాయి మొదలైన పారిశ్రామిక నగరాల్లోని కార్మికులు.

కమ్యూనిస్టులు జాతీయ కాంగ్రెసులో కూడా చురుగ్గా పనిచేశారు.

బొంబాయి, బెంగాల్ మొదలైన రాష్ట్రాల్లో రాష్ట్ర కాంగ్రెసు కమిటీల నాయకత్వ స్థానాలకు కూడా వారు ఎన్నుకోబడ్డారు. అఖిల భారత కాంగ్రెసు కమిటీలో సైతం కొందరు సభ్యు లుండేవారు. 1927 లో మద్రాసులో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభలో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని మొట్టమొదటి సారిగా ప్రవేశపెట్టింది కూడా కమ్యూనిస్టులే.

1928 లో జరిగిన కలకత్తా కాంగ్రెసు మహాసభలో. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం క్రింద, సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు వెంటనే ప్రజా ఉద్యమాన్ని ప్రారంభించవలసిందిగా విజ్ఞప్తి చేస్తూ 50,000 మంది కార్మికులు ఒక బ్రహ్మాండమైన ఊరేగింపు జరిపారు.

1927-28 లో బొంబాయి, బెంగాల్, పంజాబ్, యు. పి. మొదలైన రాష్ట్రాల్లో కార్మిక-కర్షక పార్టీలు స్థాపింపబడాయి. పార్టీ నాయకత్వం క్రింద అవి కార్మికుల, రైతుల, విప్లవ జాతీయ వాదుల కోర్కెలను ప్రజల ముందుంచాయి.

ఈ కోర్కెలు అనేక రాష్ట్రాల్లో స్వతంత్రవేదిక నుంచి. వీలైన చోట్ల కాంగ్రెసు వేదికనుంచి విస్తృతంగా ప్రచారం చేయబడ్డాయి.

వివిధ రాష్ట్రాల్లో కమ్యూనిస్టు పత్రికలు వేర్వేరు భాషల్లో వెలువడ్డాయి.

ఈ విధంగా జాతీయోద్యమ వెల్లువ 1929 లో, లేదా 1930 లో అత్యున్నత స్థాయి నందుకోబోతున్నప్పుడు కమ్యూనిస్టులు, కార్మికవర్గం చాల చురుకైన పాత్ర నిర్వహించడానికి సన్నద్ధులయారు.

బ్రిటిష్ ప్రభుత్వం ఒక సంవత్సరం లోపల అధినివేశ స్వాతంత్ర్యం ఈయాలనీ, అలా ఈయకపోతే కాంగ్రెసు 1929 సంవత్సరాంతంలో సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు ప్రత్యక్ష చర్యకు పూనుకొంటుందనీ అంత్య సందేశ మిస్తూ, 1928 డిసెంబరులో కలకత్తాలో కాంగ్రెసు మహాసభ తీర్మానించింది.

ఇట్టి పరిస్థితుల్లో, పైన పేర్కొన్న కారణంవల్ల, అతి జాగరూకతతో వేచి చూస్తున్న బ్రిటిష్ ప్రభుత్వం కొత్తగా తలయెత్తిన కార్మిక నాయకత్వంపై అకస్మాత్తుగా అశనిపాతం వంటి దెబ్బ కొట్టింది. 1929 మార్చి 20 తేదీని భారతదేశంలోని కమ్యూనిస్టు నాయకుల్నీ, మిలింటెట్ ట్రేడ్ యూనియనిస్టుల్నీ 33 గురిని అరెస్టుచేసి కోర్టులో విచారణ ప్రారంభించింది, ఇదే మీరట్ కమ్యూనిస్టు కుట్రకేసు అని ప్రపంచ ప్రఖ్యాతి పొందింది. ఈ విచారణ నాలుగేండ్లు కొనసాగింది. ముద్దాయిలలో అధిక సంఖ్యాకులకు దీర్ఘకాల జైలుశిక్షలు విధింపబడ్డాయి.

ఈ సందర్భంలో మనం గుర్తించవలసిన అతి ప్రధానమైన విషయ మేమంటే, ముద్దాయిలు "చట్టం ప్రకారం స్థాపింపబడిన ప్రభుత్వాన్ని" కూలద్రోయడానికి కుట్ర చేశారని ప్రభుత్వం ఆరోపించగా, ప్రభుత్వ న్యాయవాది కొన్ని నెలల వరకు సాగించిన ఉపన్యాసమంతటి లోనూ కనిపించేది, వారు భారత స్వాతంత్ర్యోద్యమాన్నీ, జాతీయ కాంగ్రెసునూ, దాని నాయకత్వాన్నీ వ్యతిరేకించా రనేది.

ఒకవైపు చక్రవర్తిగారి ప్రభుత్వమూ, దాని అధికారులూ భారత స్వాతంత్ర్యోద్యమాన్ని అణచేందుకు సర్వ ప్రయత్నాలు చేస్తూంటే, మరోవైపు ఆ స్వాతంత్ర్యోద్యమాన్నే కమ్యూనిస్టులు వ్యతిరేకిస్తూన్నందుకు ఇంగ్లండు రాజు, ఇండియాకు సామ్రాట్టు అయిన మహా ఘనత వహించిన ఆ చక్రవర్తికి నిద్ర ఎందుకు పట్టలేదో మరి!

ఇది పైకి తమాషా ప్రశ్నగా కనిపించవచ్చు. కాని యిందులో తమాషా ఏమీ లేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశంలో కమ్యూనిజాన్ని అతి ప్రమాదకరమైన శత్రువుగా పరిగణించారు. దాన్ని వారు అణచదలచుకున్నారు. ఇందుకై తమకు నైజమైన ఒక తుచ్ఛమార్గమవలంబించారు. అదేమంటే, భారత కమ్యూనిస్టులకూ, జాతీయ స్వాతంత్ర్యోద్యమానికీ మధ్య గండికొట్టడం.

కాని, వారి ప్రయత్నం ఫలించలేదు. దేశమంతటా ఉన్న కార్మిక సంస్థల మాట అటుంచి, జాతీయ కాంగ్రెసే జవహర్లాల్ నెహ్రూ అధ్య

క్షత క్రింద మీరట్ డిఫెన్స్ కమిటీని నియమించింది. ఆనాడు కాంగ్రెసు అగ్రనాయకుల్లో ఒకరు, ప్రఖ్యాత న్యాయవాదిగా పేరుగాంచిన వ్యక్తి అయిన ఆయన తండ్రి మోతీలాల్ నెహ్రూ యీ కుట్రకేసులో ముద్దాయిల తరఫున వాదించడానికి స్వయంగా మీరట్ కోర్టుకు హాజరయేవారు.

మోతీలాల్ నెహ్రూ అప్పుడు భారత శాసనసభలో సభ్యుడుగా కూడ ఉండేవారు. ఆ సభలో ఆయన భారత కమ్యూనిస్టుల అరెస్టును తీవ్రంగా ఖండించారు; వారి ధైర్య సాహసాలను, నిజాయితీని కొనియాడుతూ ఉపన్యసించారు. భారత శాసనసభలో బ్రిటిష్ హోం మంత్రిని ఆయన సూటిగా యిలా ప్రశ్నించారు : "భారతదేశంలో భావ వ్యాప్తిని అరికట్టేందుకు మీరు ముళ్ళతీగెలను, అడ్డు గోడలను, నిర్మించగలరా? మీరలా అరికట్టగల రోజులు గతించాయి."

1929 చివరి రోజుల్లో గాంధీజీ లాహోరు మహాసభకు హాజరవడానికి వెళుతూ (ఆ మహాసభ సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని లక్ష్యంగా ప్రకటించి అందుకై దేశవ్యాపిత శాసనోల్లంఘనోద్యమం ప్రారంభించాలని తీర్మానించింది), మీరట్ జైలుకు వెళ్ళారు. అక్కడ ముద్దాయిలను కలుసుకొని, స్వాతంత్ర్య సాధనకై ప్రారంభం కానున్న పోరాటానికి సహకార మీయవలసిందని కోరారు.

దీన్నిబట్టి, జాతీయోద్యమ నాయకత్వంతో కమ్యూనిస్టులానాడు ఎంతగా భేధించినప్పటికీ, స్వాతంత్ర్య పోరాటంలో వారు తోడి సైనికులన్న విషయం స్పష్టం.

మీరట్ కమ్యూనిస్టు కుట్రకేసు స్వాతంత్ర్యోద్యమంలో అత్యంత పోరాట పటిమగల వర్గంపై, అనగా కార్మికవర్గంపై, దెబ్బకొట్టగా, వెన్వెంటనే ప్రారంభమైన లాహోరు కుట్రకేసు భారత యువజనుల్లో అత్యంత పోరాట పటిమగల సెక్షన్‌పై, అనగా టెర్రరిస్టు విప్లవకారులపై, దెబ్బకొట్టింది.

1920 – 30 చివరిదశలోను, 1930 – 40 ప్రారంభదశలోను వ్యాపిచెందిన టెర్రరిస్టు ఉద్యమం ఎంత వీరోచితులైన, సమర్థులైన, త్యాగశీలురైన యువకుల్ని తయారు చేసిందంటే, వారిలో ఏ కొందరిని గురించో ప్రస్తావించడం పాక్షిక దృక్పథమే అవుతుంది. కాని, చంద్రశేఖర్ ఆజాద్, భగవత్‌సింగ్, సూర్యాసేనలు (చివరి వ్యక్తి చిట్టగాంగ్ ఆయుధాగార దోపిడీకి నాయకుడు) అసాధారణమైన ధైర్య సాహసాలను, నిర్మాణం – నాయకత్వం విషయంలో దిగ్భ్రాంతి గొల్పే చాకచక్యాన్ని ప్రదర్శించడంవల్ల, నూతన టెర్రరిస్టు విప్లవోద్యమానికి వారు అత్యంత ప్రఖ్యాత ప్రతీకలుగా వెలుగొందారన్న విషయం యదార్థం.

మనం గుర్తించవలసిన మరో విషయ మేమంటే, తర్వాత కాలంలో భారత కమ్యూనిస్టు పార్టీకి ప్రధాన కార్యదర్శిగా ప్రఖ్యాతి గాంచిన అజయ్‌ఘోష్ భగతసింగ్‌కు సహచర యోధుల్లో ఒకరు.

నిజానికి, 1929 నాటి లాహోరు కుట్రకేసులో ప్రధాన ముద్దాయి భగత్సింగే. ఆయనతోబాటు విచారింపబడిన ఆయన సహచరుల్లో అజయ్ కుమార్ ఘోష్ ఒకరు.

అజయ్‌ఘోష్ "భగత్సింగూ, ఆయన కామ్రేడ్స్" అనే కరపత్రంలో (1945), ఏ పరిస్థితుల్లో ఆయన మిత్రులు కలిసి టెర్రరిస్టు విప్లవ గ్రూపును స్థాపించారో (1925) తెలియజేశారు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే :

"ఈ నిస్తబ్ధతను (1922 లో సహాయ నిరాకరణోద్యమం ఉపసంహరింపబడిన తర్వాత ఏర్పడినది) ఛేదించడానికేమి చేయాలనే సమస్యపై మాలో దీర్ఘ చర్చలు కొనసాగాయి. సోషలిస్టు సాహిత్యం ఆనాడు కొద్ది కొద్దిగా దేశంలో ప్రవేశిస్తోంది. నవంబరు విప్లవం జయించడం, రష్యా సోషలిస్టు ప్రభుత్వం పటిష్టమవడం, అన్నిటికంటె ముఖ్యంగా సోవియట్ యూనియన్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడే టర్కీ, చైనాలకు సహాయం చేయడం—యివన్నీ మమ్మల్ని నూతన సోషలిస్టు ప్రభుత్వం వైపు, దాని సిద్ధాంతాలవైపు ఆకర్షించాయి.

"అదే సమయంలో, మన దేశంలో మరొక పరిణామం గోచరిం చింది. దాని ప్రాధాన్యతను మేము అప్పుడు అస్పష్టంగానే గ్రహించాం. దేశమంతా ప్రశాంతంగా ఉన్నట్లు, ఉపేక్ష అనే ఊబిలో కూరుకొనిపోయి నట్లు కనబడుతూన్న సమయంలో...బొంబాయి, కలకత్తా, కాన్పూరు మొదలైనచోట్ల జరిగే కార్మిక సమ్మెలు మమ్మల్ని ఆకర్షించాయి.

"మొత్తం జాతిని ఉత్తేజపరచడానికి టెర్రరిజం, ప్రజల శతృవు లపై సాయుధ చర్యలు అనివార్యమని మేము విశ్వసించాం. కాని, టెర్ర రిజం మాత్రమే స్వాతంత్ర్యానికి దారితీయదనేది స్పష్టం. దాని ద్వారా వెల్లువికే ప్రజా వెల్లువను ఏ మార్గాల్లో నడపాలి? బ్రిటిష్ పాలన కూలి పోయాక ఏ విధమైన ప్రభుత్వం అధికారంలోకి రావాలి? ఈ ప్రశ్నలు అస్పష్టమైన రూపంలో మా మధ్య ఉత్పన్నమయాయి.

"భగత్సింగ్ ఆ రోజుల్లో పంజాబులో పనిచేస్తూ ఉండేవాడు. ఆయన, ఆయన కామ్రేడ్స్ కలిసి నవజవాన్ భారత సభ అనే సంసను స్థాపించారు. అదొక మిలిటెంట్ యువజన సంస్థ. దాని ఉద్దేశం సోష లిస్టు భావాలను ప్రచారం చేయడం, బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రత్యక్ష కార్యాచరణ యొక్క అవసరాన్ని ప్రచారం చేయడం, టెర్ర రిస్టు పార్టీకి రిక్రూటింగ్ కేంద్రంగా ఉపయోగ పడ్డమూను. త్వరలోనే ఆ సంస్థ అద్భుతమైన ప్రజాదరణ పొందింది. పంజాబు యువకుల్లో అతివాద భావాలను వ్యాపింపజేయడంలో నాయకత్వ పాత్ర వహించింది.

"సోహన్ సింగ్ జోష్ స్థాపించిన "కీర్తి" (విప్లవం) అనే సోష లిస్టు పత్రికలో భగత్సింగ్ కొంతకాలం సంపాదక సభ్యుడుగా కూడ పనిచేశాడు" ("భగత్సింగూ, ఆయన కామ్రేడ్స్"—పేజీ 3-4)

ఆ దశలో టెర్రరిస్టుల సాహసోపేత చర్యలను యిక్కడ వర్ణించ వలసిన అవసరం లేదు. గమనించవలసిన విషయ మేమంటే, ఆ సాహసోపేత చర్యలతోబాటు టెర్రరిస్టులు సోషలిజంవైపు, సోవియట్ యూనియన్ వైపు భారత కార్మికోద్యమం వైపు కూడా ఆకర్షింపబడ్డారు.

ఈ ప్రభావం లాహోరు కుట్రకేసు విచారణలో మరింత స్పష్టంగా ద్యోతకమయింది. (అప్పుడు ముద్దాయిలకు మార్క్సిస్టు సాహిత్యం చాలా లభించింది).

అజయ్‌ఘోష్ ఇంకా యిలా వ్రాశారు : "జైల్లో మా అధ్యయనం సోవియట్ యూనియన్ పట్ల మాకు గల ప్రేమను మరింత ప్రగాఢ మొనరించింది. 1930 లో నవంబరు విప్లవ వార్షికోత్సవంనాడు మేము సోవియట్ యూనియన్‌కి అభినందన సందేశ మొకటి పంపాం. అందులో సోవియట్ ప్రజలు సాధించిన విజయాలకు జేజే లర్పించాం; సోవియట్ శత్రువులకు వ్యతిరేకంగా పోరాడుతామని ప్రతిజ్ఞ చేశాం," (పై కర పత్రమే – పేజీ – 13).

నిజానికి లాహోరు కుట్రకేసు ముద్దాయిలు అంతకుముందే, 1930 జనవరి 21 తేదీని, లెనిన్ దినోత్సవం జరిపారు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఏమైనా చేసుకోమని వారు సవాలు చేశారు. ఆ రోజున వారు ఎర్ర రుమాళ్ళు ధరించి కోర్టుకు హాజరయారు. మేజిస్ట్రేటు వచ్చి కుర్చీలో కూర్చోగానే, "సోషలిస్టు విప్లవం వర్ధిల్లుగాక!" "కమ్యూనిస్టు ఇంటర్నే షనల్ చిరస్థాయిఅగుగాక!" "లెనిన్ అమరజీవి," "ప్రజలంతా చిరస్థాయి అగుదురుగాక!" "సామ్రాజ్యవాదంనశించాలి!" అంటూ, దిక్కులు పిక్కటిల్లే టట్లు నినాదాలు చేశారు. అవి పూర్తి అయాక కమ్యూనిస్టు ఇంటర్నేష నల్‌కి యీ క్రింది టెలిగ్రాం పంపవలసిందని మేజిస్ట్రేటు చేతికిచ్చారు :

"లెనిన్ మహనీయుని భావాలను ముందుకు గొనిపోయేవారందరికీ మేము లెనిన్ దినోత్సవ సందర్భంలో హృదయపూర్వక అభినందన లందజేస్తున్నాం. రష్యా జరుపుతూన్న మహా ప్రయోగం విజయవంత మవాలని మేము కోరుతున్నాం. అంతర్జాతీయ కార్మికోద్యమంతో పాటు మేముకూడా గొంతు కలుపుతున్నాం! కార్మికవర్గం జయిస్తుంది: పెట్టుబడి దారీ విధానం ఓడిపోతుంది; సామ్రాజ్యవాదం నశించుగాక !" ("భారత దేశమూ, లెనిన్," న్యూ లిటరేచర్ పబ్లిషర్స్, పేజీ 42).

జైలునుంచి చివరి రోజుల్లో వ్రాసిన ఒక లేఖలో భగత్సింగ్ యిలా తెలియజేశాడు :

"సంఘటిత కార్మికుల, రైతుల, సామాన్య ప్రజల శక్తిపై ఆధార పడితేనే, దేశం విజయవంతంగా పోరాడగల్గుతుంది ... బాంబులవల్ల, పిస్టల్స్‌వల్ల ప్రయోజనంలేదని నేను ధృఢంగా విశ్వశిస్తున్నాను. ఇది, హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ చరిత్రనుబట్టి తేటతెల్లమవు తుంది. కార్మికుల్నీ, రైతుల్నీ సంఘటితమొనర్చడం మన ప్రధాన లక్ష్యంగా ఉండాలి." ("న్యూఏజ్," 20-3-1955).

బ్రిటిష్ ప్రభుత్వం 1930 తర్వాత భారతదేశంలోని టెర్రరిస్టు ఖైదీలలో అధికసంఖ్యాకుల్ని అండమాన్ దీవుల్లోని ఖైదుకొట్లలో నిర్బం ధించింది. అలా అన్ని జైళ్ళనుంచీ ట్రాన్స్ఫర్ చేయబడిన వారి సంఖ్య దాదాపు 700.

అండమాన్ దీవుల్లో వీరిలో ఎక్కువమంది కమ్యూనిస్టులయారు. "అండమాన్ జైల్లోని కమ్యూనిస్టు కన్సాలిడేషన్" అనే సంస్థను స్థాపిం చారు. జైలునుంచి "ది కాల్" అనే పత్రికను కూడా నడిపారు.

ఆ తర్వాత, కొన్ని సంవత్సరాలకు విడుదలై భారత కమ్యూనిస్టు పార్టీలో వారు సభ్యులుగా చేరారు.

భారతదేశంలో టెర్రరిస్టు విప్లవకారుల చిట్టచివరితరంపై రష్యా విప్లవం, లెనిన్, సోవియట్ యూనియన్ కలుగజేసిన ప్రభావం అలాం టిది.

ఇక మనం అసలు కథకు వద్దాం. బ్రిటిషు సామ్రాజ్యవాదులు 1929 మార్చిలో మీరట్ కుట్రకేసును, ఒక నెల తర్వాత లాహోరు కుట్రకేసును బనాయించడంలో వారి ఉద్దేశం, దేశంలో విజృంభించబోయే జాతీయ వెల్లువ ఒక విప్లవ స్వాతంత్ర్యపోరాటంగా అభివృద్ధికాకుండా నిరోధించడం, యిందుకై అత్యంత చైతన్యాన్నీ, యువజననాయకత్వాన్నీ అందులో పాల్గొననీయకుండా రంగంనుంచి తొలగించడమూను.

కాని, సామ్రాజ్యవాదం యీ నూతన జాతీయోద్యమ వెల్లువను నిరోధించలేకపోయింది. 1929 డిసెంబరులో లాహోరు కాంగ్రెసు మహాసభ సంపూర్ణ స్వాతంత్ర్యం భారతదేశ లక్ష్యంగా ప్రకటించి, ఆ లక్ష్య సాధనకై దేశవ్యాపిత శాసనోల్లంఘనోద్యమం ప్రారంభించాలని తీర్మానించింది.

1930 లో ఆసేతు హిమాచలం బ్రహ్మాండమైన ఊరేగింపులు, హర్తాళ్ళు, ఉప్పు చట్టాన్నీ అటవీ చట్టాన్నీ ధిక్కరించడం, విస్తృత ప్రాంతాల్లో పన్నుల నిరాకరణ, లాఠీచార్జీలు, తుపాకి కాల్పులు — ముమ్మరంగా కొనసాగాయి. 1,25,000 లకు పైగా స్వాతంత్రయోధులు అరెస్టు చేయబడి శిక్షింపబడ్డారు.

మొదటి ప్రపంచంయుద్ధం తర్వాత జరిగినట్లే, యీసారి కూడా కార్మికులు రాజకీయ సమ్మెలకు పూనుకున్నారు. షోలాపూరులో వారు స్థానిక ప్రభుత్వాన్ని వారంరోజుల వరకు స్తంభింపజేశారు; నగరాన్ని వారు యించుమించు స్వాధీనం చేసుకున్నారు. తర్వాత, సైనిక శాసనం విధింపబడి, అమానుషమైన తుపాకి కాల్పులతోగాని ఆ పోరాటం అణచబడలేదు. పెషావరులో ఒక సైనికదళం (గార్వాలీ) ఎదురుతిరిగి, శాంతియుతంగా చట్టధిక్కారం చేసే ప్రజలపై తుపాకులు కాల్చమన్న ఒక బ్రిటిష్ ఆఫీసరు ఉత్తర్వును ఉల్లంఘించింది. చట్టధిక్కారులతో చేతులు కలిపింది. అలా ఎదురు తిరిగిన సైనికులకు కోర్టు మార్షలు శిక్షలు విధింపబడ్డాయి; వారి నాయకుడు చంద్రసింగ్‌కు యావజ్జీవ జైలుశిక్ష విధింపబడింది. ఆయనకు దేశమంతా బ్రహ్మరథం పట్టింది. శిక్షాకాలం పూర్తి చేసి జైలునుంచి తిరిగి వచ్చాక, ఆయన కమ్యూనిస్టు పార్టీలో చేరారు.

ఆనాడు భారతదేశంలో భాగంగా ఉన్న బర్మాలో సాయుధ రైతాంగం రెండు మూడు జిల్లాలలో తిరుగుబాటు చేసింది. దాన్ని బ్రిటిష్ సైనికులు అమానుషంగా అణచివేశారు.

ఉత్తర ప్రదేశ్‌లోని అనేక ప్రాంతాల్లో జమీందారీ రైతులు

1931-32 లో బ్రహ్మాండమైన శిస్తుల నిరాకరణోద్యమం సాగించారు. అదికూడా అమానుషంగా అణచివేయబడింది.

ఎన్నో రాష్ట్రాల్లో సాయుధ రైతుల పోరాటాలు జరిగాయి.

1930 నుంచి 1933 వరకు కొనసాగిన జాతీయ మహా వెల్లువలో యిట్టి వీరోచిత ప్రజా పోరాటాలు ఎంతో ప్రాధాన్యం వహించాయి. ఆ తర్వాత యీ వెల్లువ తగ్గుముఖం పట్టింది.

మీరట్ కేసు విచారణ సమయంలో (1929-34) జైళ్ళ బయట నున్న యువ కమ్యూనిస్టులు ఆనాటి ప్రజా ఉద్యమ వెల్లువలో శక్తివంత మైన పాత్ర నిర్వహించలేకపోయారు. ఇందుకు ప్రధాన కారణం వారి అపరిపక్వత. కొన్ని ముఖ్యమైన సమ్మెలను వారు నడిపినమాట నిజమే. దృఢ విశ్వాసం, అమితోత్సాహం గల యువ కమ్యూనిస్టుల బృందాన్నొక దానిని కార్మికులనుంచి తయారుచేసినమాట కూడా నిజమే. వీరిలో చాల మంది తర్వాత కాలంలో కార్మికోద్యమ నాయకులుగా తయారయారు; కాని, పార్టీ ఒంటెత్తు విధాన మవలంబించడం వల్ల, కాంగ్రెసు నడిపిన విస్తృత జాతీయోద్యమంతో సంబంధం పెట్టుకొని దానికి నాయకత్వం వహించలేకపోయింది. దానినుంచి పార్టీ దూరమైపోయింది,

వీటన్నిటి ఫలిత మేమంటే, గాంధీజీ అహింసాయుత ప్రజా పోరాట పద్ధతినీ, పాలకుల్లో "హృదయ పరివర్తన" తీసుకొచ్చేటందుకు పదేపదే వారితో సంప్రతింపులు జరిపే పద్ధతినీ జోడించి మరొకసారి ఉద్యమాన్ని ఉపసంహరించారు. అయితే, యీసారి 1922 లో లాగ, ఏ ప్రజలనైతే ఆయన నడిపారో ఆ ప్రజలు హింసాత్మక చర్యలు జరిపా రనే కారణంతో మాత్రం కాదు.

1922 నాటికీ, 1934 నాటికీ తేడా ఏమంటే, రెండవసారి గాంధీజ ప్రజా ఉద్యమాన్ని ఉపసంహరించిన ఫలితంగా దేశంలో వ్యాపించిన నిస్తబ్ధత మొదటిసారి ఉపసంహరించినప్పటికంటే కొద్దికాలం మాత్రమే కొనసాగింది. 1935 తర్వాత ప్రజల్లో నూతన అసంతృప్తి జ్వాలలు

వ్యాపించాయి. రెండవ ప్రపంచయుద్ధం తర్వాత అవి అత్యున్నత స్థాయి నందుకున్నాయి.

భారత కమ్యూనిస్టు పార్టీ అంతకు పూర్వం కూడ చట్టబద్ధంగా పని చేయడాని కవకాశం లేకపోయినప్పటికీ, 1934 లోనే ప్రభుత్వం దాన్ని చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించి నిషేధించింది.

పార్టీపై నిర్బంధచర్య లెన్నో అమలు జరపబడినప్పటికీ, చాల త్వరితంగా తన శక్తుల్ని కూడదీసుకొని, అంతకుముందు దశలో చేసిన పొరబాట్లను దిద్దుకొని, 1935 తర్వాత అన్ని జాతీయ రాజకీయ రంగాల్లో పురోగమించింది. సభ్యత్వంలోను, కార్యకర్తల విషయంలోనే కాక, ఇంగ్లీషులోను, దేశ భాషల్లోను అనేక పత్రికలను ప్రచురించడం ద్వారా బలమైన ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని, రైతు ఉద్యమాన్ని, విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించడం ద్వారా, కాంగ్రెసు సంస్థలో చేరి పనిచేయడం ద్వారా ఎంతో అభివృద్ధిని చెందింది. సామ్రాజ్య వ్యతిరేక జాతీ యైక్య సంఘటన నిర్మాణంపై అది తన దృష్టిని కేంద్రీకరించి పనిచేసింది.

ట్రేడ్ యూనియన్ ఉద్యమం 1929-32 మధ్య చీలిపోయింది. అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లోనే కాక, దాని కనుబంధింపబడిన అనేక స్థానిక యూనియన్లలో కూడ చీలిక లేర్పడి బలహీన పడ్డాయి.

ఈ పరిస్థితిని అధిగమించి కార్మికవర్గ ఐక్యతను పునరుద్ధరించేందుకు ప్రధానంగా కమ్యూనిస్టులు 1932 నుంచి క్రమబద్ధంగాను, పట్టుదలతోను కృషి చేశారు. ఫలిత మేమంటే, కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థలన్నీ 1938 నాటికి తిరిగి అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో సమైక్యమయాయి.

ఇదెలా సాధ్యమయింది? క్రింది స్థాయిల్లో సమ్మె పోరాటాలు నడపడానికి ఐక్యతను సాధించడం ద్వారాను, అఖిలభారత ట్రేడ్ యూనియన్ సంస్థల నాయకులతో సంప్రతింపులు జరపడం ద్వారాను యిది సాధ్యమయింది,

ఐక్యతకై జరిగిన యీకృషి ఆనాడున్న ట్రేడ్‌యూనియన్ల నిర్మాణాన్ని విస్తృత పరచింది. సంఘటితులు కాని లక్షలాది కొత్త కార్మికుల్ని ఉద్యమంలోకి తీసుకొచ్చింది; వారిలో వర్గ చైతన్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని, పోరాట పటిమనూ యినుమడింపజేసింది.

1933 లో దేశం మొత్తంమీద 133 రిజిస్టర్డ్ ట్రేడ్ యూనియన్లు ఉండేవి. వాటి సభ్యత్వం 2,08,000. కాని, 1939 నాటికి రిజిస్టర్డ్ యూనియన్ల సంఖ్య 562 కు, వాటి సభ్యత్వం 3,90,000 కు పెరిగింది. ఇవి ప్రభుత్వ లెక్కలు. ప్రభుత్వం ఎప్పుడూ యూనియన్ల సభ్యత్వపు లెక్కలు తయారు చేయడంలో కఠినమైన నిబంధనలను పాటిస్తుంది. అందుచేత అసలు సంఖ్య యింతకంటె చాల ఎక్కువగా ఉంటుంది.

ఇట్టి పరిస్థితుల్లో నానాటికి వృద్ధిచెందే సమ్మెలతోబాటు, కార్మికవర్గ నిర్మాణం కూడా విస్తృత మయింది.

భారత ట్రేడ్ యూనియన్ ఉద్యమ చరిత్రలో అత్యంత ప్రఖ్యాతి వహించిన సమ్మెలు కొన్ని 1934–39 మధ్య జరిగాయి. 1929 లో ప్రపంచ ఆర్థిక సంక్షోభం ప్రారంభమయాక మిల్లు యజమానులు సాగించిన దాడిని మొట్టమొదటిసారి కార్మికవర్గం జయప్రదంగా తిప్పికొట్ట సాగింది. 1936 తర్వాత జరిగిన సమ్మెలన్నీ పూర్తిగా గాని, పాక్షికంగా గాని విజయవంతమయాయి. అనేక సందర్భాలలో కార్మికులు సమ్మె నోటీసు లిచ్చినంతనే యజమానులు వారి కోర్కెల నంగీకరిస్తూ వచ్చారు. దీన్నిబట్టి, యజమానులు, ప్రభుత్వం కార్మికుల ఐక్యతను, వారి పోరాట పటిమను గుర్తించారన్నమాట.

ఈ సమ్మెల కొత్త లక్షణాల్లో ఒకటేమంటే, ఒక నగరానికి మరో నగరానికి మధ్య ఎంతో దూరం ఉన్న బొంబాయి, షోలాపూర్, అహమ్మదాబాద్, ఇండోర్, కాన్పూర్ లాంటి పారిశ్రామిక నగరాల కార్మికులు ముందుగా ఆలోచించుకొని ఒక నిర్దిష్ట పథకం ప్రకారం కార్యరంగలో ప్రవేశించేవారు.

ఇలాగే, మూల ప్రాంతాల్లోని కార్మికులు మొట్టమొదటిసారిగా ట్రేడ్ యూనియన్లను నిర్మించుకొనే హక్కు, యజమానులచే ట్రేడ్ యూనియన్ల గుర్తింపు మొదలైన సమస్యలపై సుసంఘటితమైన సౌహార్ద సమ్మెలు అనేకం జరిపారు. కార్మికవర్గ చైతన్యం ఏ స్థాయికి వృద్ధి చెందిందంటే, తమ ఆర్థిక కోర్కెలను సాధించుకోడానికి కీలకం తమ సంఘాలను రక్షించుకోవడమని వారు గుర్తించారు.

ఒక్క 1937 లోనే వివిధ రాష్ట్రాలలో జరిగిన సమ్మెల్లో 6,48,000 కార్మికులు పాల్గొన్నారు; వాటివల్ల "నష్ట" మయిన పని రోజులు 90,00.000.

ఈ నూతన కార్మికోద్యమ వెల్లువకు సోవియట్ యూనియన్ విజయాలు, మొదటి రెండు సోవియట్ పంచవర్ష ప్రణాళికలు, 1936 నాటి సోవియట్ రాజ్యాంగచట్టం ఎంతో ఉత్సాహం, ఉత్తేజం కలిగించాయి. లెనిన్‌ని గురించిగాని, రష్యా విప్లవాన్ని గురించిగాని, సోవియట్ యూనియన్ గురించిగాని ప్రస్తావించకుండా ఒక్క బహిరంగ సభగాని, ఊరేగింపుగాని జరిగేదికాదు; కరతాళధ్వనులు, నినాదాల ద్వారా వాటిని హర్షించని ప్రేక్షకులూ ఉండేవారుకారు. ఇక్కడ మనం గుర్తించవలసిందేమంటే, కమ్యూనిస్టులు, తీవ్రజాతీయవాదులేకాక, ట్రేడ్ యూనియన్ నాయకుల్లో సంస్కరణ వాదులుసైతం సోవియట్ యూనియన్‌ని ఎల్లప్పుడు ప్రస్తుతించేవారు. భారత కార్మికోద్యమంయొక్క అంతర్జాతీయ స్వభావాన్ని గురించి ప్రచారం చేసేవారు.

జర్మనీలో హిట్లరు అధికారాన్ని స్వాధీనం చేసుకొన్నప్పుడు, ముస్సోలినీ అబిసీనియాపై దాడిచేసినప్పుడు, స్పెయిన్‌లో ఫ్రాంకో తిరుగుబాటు చేసినప్పుడు, జపాన్ మంచూరియాపై దండయాత్ర జరిపినప్పుడు బ్రిటిషు సామ్రాజ్యవాదం రెండవ ప్రపంచ యుద్ధానికి సన్నాహాలు సాగిస్తున్నప్పుడు, వీటికి వ్యతిరేకంగా ప్రజల్ని సమీకరించడంలోను, నిరసన చర్యలు సాగించడంలోను, కార్మికవర్గం నాయకత్వం వహించింది.

భారతదేశ చరిత్రలో మొట్టమొదటిసారి రైతు పోరాటాలు, రైతు సంఘాలు ఒకే జండాక్రింద (ఎర్రజండా), ఒకే సంస్థలో (అఖిల భారత రైతు సంఘం), ఒకే నాయకత్వాన ఐక్యమయినది యీ దశలోనే. ఈ విషయంలో కూడ చొరవతీసుకొని పనిచేసింది కమ్యూనిస్టులు, స్వామి సహజానంద సరస్వతి, ఇందూలాల్ యాజ్ఞిక్ వంటి రైతు ఉద్యమ నాయకులే. 1934 లో ఏర్పడ్డ కాంగ్రెసు సోషలిస్టుపార్టీలోని అతివాదులుకూడా యిందుకై తీవ్రంగా కృషిచేశారు.

1936 లో ప్రథమ అఖిల భారత రైతు మహాసభ లక్నోలో జరిగింది. అప్పుడే అఖిల భారత రైతు సంఘంకూడా స్థాపింపబడింది. అది ఒక ప్రణాళికను తయారుచేసింది. అ. భా. రైతుసంఘంయొక్క ప్రధాన లక్ష్యం, భూస్వామ్యవిధానాన్ని రద్దుచేసి, నష్టపరిహారం లేకుండా భూమిని దున్నే వారికి పంచియివ్వడం, రైతుల ఋణా లన్నిటినీ రద్దుచేయడం అని ప్రకటించింది. శిస్తురేట్లు తగ్గింపు. శాశ్వత సాగుహక్కు, ఋణభారం తగ్గింపు మొదలైన సమస్యలపై రైతుల తక్షణ కోర్కెలుకూడా ఆ ప్రణాళికలో చేర్చబడ్డాయి. అంతేకాక, అఖిలభారత రైతుసంఘంయొక్క ఆశయం, బ్రిటిషు పాలనను కూలద్రోసి రైతు-కార్మికరాజ్యాన్ని స్థాపించడమని ఆ ప్రణాళిక తెలియజేసింది.

1936-39 మధ్య దేశమంతటా సుసంఘటితమైన, పోరాటపటిమ గలిగిన రైతు ఉద్యమ మొకటి నిర్మింపబడింది. అనేక రాష్ట్రాల్లో రైతులకు ప్రాతినిధ్యం వహించే రైతుసంఘాలు స్థాపింపబడ్డాయి. పాక్షిక కోర్కెలపై కొనసాగిన పోరాటాల ఫలితంగా అనేక సౌకర్యాలు లభించాయి. అనేక రాష్ట్ర రాజధానుల్లో 50,000 లకుపైగా పాల్గొన్న రైతు ప్రదర్శనలు జరిగాయి. అనేక వేలమైళ్ళ పొడుగున రైతు యాత్రలు జరిగాయి.

ఈ సందర్భంలో గమనించవలసిన విషయ మేమంటే, అఖిల భారత రైతు సంఘం మొదటినుంచీ ఎర్రజండా క్రిందనే సంఘటితమయింది; మే దినోత్సవంలో పాల్గొంటూ వచ్చింది. అంతేకాక, చాల

రాష్ట్రాల్లో రైతులతోను, కార్మికులతోను సమష్టి ఊరేగింపులు, సమావేశాలు జరిగాయి.

మన దేశంలో రష్యా విప్లవ సందేశాన్ని మారుమూల గ్రామాలకు సైతం తీసుకువెళ్ళింది రైతు సంఘమే. దాదాపు కార్మిక సభల్లాగే రైతు సభల్లోకూడా సోవియట్ యూనియన్ కార్మిక-కర్షక రాజ్యాని కెలా ఆదర్శంగా ఉందో వివరింపబడింది. లెనిన్‌ని గురించి రైతు యువకులు వ్రాసిన, పాడిన పాటలు తరచు నగరాల్లోని కార్మికుల పాటలకంటే స్పష్టంగాను, ఉత్తేజకరంగాను ఉండేవి.

1939 నాటికి అఖిలభారత రైతు సంఘంలో 8,00,000 సుసంఘటిత సభ్యు లుండేవారు:

మొట్టమొదటి సంఘటిత విద్యార్థి ఉద్యమం కూడా యీ దశలోనే ప్రారంభమయింది. 1920 లో గాంధీజీ పిలుపునందుకొని, పాఠశాలలు—కాలేజీలు విడిచిపెట్టివచ్చిన లక్షలాది విద్యార్థుల మాదిరికాకుండా, యీ నూతన విద్యార్థి వెల్లువ స్పష్టంగా అతివాద భావాలతో ఉత్తేజం పొంది సోషలిజానికి అనుకూలంగా రూపొందింది.

నిజానికి, యీ దశలో రాజకీయ చైతన్యం కలిగిన విద్యార్థి లోకానికి మార్క్సిజం — లెనినిజం సిద్ధాంతపుష్టి నిచ్చింది. అనాటి విద్యార్థి ఉద్యమ కార్యకర్తల్ని మార్క్సిజం ఆకర్షించినంతగా మరో సిద్ధాంత మేదీ ఆకర్షించలేదు. అందుచేత, వారిలో అధికసంఖ్యాకులు సహజంగా కమ్యూనిస్టుపార్టీలో చేరారు: పార్టీ హోల్‌టైమర్లలో విద్యార్థులే అందరికంటె ఎక్కువ సంఖ్యలో ఉండేవారు.

విద్యార్థి ఉద్యమం స్కూళ్ళ జీతాలు మొదలైన సమస్యలపైనేకాక, స్వాతంత్రోద్యమంలో చురుగ్గా పాల్గొనే సమస్యపై కూడా విద్యార్థుల్ని సంఘటిత పరచింది. అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్ స్థాపింపబడిన మూడు నాలుగు సంవత్సరాల్లో దాని సభ్యత్వం 1,00.000 కు పెరిగింది. అంతేకాక, విద్యార్థి ఫెడరేషన్ విస్తృత వ్యాప్తి గలిగిన ఒక పత్రికను

కూడా ప్రచురించసాగింది. అది యువజనుల్లో సోషలిజాన్ని గురించీ, సోవియట్ యూనియన్ గురించీ పెద్దయెత్తున ప్రచారం చేసింది.

1930-40 మధ్య బలమైన అభ్యుదయ రచయితల ఉద్యమంకూడా వృద్ధిచెందింది. అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం స్థాపింపబడింది. సాహిత్యాన్ని ప్రజల మధ్యకు తీసుకెళ్ళి, ప్రజల సుఖ దుఃఖాలను, వారి ఆకాంక్షలను సాహిత్యంలో ప్రతిబింబించాలనే లక్ష్యం యీ ఉద్యమాన్ని ఉత్తేజపరచింది. ప్రజల విముక్తికై సాహిత్యాన్ని బలమైన సాధనంగా ఉపయోగించాలనే భావం ప్రగతిశీలురైన రచయిత లందరిలో ఏర్పడింది. అందుచేత, వారు సహజంగా అతివాద వైఖరి నవలంబించడమేకాక, సోవియట్ యూనియన్‌నీ, సోవియట్ రచయితల్ని అభిమానించసాగారు. వారిలో కొందరిపేర్లను మాత్రమే పేర్కొనడం మళ్ళీ అనుచితమే, ఎందుచేతనంటే, వారిలో చాలమంది జాతీయంగానేకాక.అంతర్జాతీయంగా కూడా ప్రఖ్యాతిచెందారు. అయినప్పటికీ కేరళ మహాకవి వల్లథోల్, తమిళ ప్రఖ్యాత రచయిత సుబ్రహ్మణ భారతి, ప్రేమచంద్ మణిక్‌బందోపాధ్యాయ, మజాజ్, కృష్ణచందర్, ముల్కరాజ్ ఆనంద్, సుమిత్రానందన్ పంత్, నిరాలా: సుభాష్ ముఖోపాధ్యాయ, అన్నాభావ్ సాఠే, యశ్‌పాల్‌ల పేర్లు చిరస్మరణీయాలు. వీరుకాక, యింకా చాలమంది సుప్రసిద్ధ రచయిత లున్నారు.

ఈ పరిణామాలన్నీ సహజంగా జాతీయ కాంగ్రెసుపైన. అది నడిపే ఉద్యమంపైన ఎంతో ప్రభావం కలుగజేశాయి. రెండోవైపు, కాంగ్రెసులోని మితవాద నాయకత్వం కార్మిక కర్షకుల్లో అభివృద్ధిచెందే యీ స్వతంత్య్ర వర్గ చైతనం చూచి గాబరాపడసాగింది. జాతీయోద్యమంలో తన నాయకత్వానికి యిది అడ్డురావచ్చు ననుకొంది. అందుచేత దాన్ని "అదుపు"లో ఉంచదలచుకొంది.

1932 లో కాంగ్రెసు ఉద్యమంలో పాలొని జైలుశిక్ష లనుభవించిన అనేకమంది యువక మేధావులు 1933 లోనే, జైళ్ళలో ఉండగా. పునరాలోచన ప్రారంభించారు. కాంగ్రెసు ఉద్యమం నూతన మార్గంలో

పురోగమింపచవలసిన అవసరాన్ని తెలుసుకోసాగారు. సహజంగా సోషలిజం వారిని ఆకర్షించింది. 1934 లో జైళ్ళనుంచి విడుదలై వచ్చాక వారు కాంగ్రెసు సోషలిస్టుపార్టీని స్థాపించారు.

ఈ పార్టీలోని వారందరూ నిజమైన సోషలిస్టులుగా మారేరని దీని అర్థంకాదు. నిజానికి, మొదటనుంచీ యీ పార్టీలో కమ్యూనిస్టు వ్యతిరేక మితవాద సెక్షన్ ఒకటి ఉంటూనే వచ్చింది. కాని, ఆలోచనా పరులైన నిజాయితీ గలిగిన చాలమంది యువ కాంగ్రెసు మేధావులు 1934–38 మధ్య కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరి, అందులో పొందిన అనుభవాల నుంచి పాఠాలు నేర్చుకొని, కమ్యూనిస్టు పార్టీలోకి వచ్చారు. నిజానికి, కమ్యూనిస్టు పార్టీని పెంచి పోషించిన ప్రధాన శక్తుల్లో ఒకటి కాంగ్రెసుసోషలిస్టు పార్టీ.

రెండు సంవత్సరాల వరకు కాంగ్రెసుసోషలిస్టు పార్టీకీ, కమ్యూనిస్టు పార్టీకీ మధ్య చాల సన్నిహితమైన సంబంధం ఉండేది. ఆ రెండిటినీ కలిపి ఒకే మార్క్సిస్టు పార్టీగా ఐక్యమొనర్చేటందుకు కూడా ప్రయత్నాలు జరిగాయి. కాని, కాంగ్రెసుసోషలిస్టు పార్టీలోని మితవాదులు కమ్యూనిస్టు వ్యతిరేక వైఖరి నవలంబించడం వల్ల ఆ ప్రయత్నాలు విఫలమయాయి.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ స్థాపింపబడ్డంతోబాటు, అనేక జాతీయ-అంతర్జాతీయ పరిణామాలు, దేశంలో కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలు. కార్మిక కర్షక ఉద్యమం—వీటి ప్రభావం కూడా కాంగ్రెసుమీద పడింది. ఈ పరిణామ క్రమంలో నెహ్రూ ఖచ్చితమైన సహాయకపాత్ర నిర్వహించారు.

1936 ప్రారంభంలో, జవహర్లాల్ నెహ్రూ అధ్యక్షత క్రింద లక్నోలో జరిగిన కాంగ్రెసు మహాసభలో, ఒక నూతన మార్గం కొరకు అన్వేషణ ప్రారంభమయింది. నెహ్రూ అధ్యక్షోపన్యాసం సాహసోపేతమైన ఒక ముందడుగు. అందులో ఆయన, సోషలిజం మాత్రమే భారత

దేశ సమస్యలకు పరిష్కారమని తెలియజేశారు; ఆసియా - ఆఫ్రికా దేశాల్లో జరిగే వలస వ్యతిరేక పోరాటాలను భారతదేశం బలపరచాలన్నారు; ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగే ప్రపంచ వ్యాపిత పోరాటానికి అండగా ఉండాలన్నారు; భూస్వామ్య విధానాన్ని రద్దు చేసేందుకు ఒక స్పష్టమైన వ్యవసాయ కార్యక్రమం అవసరమన్నారు.

రాష్ట్ర కాంగ్రెసు కమిటీలు తమ తమ రాష్ట్రాలలో రైతాంగ సమస్యపై పరిశీలనలు జరిపి, రైతులకు సహాయం చేసేందుకు, సేద్యం చేయని భూస్వాముల వ్యవస్థను రద్దు చేసేందుకు ఏయే చర్యలు అవసరమో సూచించవలసిందని కాంగ్రెసు మహాసభ ఆదేశించింది. తత్ఫలితంగా కొన్ని రాష్ట్ర కాంగ్రెసు కమిటీలు చాలవరకు తీవ్రస్వభావం గల నివేదికలు తయారుచేశాయి.

కాంగ్రెసును మరింత విస్తృత ప్రాతిపదిక గల సంస్థగా చేయాలనీ, తన దైనందిన కార్యకాలాపాల్లో కార్మికులు, రైతులు చురుగ్గా పాల్గొనేటట్లు చేయాలనీ కూడ నెహ్రూ సూచించారు. ప్రజా సంబంధాల కమిటి ఒకటి లక్నో కాంగ్రెసులో ఏర్పరచబడింది.

ఈ సూచనను కమ్యూనిస్టు పార్టీ బలపరచింది. కాంగ్రెసు కమిటీలలో ట్రేడ్ యూనియన్లకు, రైతు సంఘాలకు సమష్టి ప్రాతినిధ్యమిచ్చేటట్లు కాంగ్రెసు నిబంధనావళిని మార్చాలని సూచించింది.

దీనికి నెహ్రూ అంగీకరించారు, దాని ప్రాధాన్యతను గురించి ఆయన లక్నో, ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు అధ్యక్షోపన్యాసాల్లోను (1936 ప్రారంభంలో లక్నో కాంగ్రెసు మహాసభ, చివరి రోజుల్లో ఫెయిజ్‌పూర్ మహాసభ జరిగాయి), అనేక వ్యాసాలు - ఉపన్యాసాల్లోను వివరించారు.

ఉదాహరణకు, 1933 నవంబరు లోనే, "ఇండియన్ లేబర్ జర్నల్"కి ఒక సందేశ మిస్తూ, ఆయ నిలా తెలియజేశారు :

"నేడు ప్రపంచాన్ని అలముకొనియున్న సామాజిక-ఆర్థిక మహా

సంక్షోభంలో కార్మికులు నిర్వర్తించవలసిన ప్రత్యేక కర్తవ్య మొకటి ఉంది. ఎందుచేతంటే, సిద్ధాంత నాయకత్వ మనే భారం అనివార్యంగా కార్మికుల మీదనే పడుతుంది. భారతదేశంలో జాతీయ పోరాటం సామాజిక వ్యత్యాసాలను కప్పిపుచ్చుతోంది. అది సహజమే. కాని, యీ రోజున ప్రపంచ ఘటనలు జాతీయోద్యమాలను సైతం అంతకంతకు ఆర్థిక సామాజికోద్యమాలుగా చేస్తున్నాయి...అట్టి సామాజిక పోరాటంలో కార్మికు లెప్పుడూ అగ్రగామి పాత్ర నిర్వహిస్తూ వచ్చారు.

"కార్మికులు సామాజిక సంపదను ఉత్పత్తిచేసేవర్గం. భవిష్యత్తులో వారు ఆర్థికంగాను, చారిత్రకంగాను అత్యంత ప్రధానమైన వర్గంగా ఉంటారు. అందుచేత, కార్మికులు కాంగ్రెసుకంటే ఎంతో స్పష్టమైన సిద్ధాంత పరిజ్ఞానాన్ని కలిగి యుండగలరు...

"కార్మిక సమస్యలపై ఆసక్తిగల కాంగ్రెసు వాదులు యీ క్రింది విధంగా పనిచేయవలసి యుంటుంది: వారు కార్మిక సంఘాలలో, అనగా ట్రేడ్ యూనియన్లు మొదలైన వాటిలో స్వతంత్రంగా పనిచేయాలి; కార్మికుల్లో వారు సాధ్యమైనంత క్రియాశీలమైన సిద్ధాంత పరిజ్ఞానాన్నీ, కార్యక్రమాన్నీ పెంపొందించాలి; అది కాంగ్రెసు కార్యక్రమమంకంటెకూడా ప్రగతిశీలమైయుండాలి. కాంగ్రెసు సంస్థలో వారు కార్మికుల కార్యక్రమానికనుగుణంగా, ఆర్థిక సమస్యలకు ఎక్కువ ప్రాధాన్య మీయాలి. సిద్ధాంతరీత్యా కాంగ్రెసు కార్యక్రమం కార్మికుల కార్యక్రమమంత ప్రగతిశీలంగా ఉండదు. ఇది సహజం కూడా. అయితే. మిలిటెంట్ కార్యకలాపాల్లో సహకార మీయడం పూర్తిగా సాధ్యం." (జవహర్లాల్ నెహ్రూ: "ఇటీవలి వ్యాసాలు, రచనలు," పేజీ 127–129. కితాబిస్తాన్ — 1935).

లక్నో కాంగ్రెసు అధ్యక్షోపన్యాసంలో నెహ్రూ ఐక్య సంఘటనను గురించిన తన అభిప్రాయాన్ని క్రింది విధంగా వివరించారు:

"నేడు మన ముందున్న అసలు సమస్య, మన స్వాతంత్ర్య పోరాటంలో సామ్రాజ్య వ్యతిరేక శక్తు లన్నిటినీ ఏ విధంగా ఒక త్రాటిమీదికి

తీసుకురాగలం : విస్తృత ప్రజానీకాన్నీ, స్వాతంత్ర్య ప్రియులైన మధ్య తరగతిలో అధికసంఖ్యాకుల్నీ ఒక విశాలమైన సంఘటనలో ఏ విధంగా ఐక్యం చేయగలం? ఐక్య ప్రజా సంఘటనయొక్క ప్రధాన ప్రాతిపదిక సామ్రాజ్యవాదంతో రాజీలేని పోరాటం జరపడం; కార్మికులు — కర్షకులు చురుగ్గా ఆ పోరాటంలో పాల్గొనడం దానికి బలం." ("సోషలిజం గురించి నెహ్రూ" — పేజీ 65).

ఇంకా యిలా వివరించారు : "ప్రజలతో మన సంబంధాలను ఇంకా యెక్కువగా పెంపొందించుకోడానికి మరొక పద్ధతినికూడా చేబట్టవలసియుంటుంది, అదేమంటే, ఉత్పత్తిదార్లుగా వారిని సంఘటితపరచి, అట్టి సంఘాలను కాంగ్రెసుకు అనుబంధించాలి. లేదా రెండిటిమధ్య పూర్తి సహకారం ఉండేటట్లు చూడాలి: ట్రేడ్ యూనియన్లు, రైతు సంఘాలు, తదితర సామ్రాజ్య వ్యతిరేక సంస్థలను యీ విధమైన అన్యోన్య సహకార వ్యవస్థలో సమీకరించాలి. దీని లక్ష్యం ప్రజల శ్రేయస్సుకై పాటుపడ్డం. జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడమూను. ఈ విధంగా, కాంగ్రెసులో వ్యక్తులూ, సంఘాల ప్రతినిధులుకూడ సభ్యులుగా ఉంటారు. అది తన స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకొంటూ, యితర ప్రజాశక్తులపై ప్రభావం కలుగజేస్తూ తనపై యితర ప్రజాశక్తుల ప్రభావం పడేటట్లు చేయవచ్చు...

"ఇవన్నీ చాల పెద్ద మార్పులు...కాని, భారతదేశపుగడ్డపై మనం నిల్చబడదలచుకొంటే, కోట్లాది ప్రజలనుంచి మనం బలాన్నీ ఊపిరినీ పొందదలచుకొంటే, ఎంతవరకైనా మనం ముందడుగు వేయాలి ...

ఈ విధంగా కాంగ్రెసు సంస్థ ప్రజల ఆర్థిక పోరాటాలతో సంబంధమేర్పరచుకుంటే, అది వారికి మరింత సన్నిహితమయి, స్వాతంత్ర్యానికి మరింత చేరువలోకి వస్తుంది." (పై పుస్తకమే పేజీ 80-82)

తర్వాత, ఫెయిజ్‌పూర్ మహాసభలో నెహ్రూ ట్రేడ్ యూనియన్ల రైతు సంఘాల సమష్టి ప్రాతినిధ్య సూత్రాన్ని గురించి మరింత గట్టిగా

చెప్పారు. "ఇప్పుడు గాని, యికమీదట గాని కాంగ్రెసులో ఒక విధమైన సమష్టి ప్రాతినిధ్యం అమలు జరిగి తీరుతుంది; అది అత్యంత వాంఛనీయమైన విషయం...మన అసలు లక్ష్యం, దేశంలోని సామ్రాజ్య వ్యతిరేక శక్తులన్నిటితో ఒక బలమైన ఐక్య సంఘటనను నిర్మించడం...అట్టి సంఘటనలో కార్మిక సంఘాలు, రైతు సంఘాలు చురుగ్గా పాల్గొంటే, దాని బలం పెరుగుతుంది. అందుచేత, మనం దాన్ని ఆహ్వానించాలి." (పై పుస్తకమే - పేజీ 101).

కాని, కాంగ్రెసులో మితవాద నాయకుల ప్రాబల్యం వల్ల, ట్రేడ్ యూనియన్లకు, రైతు సంఘాలకు సమష్టి ప్రాతినిధ్య మీయాలనే ప్రతిపాదన నిరాకరింపబడింది.

అయినప్పటికీ, కాంగ్రెసులో కమ్యూనిస్టుల, యితర అతివాద శక్తుల పలుకుబడి నానాటికి పెరిగింది. అనేక రాష్ట్ర కాంగ్రెసు కమిటీలలో కమ్యూనిస్టులు, అతివాద కాంగ్రెసు సోషలిస్టులు నాయకత్వ స్థానాల కెన్నుకోబడ్డారు. 1939 నాటికి అఖిలభారత కాంగ్రెసు కమిటీలో వీరు 40 శాతం వరకు ఉండేవారు. ఈ అఖిలభారత కాంగ్రెసు కమిటీయే ఒక మహాసభకు. మరో మహాసభకు మధ్య పాలసీలను నిర్ణయించే అత్యున్నత సంస్థ,

కార్మికుల్లోను, రైతుల్లోను, విద్యార్థుల్లోను పోరాట వెల్లువ ఉచ్ఛస్థాయి నందుకోవడం, దేశం మొత్తంమీద సామ్రాజ్య వ్యతిరేక చైతన్యం పెరగడం, అతివాద శక్తులు తమ కార్యకలాపాల ద్వారా యీ వెల్లువను సక్రమమార్గంలో నడపడం—యీ కారణాలవల్ల కాంగ్రెసు సభ్యత్వం 1936 లో 6.00,000 నుంచి 1939 లో 50,00,000 లకు పెరిగింది.

పైన ఒక అధ్యాయంలో నేను చెప్పినట్టు, కాంగ్రెసుకూడా యీ దశలో మరింత చైతన్యయుతమైన అంతర్జాతీయ దృక్పథ మేర్పరచుకొంది.

1936 లో బ్రసెల్స్‌లో జరిగిన ప్రపంచ శాంతి మహాసభలో కాంగ్రెసు పాల్గొంది సామ్రాజ్యవాద దోపిడీపై ఆధారపడే శాంతి

స్థిరంగా నిలవదనీ, సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని కొనసాగ నిచ్చినంతకాలం సంధీ పత్రాలకు విలువ ఉండదనీ స్పష్టమైన ఒక ప్రకటనచేసి, అంతర్జాతీయ శాంతి ప్రచారక కమిటీలో అనుబంధ సంస్థగా చేరింది.

ఆ సంవత్సరంలోనే, ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు మహాసభ యిలా తీర్మానించింది :

"ఫాసిస్టు దురాక్రమణ మరింతగా హెచ్చింది. ఫాసిస్టు రాజ్యాలు యూరపుమీద, ప్రపంచంమీద పెత్తనం చెలాయించి, రాజకీయ-సామాజిక స్వాతంత్ర్యాన్ని నాశనం చేసేటందుకు తమలో తాము యుద్ధ కూటములు నిర్మించుకొంటున్నాయి. ప్రపంచంలోని అభ్యుదయకర జాతుల, ప్రజల సహకారంతో యీ ప్రమాదాన్నెదుర్కోవడం అవసరమని కాంగ్రెసు పూర్తిగా గుర్తిస్తోంది. ప్రపంచంలోని పరాధీన జాతులతోను, సోవియట్ యూనియన్ ప్రజలతోను భారత ప్రజలు చేతులు కలుపుతున్నారని కాంగ్రెసు ప్రకటిస్తోంది."

కాంగ్రెసు కేవలం తీర్మానాలు మాత్రమే చేసి ఊరుకోలేదు. వాటిని దేశమంతటా బహిరంగసభల ద్వారా వివరించారు. ఫాసిస్టు రాజ్యాలు ఆఫ్రికాలోను (అబిసీనియా), ఆసియాలోను (చైనా) జరిపిన దురాక్రమణలను ఖండించడానికి దినోత్సవాలు జరిగాయి. స్పెయిన్‌లో ఫ్రాంకో తిరుగుబాటుదార్లను ప్రతిఘటించేందు కేర్పడ్డ అంతర్జాతీయ సైనిక బ్రిగేడ్‌లో భారతీయులు చేరారు. స్పానిష్ రిపబ్లిక్‌కు భారతీయుల తరఫున అభినందనలు తెలియజేయడానికి నెహ్రూ స్వయంగా అక్కడ యుద్ధ రంగాలను సందర్శించారు. చైనాలో జపాన్ దురాక్రమణ నెదుర్కొంటూ పోరాడుతూన్న దేశభక్త సైనికులకు సహాయం చేసే నిమిత్తం కాంగ్రెసు ఒక వైద్య బృందాన్ని పంపింది. చైనా సహాయార్థం విరాళాలు వసూలు చేయబడ్డాయి. జపాన్ సరకుల బహిష్కరణోద్యమం కొనసాగింది. ఇలాంటి కార్యక్రమా లింకా అనేకం జరిగాయి. కాబట్టి భారతదేశం వలస విముక్తి ఉద్యమంపట్ల ఫాసిస్టు వ్యతిరేక పోరాటం పట్ల ప్రదర్శించిన సౌహార్దత మాటలకు మాత్రమే పరి

మితం కాలేదు. బ్రిటిష్ కసాయి పాలన క్రింద క్రుంగుతూన్న భారత దేశం ఆనాడు ఏ మేరకు సహాయం చేయగలదో ఆ మేరకు సహాయం చేసింది.

రెండవ ప్రపంచయుద్ధపు కారుమేఘాలు దట్టంగా అలముకొన్న సమయంలో, 1939 లో, త్రిపురీ కాంగ్రెసు మహాసభ యిలా తీర్మానించింది:

"మ్యూనిక్ ఒడంబడికకు, ఆంగ్లో-ఇటాలియన్ ఒప్పందానికి, ఫ్రాంకో స్పెయిన్ గుర్తింపుకు దారితీసిన మొత్తం బ్రిటిషు విదేశాంగ విధానాన్ని కాంగ్రెసు పూర్తిగా గర్హిస్తోంది. ఇది ఉద్దేశ పూర్వకంగా ప్రజాస్వామ్యానికి ద్రోహంచేసే విధానం; పదేపదే వాగ్దానాలను భగ్నంచేసే విధానం, సమష్టిభద్రతావ్యవస్థను నాశనమొనర్చేవిధానం; ప్రజాస్వామ్యానికీ స్వాతంత్ర్యానికీ బద్ధ శత్రువులైన ప్రభుత్వాలతో చేతులు కలిపే విధానం...ఫాసిస్టు రాజ్యాలకు ఎడతెగకుండా సహాయంచేసి, ప్రజాస్వామ్యదేశాల వినాశానికి తోడ్పడ్డ యీ బ్రిటిషు విదేశాంగ విధానంతో కాంగ్రెసు ఏమాత్రం ఏకీభవించదు."

భారతజాతీయోద్యమంపై సోవియట్ యూనియన్ కలుగజేసిన గొప్ప ప్రభావానికి మరొక తార్కాణమేమంటే, స్వతంత్ర భారతదేశం ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి ప్రణాళిక లెంతో అవసరమని గుర్తించడం.

దాదాభాయ్ నౌరోజీ, రెనడే, విశ్వేశ్వరయ్య మొదలైన దేశభక్తులు ఆర్థికవేత్తలు దశాబ్దాల క్రిందట బ్రిటిషుపాలనవల్ల మనదేశం ఎలా కొల్లగొట్టబడిందో, ఎంత దారిద్ర్యానికి గురిచేయబడిందో నిరూపించడమేకాక, ఆర్థికంగా దేశం అభివృద్ధిచెందడాని కేమేమి చేయాలోకూడ సూచించారు. గాంధీజీమాత్రం గ్రామీణ పరిశ్రమలమీద ఆధారపడే స్వయంపోషక ఆర్థిక వ్యవస్థకోసం తీవ్రంగా ప్రచారంచేశారు. ఆధునిక సాంకేతిక విజ్ఞానాన్ని సాధ్యమైనంతవరకు లేకుండా చేయడం ఆయన అభిమతం.

అయితే, రక్షణ సుంకాల ద్వారాను, ప్రభుత్వ సహాయంతోను

జాతీయ పరిశ్రమలను స్థాపించుకోవాలన్న మేరకు ఆ ఆర్థిక వేత్తల సూచనలు పరిమితమయ్యాయి. ఇక గాంధీజీ సూచనలు ఆయన అనుచరులకు మాత్రమే నచ్చాయి.

కాని, సోవియట్ యూనియన్ అనుభవం, ముఖ్యంగా 1933 లో మొదట పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యాక, మనదేశంపై కలుగజేసిన ప్రభావం పూర్తిగా కొత్తది. సరకులను ఉత్పత్తిచేయడం లగాయతు ప్రజలకు వాటిని అందుబాటులోకి తెచ్చేవరకు మొత్తం జాతీయ ఆర్థిక వ్యవస్థను ప్రణాళికా బద్ధమొనర్చడం; ఏ ప్రణాళిక అయినా విజయవంతమవాలంటే భూమిపై ఫ్యూడల్ యాజమాన్యాన్ని రద్దుచేయాలనీ, ఆర్థిక వ్యవస్థలో కీలకమైన శాఖలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలనే అవగాహన; ప్రజల జీవన ప్రమాణాలను పెంచడం ప్రధాన లక్ష్యంగా పెట్టుకొన్న ఏ ప్రణాళికయినా సోషలిస్టు దృక్పథంతో రూపొందింపబడాలనే అవగాహన —యీ అభిప్రాయయాలన్నీ భారతదేశంలో వ్యాప్తిచెందడానికి కారణం సోవియట్ యూనియన్, సోవియట్ ప్లానింగూను.

ఈ విషయాన్ని నెహ్రూ తరచు అంగీకరించేవారు. దేశంలో ఆర్థిక ప్రణాళికల అవసరాన్ని తెలియజేసేందుకు, స్వతంత్రభారతం యొక్క ఆర్థిక స్వరూపమెలా ఉండాలో ప్రజలు ఆలోచించేటట్లు చేయడానికి ఆయన "పియాతిలెత్కా" అనే శీర్షికతో ("మొదటి సోవియట్ పంచవర్ష ప్రణాళిక") ఆయనొక వ్యాసం కూడా వ్రాశారు. అయితే, ఏ ఆర్థిక ప్రణాళికనైనా అమలు జరపాలంటే మొదట బ్రిటిషు పాలననుంచి స్వాతంత్ర్యం సంపాదించుకోవాలని గట్టిగా చెప్పేవారు,

వీటన్నిటి ఫలితంగా. కాంగ్రెసు 1938 లో జాతీయ ప్రణాళికా సంఘాన్నేర్పరచింది. అది కాంగ్రెసు నియమించిన సంఘమవడంచేత అందులో అతితీవ్రవాదులు లగాయతు పెద్ద పెట్టుబడిదార్లవరకు అన్ని తరహాలవారికి సభ్యత్వమీయబడింది.

ఆ సంఘం దీక్షగా పనిచేయసాగింది. ఒక్కొక్క విభాగానికొక్కొక్క ఉపసంఘం చొప్పున అనేక ఉపసంఘాలను నియమించింది.

1939 లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమవడంవల్ల ఆ సంఘం తన పనిని పూర్తిచేయలేకపోయినప్పటికీ, కొన్ని రిపోర్టులను అది తయారుచేసి ప్రచురించింది.

మొదటినుంచీ సోషలిస్టు భావాలుగల అతివాదులకూ, పెద్ద పెట్టుబడిదార్ల ప్రతినిధులకూ మధ్య ప్రణాళికా సంఘంలో సంఘర్షణ జరిగేది. కాని, అతివాదులు అధికసంఖ్యలో ఉండడంవల్ల ఆ సంఘం చాల అభ్యుదయకరమైన సూచనలు చేసింది; వాటిలో కొన్ని తీవ్రవాదపూరితమైనవి కూడా ఉన్నాయి.

జాతీయ ప్రణాళికా సంఘం చేసిన అనేక సూచనలు ఒక మూల సూత్రంమీద ఆధారపడ్డాయి. దాన్ని ప్రణాళికా సంఘం ఆమోదించింది. అదేమంటే, ప్లానింగు ఉద్దేశం సామాన్యమైన మానవుణ్ని పైకి తీసుకు రావడం; దాని సారాంశం ఆర్థిక వ్యవస్థను హెచ్చుగా కంట్రోలు చేయడం, క్రమబద్ధమొనర్చడం, సమన్వయమొనర్చడమూను; ప్రైవేట్ రంగానికి స్థానం ఉండాలిగాని, దాన్ని కఠినంగా అదుపులో ఉంచాలి. ప్రజావసర పరిశ్రమలు, రక్షణ పరిశ్రమలు, కీలకపరిశ్రమలు ప్రభుత్వ యాజమాన్యంక్రింద. ప్రభుత్వ మేనేజిమెంటులో ఉండాలనే స్పష్టమైన వైఖరిని అధికసంఖ్యాక సభ్యులు అవలంబించారు.

ప్రణాళికా సంఘం చాలవరకు తీవ్రస్వభావంగల వ్యవసాయ సంస్కరణాలను సూచించింది; తేలిక పరిశ్రమలకన్న భారీ పరిశ్రమల కెక్కువ ప్రాధాన్య మీయాలని సిఫార్సు చేసింది.

ఈ విధంగా. జాతీయ ప్రణాళికా సంఘంచేసిన సూచనలు. సిఫార్సులు సోషలిస్టు స్వభావంగలవి కాకపోయినా, సామ్రాజ్య వ్యతిరేక — ఫ్యూడల్ వ్యతిరేక—గుత్తాధికార వ్యతిరేక స్వభావం గలవి.

ఈ పరిణామా లిలా జరుగుతూండగా, యూరపులో రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభమయింది. భారతదేశంకూడా యుద్ధంలో

పాల్గొంటుందని వైస్రాయి 1939 సెప్టెంబరు 3 వ తేదీని ప్రకటించాడు.

దీనికిముందే ఏప్రిల్ నెలలో జాతీయ కాంగ్రెసు యుద్ధ వ్యతిరేక దినం జరిపింది, వైస్రాయి ప్రకటన వెలువడ్డ తర్వాత, బొంబాయి కార్మికవర్గం అక్టోబరు 2 వ తేదీని బ్రహ్మాండమైన నిరసన సమ్మె జరిపింది.

ఇది భారత స్వాతంత్ర్య పోరాటంయొక్క చివరి అధ్యాయానికి నాందీ వాచకం, అంతకుముందు అధ్యాయానికి ఉపసంహారమూను.

# ఏడవ అధ్యాయం

# ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం, స్వాతంత్ర్యం

యుద్ధం విషయమై భారతదేశం త్వరితంగానే స్పష్టమైన నిర్ధారణకు వచ్చింది. వివేకవంతులైన రాజకీయవాదుల్లో ఎవరూ బ్రిటన్ ఫాసిస్టు వ్యతిరేక (నాజీ వ్యతిరేక) ప్రగల్భాలను నమ్మలేదు. యూరపులో ప్రజాతంత్రశక్తుల్ని అమానుషంగా హత్యాకాండకు గురిచేసిన ఫాసిస్టు రక్కసులకు బ్రిటిషు ప్రభుత్వం కొన్ని సంవత్సరాలుగా ఎలా సహాయం చేస్తూవచ్చిందో అందరికీ తెలిసిందే. ఒకవైపు సమష్టిభద్రతా సూత్రాన్ని కొనియాడుతూనే, మరోవైపు హిట్లరు తూర్పు యూరపు దేశాలపైన. సోవియట్ యూనియన్‌పైన దాడిచేసేటట్లు బ్రిటన్ పురిగొల్పుతూ వచ్చింది.

నిజానికి, బ్రిటిషు — ఫ్రెంచి పాలకుల కపట నాటకం చివరకు బ్రిటిషు రాజనీతిజ్ఞులకే ఎదురుతిరిగినందుకు దేశంలో కొంతవరకు సంతోషమే వ్యక్తమయింది. బలవంతుడైన ఒక దుండగుని అంతకంటే దుండగుడు "దగా" చేసినందు కెవరూ సానుభూతి చూపేస్థితిలో లేరు.

క్రమంగా దేశంలో నిరసన సభలు, సమావేశాలూ, ప్రత్యక్ష కార్యాచరణ ప్రారంభమయ్యాయి. తర్వాత, యుద్ధం ఫలితంగా జీవితావసర వస్తువుల ధరలు, జీవన వ్యయపరిణామం పెరగడంతో, కార్మికులు అధికధరల అలవెన్సును కోరుతూ అనేక సమ్మెలు చేశారు. బొంబాయిలో చాల పెద్ద సమ్మె జరిగింది. ఇట్టి సమ్మెలు కొంతమేరకు జయప్రదమయ్యాయి. ఎందుచేతనంటే, యజమానులు యుద్ధకంట్రాక్టులలో విపరీత లాభాలు సంపాదించ నారంభించారు.

జాతీయ కాంగ్రెసు ఎంతో జాగరూకతతో ద్వంద్వవైఖరి నవలం

బించింది, యుద్ధం సామ్రాజ్యవాద యుద్ధమనీ, నిజమైన ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం కాదనీ, అందుచేత దాన్ని వ్యతిరేకిస్తున్నామనీ కాంగ్రెసు ప్రకటించలేదు. అయితే, భారతదేశంపై బలవంతంగా రుద్దబడిన యుద్ధాన్ని తాము బలపరచజాలమనీ, అందులో తాము పాల్గొనలేమనీ తెలియజేసింది. యుద్ధాన్ని బలపరచడమా, బలపరచకపోవడమా అనే విషయాన్ని నిర్ణయించుకోడానికి భారతీయులు ముందుగా స్వాతంత్ర్యం పొందాలని చెప్పింది. క్రియలో దీని అర్థమేమంటే. బూర్జువావర్గం రాజకీయంగా యుద్ధంలో పాల్గొనాలని సామ్రాజ్యవాదం కోరితే. ఆ వర్గానికి కొన్ని సంతృప్తికరమైన సౌకర్యాలీయాలి.

భారత కమ్యూనిస్టుపార్టీ, కార్మిక సంఘాలు, రైతుసంఘాలు యిలా కాక, ఖచ్చితమైన వైఖరి నవలంబించాయి. ఈ యుద్ధం సామ్రాజ్యవాద యుద్ధమనీ అందుచేత భారత ప్రజలు బ్రిటిషు పాలనను కూలద్రోయడానికి ప్రజా విప్లవోద్యమాన్ని నిర్మించుకోవాలని తెలియచేశాయి. అంతకు ముందు కొన్ని సంవత్సరాలుగా కమ్యూనిస్టులు బహిరంగ కార్యకలాపాల్లో పాల్గొనడానికి (పార్టీపేరుతో కాకపోయినప్పటికీ) స్వేచ్ఛ ఉండేది. అది యుద్ధం ప్రారంభమవడంతో పోయింది. అనేకమంది పార్టీ నాయకులు రహస్య జీవితం గడపసాగారు. కేంద్ర కమిటీలోను, రాష్ట్ర కమిటీలలోను కొందరు నాయకులుమాత్రం మిగిలారు. చాలమంది ముఖ్య నాయకులు అకస్మాత్తుగా అరెస్టు చేయబడి జైళ్ళలో నిర్బంధింపబడ్డారు.

గాంధీజీ నాయకత్వం క్రింద కాంగ్రెసు నామమాత్రమైనా నిరసన చర్యకు పూనుకొంది. సత్యాగ్రహం చేయడానికి అనుమతిపొందిన వ్యక్తులు తాము యుద్ధానికి వ్యతిరేకమని బహిరంగంగా ప్రకటించి అరెస్టుకావడం; ఇదే వ్యక్తిగత సత్యాగ్రహం. యుద్ధం ప్రారంభమయాక ఒక సంవత్సరం వరకు చెప్పుకోదగిన రాజకీయ పరిణామాలేవీ దేశంలో జరగలేదు.

కాని, ఫ్రాన్సు పతనమై, బ్రిటన్‌మీద హిట్లరు పెద్దయెత్తునవిమాన దాడులు ప్రారంభించడం, ఉత్తర ఆఫ్రికాపై దండయాత్ర, చైనా —

ఆగ్నేసియాలలో జపాన్ పురోగతి — వీటితో వాతావరణం ఉద్రిక్త మయింది. ప్రధాన నిర్ణయాలు చేయవలసిన తరుణం ఆసన్న మయింది. తటస్థమార్గ మవలంబించడం యిక అసాధ్యమయింది.

1941 జూన్‌లో హిట్లరు సోవియట్ యూనియన్‌పై దాడిచేయ డంతో, యుద్ధం అత్యంత తీవ్రమైన, నిర్ణయాత్మకమైన ఘట్టంలో ప్రవే శించిందని సర్వత్రా గుర్తింపబడింది. సోవియట్ యూనియన్ యుద్ధంలో ప్రవేశించడంతో, అంతకుముందు లేని ఖచ్చితమైన ఫాసిస్టు వ్యతిరేక లక్షణం దాని కేర్పడిందని అనేకులు భావించారు.

ఒకవైపు, సోవియట్ యూనియన్ పట్ల దేశంలో విస్తృతమైన సానుభూతి వ్యక్తమయింది. జర్మనీ, జపాన్ సేనలచే ఆక్రమించుకో బడిన దేశాల భవిష్యత్తు ఎంత భయానకంగా ఉంటుందోనన్న ఆందోళన హెచ్చింది. రెండో వైపు, దేశంలో నిర్బంధ విధానం నానాటికీ తీవ్ర మవుతూండడం వల్ల, ప్రజాతంత్ర హక్కులన్నీ అపహరింపబడ్డంవల్ల, జాతీయ వాంఛను యీడేర్చేటందుకు స్వల్ప అధికారం కూడా యివ్వడా నికి బ్రిటిష్ ప్రభుత్వం నిరాకరించడం వల్ల ప్రజల్లో పాలకవర్గం పట్ల ద్వేషం ఆగ్రహం హెచ్చాయి

1941 చివరి మాసాల్లో కాంగ్రెసు నాయకులు జైళ్ళనుంచి విడు దల చేయబడ్డారు. అలా విడుదల కాగానే, సోవియట్ యూనియన్ యుద్ధంలో ప్రవేశించడంతో దాని స్వభావం పూర్తిగా మారిపోయిందనీ, ఒక దశాబ్దంగా ఫాసిజాన్ని ఖండిస్తూ వచ్చిన కాంగ్రెసు యుద్ధంపట్ల తన వైఖరిని తదనుగుణంగా మార్చుకోవాలనీ అతి ఖచ్చితంగా ప్రక టించిన మొట్టమొదటి కాంగ్రెసు నాయకుల్లో నెహ్రూ ఒకరు. కాని, బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశం పట్లా, భారతదేశంలోనూ అవలంబిస్తూన్న మొండివైఖరి వల్ల ఆయన యితరుల మాదిరిగానే నిరాశతోను, క్రోధం తోను కుమిలిపోయారు.

ఒక్కొక్కప్పుడు ఆయనతో కొందరు, బ్రిటిష్ భారాన్ని ఒక శతాబ్దం మోశాంకదా, జపాన్ విషయ మేమిటో కొన్నాళ్ళెందుకు చూడ

కూడదని అడిగేవారు. అలా అడిగినవారి యెడల ఉగ్రుడై, అది బానిస ప్రవృత్తి తప్ప మరొకటి కాదని ఆయన చీదరించుకొనేవారు. అయితే, బ్రిటిష్ పాలకులు దేశరక్షణ పేరుతో తనను బానిసగా పరిగణించడాన్ని కూడా ఆయన సహించలేదు.

ఆనాడు భారతదేశంలో బ్రిటిష్ సైన్యం విస్తారంగా ఉండేది. జపాన్ దురాక్రమణ నుంచి మన దేశాన్ని కాపాడేందుకని తీసుకురాబడిన యీ బ్రిటిష్ సైనికులు మన స్వాతంత్ర్యోద్యమాన్నణచేటందు కెలా ఉపయోగింప బడ్డారో జ్ఞాపక ముంచుకోవాలి. అంతేకాదు. పెద్ద పెద్ద నగరాల్లో సైతం బ్రిటిషు సైనికులెంత ఘాతుకంగా వ్యవహరించేవారో కూడ జ్ఞాపక ముంచుకోవాలి. బొంబాయి, కలకత్తా నడి వీధుల్లో నడిచి వెళ్ళే భారత స్త్రీల శీలం తరచు సురక్షితంగా ఉండేదికాదు.

ఆత్మ గౌరవం గల అధిక సంఖ్యాక ప్రజల్లో యీ విధమైన నిస్సహాయత సహించరానిదిగా కనిపించింది. ఒకవైపు యిల్లు భగ్గున మండుతోంది, ఇది అందరి కళ్ళ యెదుట కనిపిస్తున్న వాస్తవం. అట్టి సమయంలో, పంజరంలో చిలుక ఊచలు విరగ్గొట్టుకొని బయట పడనిదే మంటల్నెలా ఆర్పగల్గుతుంది? ఇదీ ఆనాటి జాతీయ మనోభావం.

బ్రిటిషు ప్రభుత్వం 1942 తొలి రోజుల్లో మన దేశాని కొక రాయబార వర్గాన్ని పంపింది. ఇందుకొక కారణం, ఆనాడు అది దారీ తెన్నూ కానని అగమ్య స్థితిలో ఉంది. మరో కారణం, భారత కార్మికవర్గ, జాతీయోద్యమం సాంప్రదాయకంగా ఫాసిస్టు వ్యతిరేక పాత్ర నిర్వహిస్తూ రావడం వల్ల జాతీయ నాయకుల్ని సులభంగా తమ పురోగతి వైపు తిప్పుకోగలమని ఆశించడం.

కాంగ్రెసు నాయకులు కూడా, అంతర్జాతీయ పరిస్థితి యొక్క తీవ్రతను గుర్తించి, హిట్లరు కకేసస్ మీదుగాను, జపాన్ బర్మా మీదుగాను చుట్టుముట్టే ప్రమాదాన్ని గ్రహించి, కేంద్రంలో ఎంతో కొంత నిజమైన అధికారం యిచ్చే పక్షంలో యుద్ధ కృషికి ప్రజలను సమీకరించేందుకు సంసిద్ధత ప్రకటించారు. కాని, బ్రిటిషు ప్రభుత్వం అందుకు

కూడా ఒప్పుకోలేదు. చర్చిల్ భారతదేశాన్ని జపాన్‌కు ధారాదత్తం చేయ డానికైనా సిద్ధపడ్డాడు గాని, భారతీయులకు అధికార మియడాని కంగీక రించలేదు.

అందుచేత, సంప్రతింపులు భగ్నమయాయి.

అయినప్పటికీ, అఖిలభారత కాంగ్రెసు కమిటీ బ్రిటిషు రాయబార వర్గపు బూటకపు సూచనలను తిరస్కరిస్తూ చేసిన తీర్మానంలో, తన ఫాసిస్టు వ్యతిరేక వైఖరిని మరొకసారి స్పష్టం చేస్తూ, ప్రత్యేకంగా సోవి యట్ ప్రజల పట్ల సానుభూతిని ప్రకటించి, సోవియట్ యూనియన్‌లో ఒక నూతన సమాజ నిర్మాణానికై జరుపుతూన్న కృషిని శ్లాఘించింది. జపాన్ దురాక్రమణ నెదుర్కొంటూ వీరోచితంగా పోరాడే చైనా ప్రజల పట్ల కూడా తన సానుభూతిని ప్రకటించింది.

గాంధీజీ పత్రికా విలేకరుల సమావేశంలో, తాను జపాన్ పక్షం వహించడం లేదనీ, జపాన్ భారత దేశాన్ని స్వాధీనం చేసుకుంటే ఔష ధమే వ్యాధికంటే ఎక్కువ ప్రమాదకర మవుతుందనీ తెలియజేశారు, అట్టి పరిస్థితుల్లో బ్రిటన్‌కంటే భారతదేశం ఎక్కువ నష్టపడుతుందన్నారు. ఎందుచేతంటే, బ్రిటన్ కోల్పోయేది భారతదేశాన్ని మాత్రమే; కాని భారతదేశం సర్వస్వాన్నీ కోల్పోతుంది.

అయినా బ్రిటిషు ప్రభుత్వం కొంచెంకూడా కదలలేదు. రెండో వైపు, బ్రిటిషు నిరంకుశాధికార్ల తలపొగరు విధానాలకు వ్యతిరేకంగా ప్రజల్లో అసంతృప్తి జ్వాలలు మిన్నంటసాగాయి. గాంధీజీ "హరిజన్" పత్రికలో బ్రిటిషు పాలకుల్ని దేశం విడిచిపొమ్మని హెచ్చరిస్తూ ఒక వ్యాసం వ్రాశారు. అదే, సుప్రసిద్ధ "క్విట్ ఇండియా" వ్యాసం,

ఇట్టి మహోద్రిక్త వాతావరణంలో అఖిలభారత కాంగ్రెసు కమిటీ బొంబాయిలో 1942 ఆగస్టు 8 తేదేని సమావేశమయింది. ఆ సమా వేశంలోనే ప్రఖ్యాత తీర్మానం ఆమోదింపబడింది, దానికి "పోరాడుదాం, లేదా మరణిద్దాం." అనే క్రియాత్మక నినాదాన్ని గాంధీజీ చేర్చారు.

సంక్షోభం యొక్క యీ విపరీత క్షణంలోకూడ "క్విట్ ఇండియా" తీర్మానంలో యీ క్రింది వాక్యాలున్నాయి :

"చైనా, రష్యాల స్వాతంత్ర్యం అమూల్యమైనట్టిది; అది రక్షింపబడాలి. ఆ దేశాల రక్షణకు ఏ విధమైన యిబ్బందీ కలిగించకూడదని అఖిలభారత కాంగ్రెసు కమిటీ అభిప్రాయ పడుతోంది. ఇలాగే మిత్ర రాజ్యాల రక్షణ పాటవాన్ని కూడ ప్రమాదంలో పెట్టకూడదని అ. భా. కాం. కమిటీ భావిస్తోంది. అయితే, భారతదేశానికీ, పై దేశాలకూ కూడ నేడు ప్రమాదం హెచ్చింది. ఈ పరిస్థితుల్లో విదేశీ ప్రభుత్వానికి దాసోహం చేయడడ భారతదేశానికి అవమానకరమే గాక, దాని ప్రతి ఘటన శక్తిని కుంచించివేయడమే గాక, నానాటికీ హెచ్చుతూన్న యీ ప్రమాదాన్ని నివారించడమూ జరగదు, మిత్రరాజ్య ప్రజలకు సహాయం చేయడమూ జరగదు."

కేంద్రంలో జాతీయ ప్రభుత్వం స్థాపింపబడాలనే అ. భా. కాం. కమిటీ కోర్కెను కమ్యూనిస్టు పార్టీ బలపరచింది. కాని, యుద్ధం ఆనాడు జాతీయ రక్షణ యుద్ధంగా రూపొందడం వల్ల, యుద్ధ కృషిలో పాల్గొనేందుకు బ్రిటిష్ ప్రభుత్వం జాతీయ వాంఛను అంగీకరించాలని షరతు విధించకూడదని తెలియజేసింది.

ఆగస్టు 9 తేదీ తెల్లవారుఝామున మొత్తం కాంగ్రెసు నాయకులందరూ అరెస్టు చేయబడ్డారు. వెంటనే దేశంలోని అనేక ప్రాంతాల్లో పట్టణాలు, నగరాలు తిరుగబడ్డాయి. టెలిగ్రాఫ్ తీగలు త్రెంచివేయబడ్డాయి; మైళ్ళకు మైళ్ళు రైలు పట్టాలు ధ్వంసం చేయబడ్డాయి; రైళ్ళు పడగొట్టబడ్డాయి.

త్వరలోనే యీ వెల్లువ గ్రామీణ ప్రాంతాలకు కూడ వ్యాపించింది. అనేక ప్రాంతాల్లో బ్రిటిషు పాలన నెలల తరబడి స్తంభించి పోయింది (ఉదా : యు. పి. లో గాజీపూర్ జిల్లా, మహారాష్ట్రంలో సతారా జిల్లా, బెంగాల్లో మిడ్నపూర్ జిల్లా).

దేశమంతటా తుపాకి కాల్పులు జరిగాయి; వందలాది ప్రజలు మరణించారు. వేలమంది జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. ఏ ప్రాంతాల్లో ఉద్యమం దృఢమైన ప్రజా ప్రతిఘటన రూపం ధరించిందో, ఆ ప్రాంతాల్లో బ్రిటిషు సైన్యం ప్రజల్ని రక్తపుటేరుల్లో ముంచింది.

కేంద్రంలో జాతీయ ప్రభుత్వం స్థాపింపబడాలనీ, అరెస్టు చేయబడిన నాయకులందరినీ విడుదలచేయాలనీ కమ్యూనిస్టుపార్టీ నిర్విరామంగా ప్రచారం చేసింది. అదే సమయంలో, ప్రజల్ని దేశరక్షణకై ఉత్తేజపరచేందుకు కృషిసల్పింది. తాను విదేశీపాలనను బలపరచడంలేదనీ, మాతృదేశ రక్షణకై తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాననీ చిత్తశుద్ధితో నొక్కి చెప్పింది,

అయితే, ఆనాటి పరిస్థితుల్లో, మన ఉద్దేశమెంతమంచిదైనా పరిమితస్థాయిలోతప్ప (పార్టీ సభ్యుల పట్టుదల, దృఢవిశ్వాసం ఫలితంగా) దాన్ని సాధించడం అసంభవం. దేశంలోని స్వాతంత్ర్య ప్రియుల్లో అత్యధిక సంఖ్యాకులు, దేశం ఒకవైపు స్వాతంత్ర్యం కొరకు పోరాడుతూంటే "కమ్యూనిస్టులు అవలిపక్షంలో ఉన్నా"రని భావించారు. మన మనుసరించిన మార్గం ఆ తర్వాత చాలా పెద్దనష్టం కలిగించింది.

ప్రజలులేని దేశరక్షణ అర్థరహితమనే వాస్తవం ఎవరికైనా సులభంగా బోధపడుతుంది.

భారతదేశంలో బ్రిటిషు కసాయి చర్యలను నెహ్రూ ఎంత తీవ్రంగా ఖండించినప్పటికీ, బ్రిటిషు యుద్ధ ఆశయాలకూ, సోవియట్ యుద్ధ ఆశయాలకూగల స్పష్టమైన భేదాన్ని ఆయన జైల్లోనైతేం గుర్తించారనేది అత్యంత ప్రధానమైన విషయం. ఈ వ్యత్యాసాన్ని ఆయన "భారత దర్శనం"లో ఎంతో చక్కగా వివరించారు.

బ్రిటిషు సార్వభౌముని ప్రధాన మంత్రిగా తానున్నది బ్రిటిషు సామ్రాజ్య పతనానికి అభినందన సందేశ మీయడానికి కాదని ప్రకటించిన చర్చిల్ వైఖరికీ, సోవియట్ యుద్ధ ఆశయాలను వివరిస్తూ స్టాలిన్

1942 నవంబరు 7 వ తేదీని చేసిన ప్రకటనలో ద్యోతకమైన వైఖరికీ ఎంత తేడాఉందో తెలియజేయడానికి నెహ్రూ తన "భారత దర్శనం"లో (పేజీ 523) స్టాలిన్ మాటలనే యిలా పేర్కొన్నారు :

"వర్ణ విపక్షత నిర్మూలన; జాతులమధ్య సమానత్వాన్నీ ప్రతి యొక్క ప్రాదేశిక ఐక్యతనూ గుర్తించడం; పరాధీన జాతుల విముక్తి, వాటి సర్వం సహాధికారాల పునరుద్ధరణ; ప్రతి జాతి తన కిష్టమై విధంగా తన వ్యవహారాలను చక్కబరచుకునే అధికారం; బాధలకు గురైన జాతులకు ఆర్థిక సహాయం; అవి తమ సంక్షేమం కొరకు సాగించే కృషికి తోడ్పాటు; ప్రజాతంత్రహక్కుల పునరుద్ధరణ; హిట్లరు పాలనను ధ్వంస మొనర్చడం."

రెండవ ప్రపంచయుద్ధంలో బెంగాల్ వినాశకరమైన కరువురాక్షసికి గురయింది. 35 లక్షలమంది ఆ కరువుకు ఆహుతి అయారు. దేశం వర్ణనాతీతమైన బాధ లనుభవించింది.

కొన్నాళ్ళకు 1945 వ సంవత్సరం ప్రవేశించింది. అజేయమైన సోవియట్ సేనలు శత్రు ప్రతిఘటనను తుత్తునియలుచేస్తూ బెర్లిన్‌నగరం ప్రవేశించాయి. రీచ్‌స్టాగ్ భవనంమీద మే దినోత్సవంనాడు అరుణపతాకాన్ని ఆవిష్కరించాయి. ప్రపంచ చరిత్రలో మానవ నాగరికతకు, స్వాతంత్ర్యానికి ఎన్నడూ కలగనంతటి మహాప్రమాదాన్ని సోవియట్ యూనియన్ నివారించింది.

ఇతరదేశాలు, యితర జాతులు కూడ సహాయం చేశాయి; త్యాగాలు చేశాయి; బాధ లనుభవించాయి. కాని, లెనిన్ సృష్టించిన సోవియట్ యూనియన్ మాత్రమే, నూతన సోవియట్ మానవుడు మాత్రమే ప్రపంచాన్ని కాపాడగలిగాడు. ఆధునిక విజ్ఞానశాస్త్రం, సాంకేతిక విజ్ఞానం సహాయంతో మానవ జాతిని తిరిగి ఆటవిక దశకు గొనిపోయే ప్రమాదం ఆవిధంగా తప్పింపబడింది.

ఇందుకు మానవజాతి శాశ్వతంగా వారికి రుణపడి యుంటుంది.

రెండవ ప్రపంచయుద్ధం సమాప్తమై 1947 ఆగస్టులో స్వాతంత్ర్యం

సిద్ధించేవరకు భారత రాజకీయరంగంలో మూడు ప్రధాన లక్షణాలు గోచరిస్తాయి.

(1) కార్మిక - కర్షక వెల్లువ, జాతీయ విప్లవ వెల్లువ 1920 లో కంటే, 1930 లో కంటే ఉధృతరూపంలో, విస్తృతస్థాయిలో పెల్లుబకడం. (2) బ్రిటిషు సామ్రాజ్యవాదం హిందూ - ముస్లిం ఘర్షణలను పురిగొల్పడంద్వారా ఈ ప్రజా వెల్లువను విచ్ఛిన్నమొనర్చడానికి కుట్ర జరపడం. (3) అంతర్జాతీయంగాను, జాతీయంగాను ఏర్పడ్డ విప్లవ సంక్షోభంయొక్క ఒత్తిడి ఫలితంగా బ్రిటిషు పాలకులు అయిష్టంగా కాంగ్రెసు, ముస్లింలీగ్ నాయకులకు అధికారం ఒప్పజెప్పడం, రెండో వైపు దేశాన్ని రెండుగా విభజించి బలహీనమొనర్చడమూను.

ఈ మూటింటిలో మొదటి రెండూ సహజంగా రెండు సంవత్సరాల కాలంఅతి తీవ్రమైన ఘర్షణలో చిక్కుకున్నాయి: వాటిమధ్య సంబంధమే ప్రధానంగా మూడవదాని రూపురేఖలను దిద్దింది.

ఇతర లక్షణాలుకూడ లేకపోలేదు. యుద్ధానంతరం ఏ ప్రజా పోరాటాన్నీ నడపని కాంగ్రెసు నాయకత్వం, దేశాన్ని విభజించకుండా తనకే అధికారాన్ని స్వాధీనమొనర్చమని బ్రిటిషు పాలకులపై ఒత్తిడి తెచ్చేందుకు ప్రజావెల్లువను ఉపయోగించుకో దలచింది. రెండోవైపు, ముస్లింలీగ్ నాయకత్వం, బ్రిటిష్ పాలకులు వైదొలగేసమయం ఆసన్నమైందని గ్రహించు, పాకిస్తాన్ నినాదంతో ముస్లిం ప్రజానీకాన్ని హిందువులపై ఉసిగొల్పింది,

ఈ పరిణామాలన్నీ కలిసి 1947 ఆగస్టు 15 నాటి స్వాతంత్ర్యం యొక్క స్వరూప స్వభావాలను నిర్ణయించాయి.

ఆ దశ అంతటి చరిత్రను యిక్కడ వివరించడం అసందర్భమూ, అనవసరమూను. అయితే ఒకటి మాత్రం చెప్పడం చాలా అవసరం. అదేమంటే, యుద్ధానంతరం భారతదేశంలో హిందూ - ముస్లింల హత్యాకాండతప్ప మరొకటిలేదని తరచు అనేకులు చెప్పేమాటలు నిజంకాదు.

యుద్ధం సమాప్తమైనప్పటినుంచి 1946 ఆగస్టు వరకు, అంటే ముస్లింలీగ్ పాకిస్తాన్ స్థాపనకై ప్రత్యక్షపోరాటం జరపమని పిలుపు ఇచ్చే

వరకూ, భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అనన్య సామాన్యమైన విప్లవ ప్రజా పోరాటాలు జరిగాయి. వీటిలోను, యుద్ధానంతర సమ్మె పోరాటాల్లోను హిందువులు, ముస్లింలు ఐక్యతతో తమ ఉమ్మడి శత్రువైన సామ్రాజ్యవాదా న్నెదుర్కొన్నారు.

మొదటిది, 1945 నవంబరులో ముగ్గురు అజాద్ హింద్ ఫౌజ్ ఆఫీసర్లకు బ్రిటిష్ సైనిక న్యాయస్థానం విధించిన శిక్షలను నిరసిస్తూ అనేక నగరాల్లో బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిగాయి. కలకత్తాలో యిది హింసాత్మక ప్రజా పోరాటరూపం ధరించింది. శిక్షలు విధింపబడిన ఆఫీసర్లు షానవాజ్ దిలాన్, సైగల్‌లు. ఒకరు ముస్లిం, ఒకరు సిక్కు, మరొకరు హిందువు!

ఈ శిక్షలు స్వాతంత్ర్యోద్యమంపై దాడిగా ప్రజలు భావించారు. కలకత్తాలో అసంఖ్యాకమైన పారిశ్రామిక సంస్థల్లో పనిచేసే కార్మికులు—రవాణా కార్మికులతోసహా—సమ్మె చేశారు. నగరవాసులందరూ యీ నిరసన ప్రదర్శనంలో చేరారు. ప్రజలకు, బ్రిటిష్ సైన్యానికిమధ్య ప్రత్యక్ష పోరాటాలు జరిగాయి. అనేక ప్రదేశాల్లో ప్రజలు బ్యారికేడ్లు నిర్మించి పోరాడారు.

రెండవది, చిరస్మరణీయమైన నావికుల తిరుగుబాటు, 1946 ఫిబ్రవరిలో రాయల్ ఇండియన్ నేవీకి చెందిన వేలాది నావికులు జరిపిన పోరాటం పోటెమ్కిన్ నావికుల తిరుగుబాటును, తదనంతర రష్యా విప్లవ వెల్లువను జ్ఞప్తికి తెస్తుంది. భారత విప్లవోద్యమ చరిత్రలో యిది సువర్ణాక్షరాలతో లిఖింపబడిన అధ్యాయం.

అసహ్యకరమైన ఆహారం, వర్ణవిచక్షణ, యూరపియన్ అధికార్ల అవమాన చర్యల్లాంటి సమస్యలమీద యిది ప్రారంభమయింది, బొంబాయిలోని "తల్వార్" అనే ట్రెయినింగ్ ఓడమీద యీ పోరాటం ప్రారంభమయింది. అప్పటికి నావికు లందరిలో పోరాటదీక్ష ఏ స్థాయి నందుకొందంటే. అయిదు రోజుల్లో బొంబాయి, కరాచీ, కొచ్చిన్, కలకత్తా, విశాఖపట్నం రేవులలోని నావికులు తిరుగుబాటు చేశారు. భారత నావికులు పూర్తిగా స్వాధీనం చేసుకున్న నౌకలకూ, బ్రిటిషు ఆఫీసర్లు తమ స్వాధీనంలో ఉంచుకోగలిగిన కొన్నిటికీ మధ్య అగ్నివర్షం కురిసింది.

వెంటనే బొంబాయి కార్మికులు నావికులపట్ల సానుభూతి సూచకంగా సమ్మె ప్రారంభించారు. అనేక కార్మికుల పేటల్లో బ్యారికేడ్లను నిర్మించి, బ్రిటిషు సైనికుల టాంకుల్నీ, ఫిరంగి శకటాలనూ, కొన్ని రోజులు వరుసగా ఎదుర్కొన్నారు. భారత కమ్యూనిస్టుపార్టీ బొంబాయి కమిటీ నావికులతిరుగుబాటును బలపరచింది. కార్మికులు ప్రారంభించిన పోరాటంలో పూర్తిగా పాల్గొంది. శ్వేత సైనికుల ఫిరంగి గుండ్లకు 400 మందికి పైగా బలిఅయారు.

అంతేకాదు. కార్మికులు, నగరవాసులు, స్త్రీలు, పురుషులు హార్బరులో గుమిగూడి, ఓడల్లోని తమ "పిల్లవాళ్ళకు" ఆహారం మొదలైన నిత్యావసర వస్తువు లందించారు.

త్వరలోనే తిరుగుబాటుదార్లు "భారతదేశం విడిచిపొండి!" "భారతదేశం చిరస్థాయిగా వర్ధిల్లుగాక!" అనే నినాదాలతో ముందుకొచ్చారు. హిందూ—ముస్లిం నావికులమధ్య, హిందూ—ముస్లిం ప్రజానీకంమధ్య సంపూర్ణ ఐక్యత వ్యక్తమయింది.

నావికులచే ఎన్నుకోబడిన సమ్మె కమిటీ తన కార్యాలయమున్న ఓడమీద మూడు పతకాలను ప్రతిష్టించింది: ఒకటి, జాతీయ కాంగ్రెసు యొక్క త్రివర్ణ పతాకం; రెండు, ముస్లిం లీగ్‌యొక్క పచ్చచంద్రిక; మూడు, అరుణ పతాకం.

నావికుల తిరుగుబాటుకు కొద్దిరోజులముందు రాయల్ ఇండియన్ ఎయిర్‌ఫోర్స్‌కు చెందిన వైమానికులు సమ్మె ప్రారంభించారు. చాలచోట్ల ఇండియన్ సిగ్నల్‌కోర్‌కి చెందిన సైనికులుకూడా సమ్మెచేశారు. సమ్మెదారులైన కార్మికులపైన, సైనికులపైన తుపాకులు కాల్చమన్న బ్రిటిషు అధికార్ల ఆజ్ఞలను సైనికులు ఉల్లంఘించిన సందర్భాలుకూడా ఉన్నాయి:

ఈ విధంగా. భారతదేశంలో బ్రిటిషు ప్రభుత్వానికి ఆఖరుగా అండగావున్న సైన్యం, నౌకాబలం, వైమానికబలం తమ విదేశీ యజమానులమీద తుపాకు లెక్కుపెట్టారు, భారతదేశంలో జాతీయ విప్లవ పెల్లువ అత్యున్నత శిఖరా న్నందుకొంది.

కాంగ్రెసు నాయకులు, లీగ్ నాయకులు కూడా నావికుల తిరుగుబాటులో జోక్యం కల్పించుకొని, వారి కోర్కెలు మన్నింపబడతాయని హామీ యివ్వడంతో సమ్మె విరమింపబడింది; అంతవరకు గజగజలాడుతూన్న బ్రిటిషు అధికార్లు నావికుల కొన్ని కోర్కెల కంగీకరించారు. కాని, వాటిని అమలు జరిపే ఉద్దేశం వారికి లేదు; అలా వారు అమలు జరపనూలేదు.

దీని అర్థం, జాతీయ వెల్లువ 1946 మధ్యలో ఆగిపోయిందనికాదు. అనేక పరిశ్రమల్లోను, పోస్టల్ తదితర ప్రభుత్వ శాఖల్లోను పెద్ద పెద్ద సమ్మెలు కొనసాగాయి.

అంతేకాక, ఆయేడు, మరుసటి యేడు బెంగాల్ రైతాంగం కనీ విని యెరుగనంతటి విస్తృతమైన, బలీయమైన పోరాటం — తేభాగా ఉద్యమం — సాగించారు. కౌలురేటును పంటలో మూడవ వంతుకు తగ్గించమనేది వారి కోరిక.

హైదరాబాద్, కాశ్మీర్, తిరువాన్కూరు — కొచ్చిన్ మొదలైన సంస్థానాల్లోకూడా అపూర్వమైన పోరాటాలు పెల్లుబికాయి. తిరువాన్కూరులో రైతులు పున్నప్రా, వాయలార్‌లో సాయుధ తిరుగుబాటు జరిపారు. అన్నిటికంటే ముఖ్యంగా, హైద్రాబాద్ సంస్థానంలో నాలుగు జిల్లాలకు చెందిన రైతాంగం భూస్వాములకు, నైజాం నవాబుకు వ్యతిరేకంగా భూమికొరకు, సంస్థానం రద్దుకు సాయుధపోరాటం జరిపారు.

తీవ్రరూపంలో కొనసాగిన కార్మిక సమ్మెలు, కలకత్తాలో అజాద్ హింద్ ఫౌజ్ ప్రదర్శనలు, నావికుల తిరుగుబాటు, తేభాగా ఉద్యమం, తెలంగాణా రైతుల సాయుధపోరాటం, క్విట్ కాశ్మీర్ ఉద్యమం— యివి భారతదేశంలో యుద్ధానంతరం అత్యుచ్ఛస్థాయినందుకొన్న ప్రజావెల్లువకు ప్రతీకలుగా నిలిచియుంటాయి.

వీటన్నిటిలోను కమ్యూనిస్టుపార్టీ చురుగ్గా పాల్గొంది: కొన్నిటిలో నాయకత్వ పాత్ర వహించింది,

కానీ, 1946 అగస్టు 16 వ తేదీని ముస్లింలీగ్ ప్రత్యక్ష కార్యా

చరణకు పిలుపు ఇవ్వడంతో, ఆగస్టు తర్వాత ఆకాశంలో కారుమేఘాలు క్రమ్ముకొని, కొద్ది వారాల్లోనే అతి భయంకరమైన హిందూ – ముస్లిం హత్యాకాండ ప్రారంభమయింది.

ఈ సందర్భంలోకూడా మనం జ్ఞాపక ముంచుకోవలసిన విషయ మేమంటే, అందరికంటే పెద్ద అపరాధులు బ్రిటిషు పాలకులు. భారత దేశంనుంచి తాము మూట ముల్లె చంకన పెట్టుకొని వెళ్ళిపోక తప్పదని గ్రహించి. కాంగ్రెసు నాయకులకు "శాంతియుతంగా తాము అధికారాన్ని బదలాయిస్తా" మని ఆశచూపుతూ వచ్చారు. అదే సమయంలో, అట్టి అధికార బదలాయింపువల్ల "ముస్లింలపై హిందువుల పెత్తనం చెలాయించ" డమే జరుగుతుంది "గనుక," కాంగ్రెసు నాయకుల్ని వ్యతిరేకించేటట్లు లీగు నాయకుల్ని ప్రోత్సహించారు.

దీని ఫలిత మేమిటో మనందరికీ తెలుసు. 1947 ఆగస్టు 15 వ తేదీని భారతదేశంపై బ్రిటిషు పాలన అస్తమించింది; దేశానికి స్వాతంత్ర్యం లభించింది. అది గర్వించదగిన, సంతోషించదగిన రోజు. ఎందుచేతనంటే. మూడు తరాల భారతీయులు వీరోచితంగా, దృఢ విశ్వాసంతో, అనంతమైన త్యాగాలు చేసి పోరాడియుండకపోతే, స్వాతంత్ర్యం ఆనాడు లభించియుండేది కాదు. కాని, సంతోషంతోబాటు దుఃఖం, పరాభవంకూడా అలముకొన్నాయి. ఎందుచేతంటే. జిత్తులమారి విదేశపాలకులు దేశాన్ని విభజించి బలహీన మొనర్చడంలో విజయం సాధించారు, ఆ విధంగా వారు స్వతంత్ర భారతదేశంపై రాజకీయంగాను, ఆర్థికంగాను అనేక రూపాల్లో ఒత్తిడి తీసుకురాగల శక్తి వారి కేర్పడింది.

ఇక మన కథ ముగింపుకు వచ్చింది. ముగించేముందు ఒకటి స్పష్టంగా చెప్పవచ్చు. అదేమంటే, మనం జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడుతూన్న దశలో రష్యా విప్లవం, దాని జాతీయ విముక్తిపాత్ర. సోవియట్ యూనియన్‌లో సోషలిజం నిర్మాణం మనకు అపారంగా సహాయపడ్డాయి. అంతేకాదు. భారతదేశం స్వాతంత్ర్య పరివర్తనదశలో ఏ ప్రధాన సమస్యలనైతే పరిష్కరించుకోలేకపోయిందో. ఏవైతే

మనల్ని యిప్పటికీ వేన్నంటుతున్నాయో, ఆ సమస్యలను సోవియట్ యూనియన్ పరిష్కరించుకొంది, ఎలా పరిష్కరించుకొందో మనం జాగ్రత్తగాను, సమగ్రంగాను అధ్యయనం చేసినట్లయితే, స్వతంత్ర భారతంకూడా రష్యానుంచి ఎంతో సహాయం పొందగల్గుతుంది.

సోషలిజంయొక్క అసలు అర్థాన్ని గురించీ, దాన్ని నిర్మించుకొనే పద్ధతిని గురించీ మాత్రమే కాదు నేనాలోచించేది. సోవియట్ యూనియన్‌నుంచి మనకు అపారంగా లభిస్తూన్న ఆర్థిక; సాంకేతిక సహాయాన్ని గురించి మాత్రమేకాదు నేను చెప్పదలచుకొన్నది. నామనస్సులో ఉన్న సమస్యలు, మత కలహాలు, కులసంఘర్షణలు, భాషా సంఘర్షణలు, ప్రాంతీయ సంఘర్షణలవంటి అనేక విచ్ఛిన్న పోకడలను ఎలాగ రూపు మాపాలి ?

నిజాయితీగల ప్రతి భారతీయుడు యీ రోజున కలగంటున్నది, కష్టపడి పనిచేసే వారందరి స్వేచ్ఛాయుత, ఉత్సాహపూరిత సహకారంతో దృఢంగాను, సమైక్యంగాను నిలబడగల సోషలిస్టు భారతావని నిర్మాణం. మన ఆశయం, ప్రత్యేక భాషల, ప్రాంతాల సంస్కృతిని పెంచిపోషించుకొనే స్వతంత్ర, సుసంపన్న, సమైక్య భారతదేశ నిర్మాణం,

భిన్నత్వంలో ఏకత్వసాధన మన ప్రాచీన ఆదర్శం. దానికి నూతన పరిస్థితుల కనుగుణమైన నూతన రూపాన్ని మనం కల్పించాలి. ఏ దేశాన్నైనాసరే గుడ్డిగా అనుకరించడంవల్ల మనం మన లక్ష్యాన్ని చేరుకోలేం. మన మార్గాన్ని మనం స్వయంగా కనుగొనాలి. అయితే, విభిన్న జాతుల్ని, సంస్కృతుల్ని ఒకే కుటుంబంలో సమైక్య మొనర్చి సఖ్యంగా జీవించేటట్లు చేయకలిగిన సోవియట్ యూనియన్ అనుభవం మనకెంతైనా ఉపయోగపడగలదు. మార్గమధ్యంలో మన మెదుర్కోవలసిన కష్టాలను, అనుభవించవలసిన బాధలను ఆ విధంగా తగ్గించుకోగల్గుతాం.